మనసులో మధురావకాశాల సొగసు
ఎప్పుడూ డ్రీమ్‌ఫ్లవర్ తాజాతనపు సొగసు

పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్
మీరు ఎప్పుడూ వలచే
పరిమళము




CP-1543

Pond's



నవంబరు నెల 'యువ'లో చెల్లూరి సీతారాజేశ్వరరావుగారి 'కాశీపతి' కథ బాలా సింపుల్‌గా వాస్తవానికి దగ్గరగా ఉన్నది. 'అద్దం అబద్ధ మాడింది', 'శర్మిలి' కథలు మంచి ఇంటరెస్ట్‌గా చదువుటకు బాగా నచ్చినవి

—ఆర్. రఘుబీర్ సింగ్, ఏలూరు

'యువ' ముఖచిత్రము చాల ఆకర్ష ణీయంగా ఉంది.

పాటిబండ్ల విజయలక్ష్మిగారి 'ప్రేమ వాహిని' సీరియల్ చాల ఇంటరెస్టుగా ఉంది. ఈ నెల కథల్లో 'కాశీపతి' 'బాకీ' కథలు వైదేహిగారి 'నేల ఒలికిన పాలు' నవల మాకు బాగ నచ్చాయి.

—జి. బల్‌రామ్‌సింగ్, ప్రదీప్‌రాజ్, ఎల్లోజీ, అహ్మద్ హుసేన్, ఇక్బల్, గాజులపేట్, నిర్మల్.

నవంబరు 'యువ' ముఖచిత్రం అత్యంత ఆకర్షణీయంగా ఉంది. వైదేహిగారి 'నేల ఒలికిన పాలు' నవల చదివాము. రచన శైలి మమ్మల్ని ఆకట్టుకుంది.

'అయ్యో నాకో బండి కొనిపెట్టవూ,' 'కాశీపతి,' 'బాకీ,' 'అద్దం అబద్ధ మాడింది' కథలు మాకెంతగానో నచ్చాయి.

—న్యాయపతి రమేష్‌బాబు, విజయ కల్యాణి, విజయ ప్రియ శ్రీలేఖ, పుష్పలత, సంధ్యాకుమారి, వంశీప్రియ, కుమారి లక్ష్మి, కుమారి సరోజారాణి. బరంపురం-1 ఒరిస్సా.

## ముఖ్య గమనిక

దీపావళి ప్రత్యేక సంచిక వెలువరించడంవల్ల డిసెంబరు 'యువ' మార్కెట్‌లోకి రావడం ఆలస్యమైంది. ఎంట్రీలు మాకు చేరే వ్యవ ధానం చాల తక్కువగా ఉండటంవల్ల డిసెంబరు నెల 'క్విజ్' ను జనవరి 1978 సంచికకు వాయిదా వేస్తున్నాం. పాఠకులు గమనించ గలరు.

సంపాదకుడు

యువ




విలువ పరిశీలించండి.
గుణమును పరీక్షించండి.
మీ అంతట
మీరే తెలుసుకోండి.

పాయింట్
డిటర్జంట్ ఉతికే బిళ్ల

గవర్నమెంట్ సోప్ ఫ్యాక్టరీ, బెంగుళూరు వారి నాణ్యమైన ఉత్పాదన.
మార్కెట్ చేయువారు: ⓜ మైసూర్ షేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్, బెంగుళూరు

PDC/52Tel

జనవరి నెల యువ

# భావపరిచయ పోటీ

**బహుమానం రూ. 25-00**

**ఈ కార్టూనుకు హాస్యయుత వాక్య (Caption) కావాలి**



**గమనిక :** వ్యాఖ్యలు పోస్టుకార్డుమీదనే వ్రాయాలి. డిసెంబరు 5వ తేదీ లోపు మాకు చేరాలి.




సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 36 డిసెంబరు, 1977 సంచిక 6

# శ్రద్ధాంజలి

భారత ఫిలిం ప్రపంచంలో ఒక మహోజ్జ్వల తారగా వెలిగిన శ్రీ బి.ఎన్. రెడ్డి, నవంబరు 8 తేదిన భౌతిక దేహాన్ని విసర్జించారు. ఆయన ప్రభావం మాత్రం, ఫిలిం పరిశ్రమ మీద శాశ్వతమైనదిగా నిలబడింది.

1938లో ఫిలిం పరిశ్రమలో ప్రవేశించి, 1960 నాటికి పదకొండు ఉత్తమ చిత్రాలను నిర్మించి, సినిమా దర్శకుడుగా, మరెవరూ పొందని మన్ననలను పొందిన శ్రీ రెడ్డి, సినిమా ప్రపంచానికే కాక, అనేక మంది రచయితలకు, సంఘసంస్కారులకు మరపురాని వ్యక్తి.

శ్రీ రెడ్డి నిర్మించిన కొన్ని చిత్రాలు, సాంఘిక దురాచారాలను ప్రేక్షకుల కళ్ళ ఎదుట పెట్టి, సంఘసంస్కారోద్యమాలకు ఎంతో ప్రోత్సాహమిచ్చాయి.

ముప్పయి సంవత్సరాల కాలంలో, శ్రీ రెడ్డి నిర్మించిన చిత్రాలు పదకొండే; కాని, ఒకొక చిత్రం ఒకొక కళాఖండం. వాటిలో మరీ విశిష్ట మైనవి మల్లీశ్వరి, స్వర్గసీమ, బంగారుపాప. అన్నిటిలోకి అతి సుందర మైనది మల్లీశ్వరి.

శ్రీ రెడ్డి, సౌందర్యపిపాసి. ఆయన తీసిన చిత్రాలలో ఒకదానిలో కూడా ఎక్కడా అసభ్యమైన దృశ్యాలు గాని, మాటలు గాని, పాటలు గాని లేవు. ఆయన నిర్మించిన చిత్రాలలాంటివి మళ్ళీ వస్తాయా అన్నది ఒక పెద్ద సందేహమే.

ఫిలిం పరిశ్రమకు ఒక ఆదర్శ దర్శకుడు, కళాపిపాసకులకు ఒక ఆదర్శము, మిత్రులకు పరమమిత్రుడు అయిన శ్రీ బి. ఎన్. రెడ్డి మృతికి సంతాపిస్తూ. ఆయన కుటుంబానికి మా సానుభూతి తెలుపుతూ, ఆయన ఆత్మశాంతికోసం ప్రార్థిస్తున్నాము.

---




నీలమణి, రాజమూర్తిల స్నేహానికి పదినెలల వయస్సు.

ఇంటర్వ్యూలలో ప్రారంభమైన వాళ్ళ స్నేహం – ఉద్యోగం దొరికిం తర్వాత అద్దె ఇంటిలో మరో మెట్టెక్కిందని చెప్పొచ్చు.

ఇద్దరూ నాలుగ్గోడల మధ్య – ఒకే కప్పుక్రింద కలిసే ఉంటున్నా–చేస్తున్న ఉద్యోగాలు ఒక్కటే అయినా – ఇద్దరి దృక్పథాలు, ఆలోచనలు, పరిస్థితులు విభిన్న ధృవాల్లాంటివి.

కారణం – రాజమూర్తి కేవలం ఉద్యోగరీత్యా కన్నవారికి–ఉన్న ఊరికీ దూరమైపోడం. అయినా తన ఆలోచనలెప్పుడూ అనారోగ్యంతో బాధపడుతున్న తల్లివేపు – పెళ్ళికి ఎదిగున్న చెల్లెలివేపు – ఇంకా చదువుకుంటున్న తమ్ముని వేపు పరిభ్రమిస్తూ ఉండటమే!

నీలమణి జీవితం ఓ విధంగా వడ్డించిన విస్తరిలాంటిదనే చెప్పాలి. తనకీ అంతో ఇంతో బాధ్యతలన్నవి ఉన్నా – తన సంపాదనతో వాటిని ఎదుర్కోగల

తెలివితేటలు- చాకచక్యం- నేర్పు ఉన్న వాడు-నీలమణి.

నీలమణి మంచి రచయిత. ప్రస్తుత సాహితీరంగంలో మంచి పేరున్న వాడు. తన రచనలద్వారా నెల తిరిగే సరికి మరో జీతం సంపాదించుకుంటున్న 'డిమేండ్' గల రచయిత — నీలమణి, ఆ రోజు ఆఫీసుకి వెళ్ళడానికి బద్ధకించి రాజమూర్తి ఇంట్లోనే ఉండిపోయాడు.

"సార్ ? మణిగారున్నారా?" పోస్ట్ మేన్ అడిగేడు.

"ఎక్కడ్నుంచైనా ఉత్తరంవా ?" రాజమూర్తి.

"కాదండీ ! మనీ ఆర్డర్ !"

"ఎక్కడ్నుంచి ?"

"మద్రాస్ నుంచండి ! ఈ వారం 'సాహితి' పత్రికవాళ్ళు వేసిన కథకి పారితోషికంగా యాభై రూపాయలు వచ్చాయండీ !"

"అలాగ్గా ! అయితే ఓ పని చేయండి. ఇక్కడికి దగ్గరేగా ఆఫీసు. వాడిప్పుడు ఆఫీసులోనే ఉంటాడు - వెళ్ళి కలవండి."

"అలాగేనండీ !"

పోస్ట్‌మేన్ వెళ్ళింతర్వాత - సావకాశంగా వరండాలోని వాలుకుర్చీలో కూర్చుని క్రిందటిరోజు తన కొచ్చిన ఉత్తరాన్ని మళ్ళీ చదువుకోసాగేడు — రాజమూర్తి.

'అన్నయ్యా ! - నేను బాగానే ఉన్నాను అమ్మ ఆరోగ్యంమాత్రం అంత బాగా లేదు. మన శాస్త్రిలు గారికి చూపించాను. ఏవో మందులు - టానిక్కులు వ్రాసిచ్చారు. వెంటనే కొని వాడమన్నారు. తమ్ముడు బాగా చదువుకుంటున్నాడు. వాడి పరీక్ష ఫీజు ఈ వారంలో కట్టాలి అక్కడ నీ ఆరోగ్యం జాగ్రత్త. వస్తున్న పండక్కి ఓ పదిరోజులు సెలవుపెట్టి రమ్మని అమ్మ మరీ మరీ చెప్పింది.

నీ చెల్లెలు-సుశీల.'

నెలాఖరురోజులు. ఇంటికి డబ్బెలా పంపించడం ? రవి పరీక్ష ఫీజుకి - అమ్మకి మందులు కొనడానికి కనీసం ఓ యాభై రూపాయలైనా పంపించాలి. ఈ వారం దాటితే వాడి యేడాది చదువు పాడైపోతుంది. డబ్బెలా వస్తుంది ? ఎవరిదగ్గర్నుంచైనా చేబదులు తీసుకోవాలి. ప్చ్ ! లాభంలేదు. త పీ పాటికే తెలిసిన ప్రతి ముఖాన్ని అడిగి చూశాడు. ప్చ్ ! మొండిచేయే ఎదురైంది. నీలమణిని అడిగితే ? అవును. వాణ్ణే అడగాలి. మనీ ఆర్డర్ వచ్చింది కూడా ! వాడు కూడా, 'సారీరా !' అంటాడేంవో ? ...ఇస్తాడేంవో ? అడిగి చూద్దాం. ఆమాత్రం యాభై రూపాయలకి కాదంటాడా?...

సాయంత్రం నీలమణి ఇంటి కొచ్చిం తర్వాత - రాజమూర్తి తనని అడిగేడు కాని — మణి, మూర్తి పరిస్థితిని అర్థం

చేసుకోడానిక్కూడా ప్రయత్నించ కుండా, "సారీ బ్రదర్! నా దగ్గరుంటే తప్పకుండా ఇచ్చేవాణ్ణి! నీకు తెలియందేముంది చెప్పు! నెలాఖ రోజులు! వచ్చే వారమైతే ఫర్లేదు గాని - ఈ వారంమాత్రం లాభం లేదురా!" అనేశాడు.

రాజమూర్తి మరేం అన్లేక ఊరు కున్నాడు. మణి పావుగంటలో 'సీట్'గా తయారై వీధిలోకి వెళ్ళిపోబోతూ అన్నాడు: "ఒరే, మూర్తీ! నీ కీ విషయం తెల్సా? బహుశా నీకు తెల్సుం డదులే! సాహితి పత్రికవాళ్ళు నవలల పోటీ పెట్టబోతున్నారురా! ఈసారి ఆ పోటీలో మొదటి బహుమతి నెలా గైనా కొట్టేయాలిరా! వేశ్యల జీవితాల మీద ఓ మంచి నవల రాయాలను కుంటున్నాను. కథా వస్తువు మంచిదే నంటవా?"

"వస్తువు మంచిదే! అయితే ఊహించి వ్రాసేకంటే- వాళ్ళ జీవితాల్ని బాగా 'స్టడీ' చేసి రాస్తే నవల వాస్త వానికి దగ్గరగా వస్తుంది. అప్పుడే నీ నవల పాఠకుల్ని ఆకట్టుకుంటుంది."

"అయితే ఏంజేస్తే బావుంటుంది? వాళ్ళ జీవితాల గురించి బాగా తెల్సు కునే దెలా?" స్వగతంలా అన్నాడు మణి.

"దానికేం వుందిరా? వాళ్ళని కల్సుకుని ఓ పదిరూపాయలు పారేశా వంటే నీక్కావాల్సిన వివరాలు వాళ్ళే చెబ్తారు."

"గుడ్ ఐడియారా! బాగా వృత్తిలో అనుభవం ఉన్నవాళ్ళని కలిస్తే బావుంటుంది కదూ?" మణి.

"అవున్రా? మన ప్రక్కవీధి చివరింట్లో ఈ మధ్యే రాజమండ్రినుంచి వచ్చిన ఒకామె ఉందట. నిన్న మన రామకృష్ణ చెప్పేడు. పైకి 'ఫేమిలీ' మనిషిలా కన్పిస్తున్నా-చాలా కొంపల్ని కూల్చిన రకం అట! ఆవిణ్ణి కలిస్తే నీక్కావాల్సిన వివరాలు దొరకొచ్చు"

"గుడ్ సజెషన్! ఆవిడ దగ్గర్నుంచే నా వేట ప్రారంభిస్తాను ఈ రాత్రి పది గంటలకి ఆవిణ్ణి కలుస్తాను. వస్తారా!" అంటూ వీధిలోకి వెళ్ళి పోయాడు-మణి.

మణి దగ్గర డబ్బుండి కూడా వెధవ తేదనేశాడే? బేంక్ బేలెన్స్ కూడా వాడి దగ్గరుంది. యాభై రూపాయలకి అందరిలా నెలాఖరని దాటేశాడు. ఇంకెవర్నడగాలి? అందరికీ తనలానే నెలాఖరోజులు! ఇంటికి డబ్బెలా పంపించడం? రవి పరీక్షకి ఈ యేడు కాకుంటే - వచ్చే యేడు వెళ్తాడు. అమ్మ పరిస్థితి ఎంతో ఇదిగా లేకుంటే గాని- సుశీల అలా ఉత్తరం వ్రాయదు. అమ్మకి గుండెపోటు మరీ ఎక్కువై ఉంటుంది. ఇలాంటపుడు కనీసం ఓ యాభై అయినా పంపించకపోతే యెలా?

ఒఁహవేళ తను డబ్బు పంపించ (లే)క పోతే ? అమ్మ పరిస్థితి అటో-ఇటో ? ...అమ్మో ! ? ... అలా జరగడానికి వీల్లేదు. త నెలాగైనా డబ్బు పంపించాలి, అయితే ఎలా ??...

అలా ఆలోచనల్తో సతమతమవుతూ అప్రయత్నంగా టేబిలుమీదున్న తన 'ఆల్బమ్' పేజీలు తిరగవేస్తున్న రాజమూర్తి చూపులు ఓ పేజీలో నిల్చి పోయాయ్ ! బుర్రలో ఓ మెరుపు మెరిసింది.

* * *

ఆ రాత్రి నీలమణి, మూర్తి చెప్పినట్లు ప్రక్కవీధి చివరింటివేపు ఆ వీధిలో జనం పల్చబడింతర్వాత వెళ్ళాడు. తనెంత రచయితైనా నీలమణి కేవలం కాగితాల పులిమాత్రఁవే ! వీధిలోకంటే వెళ్ళేడుగాని - ఆ ఇంట్లోకి వెళ్ళడానికి ధైర్యం చాల్లేదు. కారణం- ఇలాంటి వ్యవహారానికి నీలమణి క్రొత్తవాడు కావటం ! ఆ ఇంటిముందు తచ్చాడుతూ ఉంటే - 'ఆమె' మణి పరిస్థితి గ్రహించి- "అక్కడే నిలబడి పోనారేటండీ ? లోనికి రాండి!" అంటూ తన పాకలోకి తీసుకుపోయి - కూర్చోడానికి బి. సీ. నాటి నులకమంచాన్ని చూపించింది. లోపల మిణుకు మిణుకు మంటున్న ఓ గుడ్డిదీపం ఉన్నా ఒకరి ముఖం మరొకరికి సరిగ్గా కన్పించటం లేదు ! 'ఇదీ ఒకందుకు మంచిదేలే' - అనుకుంటూ మంచంమీద కూర్చున్నాడు - మణి. తను కూడా ప్రక్కనే కూర్చుంటూ ఫక్కున నవ్వుతూ జాకెట్టు గుండీలు విప్పసాగిందామె.

"నే వచ్చింది నీ శరీరంకోసం కాదు. ఇలాంటి వెకిలిచేష్ట లేవీ చెయ్యకు !" అన్నాడు మణి.

ఆ సుందరి కొన్ని క్షణాలు తెల్లబోయింది.

"ఇదుగో ఈ అయిదు రూపాయలు తీసుకుని - నే నడిగే ప్రశ్నలకి నీకు తెలిస్తే సమాధానాలు చెప్పు."

"అనాగేనండి !" సంతోషంగా ఆ నోటు రైకలో దోపుకుంటూ అంది.

మణి తన జేబులోంచి చిన్న సైజు డైరీ-పెన్ను తీశాడు. తనకాకవాల్సిన విషయాలు ఆమె చెబుతూంటే - కొండంత ఉత్సాహంతో డైరీలో రాసుకోసాగేడు - అతి కష్టంమీద.

అంతవరకూ లేని మూడోవ్యక్తి తామిద్దర్నీ తినేసేటట్లు చూస్తుండటం గమనించిన ఆ సుందరి భయంతో మణి దగ్గరికి జరిగి కూర్చుంది.

"వెధవ్వేషా లెయ్యొద్దని ముందే చెప్పానా, లేదా ?" అంటూ చిరాగ్గా తలెత్తిన మణి ఎదుటివ్యక్తిని చూసి భయంతో కంపించిపోయాడు.

ఎర్రటోపీ-పంగనామాలు-పెద్దపెద్ద మీసాలు-చేతిలో లాఠీతో ప్రత్యక్షఁవైన ఆ అవతారం ఓ హెడ్‌కానిస్టేబుల్‌దని



గ్రహించిన మణి నోట మాటరాక భయంతో వణికిపోసాగేడు.

"ఏయ్ మిస్టర్ ! చూడ్డానికి మంచి కుటుంబంలోంచి వచ్చినట్లున్నావ్ ! ? ఈ వెధవపని చేయడానికి సిగ్గులేదూ?"

"సార్ ! సార్ ! నే నటువంటి వాణ్ణికాదు సార్ ! నే నసలు ఆ ఉద్దేశంతో ఇక్కడికి రాలేదు సార్ ! నేను రచయితనండీ ! కథకి 'ప్లాట్' కోసం వచ్చానండి !..."

"స్టాపిట్ ! నాన్‌సెన్స్ ! చేసిన వెధవపనికి సమర్థింపు కూడానా ! ? పద ! పద !"

"ఎక్కడికి సార్ ?"

"ఆమాత్రం తెలవదా ? - పోలీస్ స్టేషన్‌కి !"

"సార్! సార్ ! అంత పనిమాత్రం చేయకండి సార్ ! నా జేబులో ఉన్న దంతా ఇచ్చేస్తాను. ఈసారికిమాత్రం నన్ను వదిలేయండి సార్ !"

"........."

"సార్ ! సార్ ! కాస్త దయ చూపించండి సార్ ! నన్ను గనక మీరు స్టేషనుకి తీసుకె_ళ్తే, నాకున్న పేరంతా పోతుంది సార్ ! ఈసారికి మాత్రం వదిలేయండి సార్ !

మరెప్పుడూ ఈ ఛాయలకి రాను సార్!"

"స్సరే ! ఎంతుందేఁవిటి-జేబులో?"

"లెక్కపెట్టలేదు సార్ ! సుమరో అరవై దాకా ఉంటుందండి ! తీసుకోండి సార్ !"

"స్సరే ! నీవు రచయితవి గనక బ్రతికిపోయావ్ ! ఇకనుంచైనా జాగ్రత్తగా ఉండు."

"థాంక్యూ సార్ ! వస్తాను సార్!"

* * *

మరుసటిరోజు ఉదయం మణి లేస్తూనే స్వగతంలా అనుకున్నాడు :

"రాజమూర్తికి యాభై రూపాయలు అడిగినప్పుడు ఇచ్చినా బాగుండేది ! ఖర్మ ! అలా జరగాలనుంటే అంత మంచి బుద్ధెలా పుడుతుంది ? ప్చ్ఁ ! ప్రాప్తం లేదంతే! ఇలా వచ్చిన యాభై రూపాయలు - అలా ఎగిరిపోయాయ్. డబ్బుపోయినా కాస్తో - కూస్తో వివరాలు సేకరించగలిగాను. నలుగురి దృష్టిలో పడకుండా ఉండగలిగాను. అంతే చాలు ! ... "

మణి మాటలు ప్రక్కనే ఉన్న రాజమూర్తికి విన్పించకపోలేదు.

"ఏఁవిట్రా ? నీతో నీవే గొణుక్కుంటున్నావ్ ? నీకోసం రాత్రి చూసి చూసి నిద్రపోయాను." రాజమూర్తి.

"అబ్బే ! ఏఁవీ లేదురా ! రాత్రి నే నొచ్చేటప్పటికి పది దాటిందిలే ! అప్పటికి నీవు మంచి నిద్రలో ఉన్నావ్ !"

"వెళ్ళిన పని అయిందా ?"

"ఆఁ, అయినట్టే !"

రాజమూర్తి తన టేబులు సొరుగులోని 'ఆల్బమ్' మధ్య పేజీలోని ఫొటో వేపు తదేకంగా చూస్తూ అనుకున్నాడు. మూణ్ణెల్లక్రితం ఓల్డ్ బాయిస్ కాలేజీ డే ఫంక్షన్ నాటకంలో తను వేసిన హెడ్ కానిస్టేబుల్ పాత్రకి బహుమతితోబాటు లభించిన 'యూనీఫాం'కి అర్థఁవూ - పరమార్థఁవూ లేదని అప్పుడు అన్పించినా - రాత్రి మాత్రం అవసరానికి మంచి మిత్రునిలా అ 'యూనీఫాం' ఆదుకుంది."

'నీ మిత్రుని అలా మోసం చేయడం న్యాయంగా లేదు సుమా !' అంతరాత్మ లోపల్నుంచి అరుస్తున్నా- ఇందులో మోసవేఁ వుంది ? పది, పదిహేను రోజుల్లో నా 'ఓవర్ టైం' డబ్బు ఎలానూ వస్తుంది. అప్పుడు అసలు విషయం వాడికి చెప్పి డబ్బిచ్చేయొచ్చు. పైగా ఈ 'హింట్' ఆధారంతో వాడు ఓ మంచి కథ రాయడానికి ఆస్కారం కలిగించొచ్చు కూడా ! అంటూ అంతరాత్మ నోరు నొక్కేశాడు- రాజమూర్తి !

—: o: —

డిశంబరు నెల యువ భావపరిచయ పోటీ

*బహుమతి పొందిన వ్యాఖ్య*




*" వనిత విలువకన్న*

*వలువల విలువే మిన్న "*

కె. సుబ్బారెడ్డి, ఎల్. బి. జి. 37,

విశాఖపట్నం.


మన పెళ్ళయింతర్వాత నిన్ను ఉద్యోగం మానమని
నేనెప్పుడూ బలవంత పెట్టను... సంసారం నడిచేందుకు
ఎవరో ఒకరు
సంపాయించాలిగా మరి!!
శశిధర్


ఏమేవ్! రింగులు కొత్తవా!
బాగున్నాయి ఎక్కడకొన్నా!
ఏంలేదే! ప్రొద్దున
మా అమ్మ చేసిన
చేగోడిలు
పెట్టుకొన్నా!!



# ఊరు కాటేసింది

## 1

రాజమండ్రి నుంచి కోటిపల్లిపోయే బస్సు, దుమ్ము రేపుకొంటూ, చీకటివేళ 'పాలెం' పుంతదగ్గర ఆగింది. సోమేశ్వరం దొమ్మీకేసులో అన్యాయంగా యిరికించబడి, ఏడాదిపాటు జైలుశిక్ష ననుభవించిన రాయుడు బస్సు దిగి, అప్పలస్వామి టీ దుకాణం దగ్గరకు వెళ్ళి, బయటున్న బెంచిమీద కూలబడి, సోడా కొట్టమన్నాడు. 'చలికాలంలో సోడా ఏమిటయ్యా ?!' అని అనబోయిన అప్పలస్వామి, రాయుణ్ణి లాంతరు వెలుతుర్లో చూసి, తమాయించుకొని ఊరుకొన్నాడు. రాయుడు పదపైసల బిళ్ళ అప్పలస్వామి మీదకు విసిరేసి, సోడా తాగి, ఖాళీ సీసాని పక్కనే ఉన్న తొట్టిలో పడేశాడు. 'బస్సు దిగగనే ఏ మొహం పెట్టుకొని ఊళ్ళోకి వెళ్ళాలా,' అని రాయుడు దారిపొడుగునా ఆలోచిస్తూనే ఉన్నాడు. ఎవ రేవిధంగా అనుకొంటారో ఏమోనని భయపడ్తూనే వచ్చాడు. సోడా కొట్టు – టీ దుకాణం, నడుపుతున్న అప్పలస్వామి ఏ విధమైన ప్రశ్నలు అడక్కపోవడంతో, రాయుడి మనస్సు కొంత కుదుట

బడింది. ఉన్నట్టుండి రాయుడే ప్రశ్నించాడు, "ఊళ్ళో విశేషా లేమిటి ?" అని. రాయుడి గొంతులో కరుకుదనం చూసి, అప్పలస్వామికి బెదురు పట్టుకొంది. "ఏమున్నాయి దొరా, అంతా మామూలే !" అనగలిగాడు, తడబడుతున్న మాటలతో. వాడి బెదురు చూసి రాయుడికి నవ్వొచ్చింది. ఆ క్రీనీడల్లో రాయుడి నవ్వు, అప్పలస్వామికి విషపు నవ్వులా కనిపించింది. "నాయు దేమం టున్నాడు ?" రాయుడు కావాలనే మరింత కర్కశంగా ప్రశ్నించాడు. అప్పలస్వామి యిరకాటంలో పడిపోయాడు. నోట సమాధానం రాలేదు. రాయుడు సమాధానం ఆశించనూలేదు. మౌనంగా లేచి ఊరిదారి పట్టాడు.

శీతాకాలపు చలిగాలి, తాటి తోపుల్లోంచి జివ్వుమంటూ వీస్తోంది. ఇసక పుంతలో నడుస్తున్న రాయుడికి, ఆ చీకట్లో తాటిచెట్లు, చిక్కిపోయి ఏడుస్తున్న దెయ్యాల్లా కనబడ్డాయి. ఏడాదిపాటుగా, సాయంత్రం ఆరయ్యేసరికి కటకటాల వెనక్కి వెళ్ళటం అలవాటయిన రాయుడికి, ఆ తాటిచెట్లు ఆరుబయట కటకటాల్లా-ఊరు అనే జైలుచుట్టూ కటకటాల్లా తోచాయి. ఓ తీతువు పిట్ట వికృతంగా అరుచుకొంటూ రాయుడి నెత్తిమీదుగా ఎగిరిపోయింది. రాయుడికి ఎడం కన్ను అదిరింది. గుండె నిబ్బరం చెదిరింది. అయినా ధైర్యం చిక్కబట్టుకొని, అలవాటు తప్పిన చీకటి దారిని అడుగడుగూ వేసుకొంటూ నడుస్తున్నాడు. రామకోవెలలో దీపం మినుకు మినుకు మంటోంది. కోవెల ముందు గంగరావి చెట్టు, కాపలా కాస్తున్న రాక్షసిలా ఉంది. కాళ్ళు మరి ముందుకు కదలడానికి తిరస్కరించడంతో, చెట్టుచుట్టూ ఉన్న సిమెంటు తిన్నె మీద కూలబడ్డాడు.

ఒక్క వీధి దాటితే చాలు, తన యిల్లు వస్తుంది. తలుపు తట్టగానే కూతురు 'మంగ' తలుపు తీస్తుంది. అప్పుడు...? జైలునుంచి తిరిగి వచ్చిన తను మంగతో ఎలా మాట్లాడ్డం ప్రారంభించాలి ? రాయుడి కేమీ తోచలేదు. ఏదో రకమైన భయం, గుండె దడా, కాళ్ళను కట్టిపడేస్తోన్నా, మమకారపు పొంగులు గుండెని నింపడంతో, ఎక్కడలేని శక్తినీ కూడదీసుకొని లేచాడు. వడివడిగా అడుగు లేసుకొంటూ, వీధి దాటి యిల్లు చేరి, తలుపు తట్టాడు.

## 2

ఆ రోజల్లా మంగకు మనసు మనసులో లేదు. పదిగంటలకు పోస్ట్‌మాన్ కవ రిచ్చి వెళ్ళగానే, వణికే చేతుల్తో కవరు చింపి, ఉత్తరం చదువుకొంది. జైలునుంచి విడుదలై తన తండ్రి వస్తున్నాడు. మంగకు కాలు నిలవలేదు.

"అత్తమ్మా, నాన్న వస్తున్నా డివ్వాళ !" అంటూ ఆవేశంగా అరుచుకొంటూ, వంటింట్లోకి పరుగెత్తింది. వాటేసుకొన్న మేనకోడల్ని సీతమ్మ తల నిమురుతూ అంది, "వెర్రిదానా, నీకోసం కూడా తమ్ము డెంత బెంగ పెట్టు కొన్నాడో ? నిన్ను చూడగానే...?" సీతమ్మ మరి మాట్లాడలేదు. నిజానికి మాట్లాడలేకపోయింది. అలలా లేచిన సంతోషం, మంగలో ఒక్కసారిగా విరిగి పడిపోయింది. అచేతనంగా అత్త ఒడిలో ఒదిగిపోయింది. చెప్పలేని దిగులూ, భయమూ మంగని ఆవహించాయి. అవును, తండ్రి తననీ పరిస్థితిలో చూస్తే...?

ఆ రోజు ఉదయం రాయుణ్ణి, ఇరుగు పొరుగులందరూ తలుపు సందుల్లోంచీ, కిటికీ చాటుల్లోంచీ చూస్తుండగా, పోలీసులు సంకెళ్ళు వేసి తీసుకుపోయారు. భరించరాని అవమానంతో తల వంచేసుకొని పోలీసుల మధ్య వెడ్తున్న తండ్రిని– తల్లి పోయిన తర్వాత తల్లీ, తండ్రీ తానే అయి పెంచిన తండ్రిని – అయిన వాళ్ళెంత పోరినా మారు మనువు చేసుకోకుండానే తనే సర్వస్వమూ అనుకొని పెంచిన తండ్రిని – చూస్తూ గుండె లవిసిపోయేటట్లుగా ఏడ్చింది మంగ. మొగుడుపోయి వేరు ఆసరా లేక, తమ్ముడి పంచను చేరిన సీతమ్మ పోలీసులు తీసుకుపోతున్న తమ్ముణ్ణీ, భోరుమని ఏడుస్తున్న మంగనీ చూసి, తను కూడా ఏడవడం తప్ప మరేమీ చెయ్యలేకపోయింది. అయితే కాలసర్పం వేసే కాట్లు కలవాటుపడ్డ ప్రాణం కాబట్టి, నిలదొక్కుకుని, నెమ్మది నెమ్మదిగా మంగని ఓదారుస్తూ, ఓ దారికి తీసుకురాగలిగింది. మధ్య మధ్యలో తండ్రి దగ్గర్నించి వస్తున్న ఉత్తరాలతో మనస్సు కుదుటబెట్టుకొని, మంగ రోజులు లెక్కిస్తూ ఎదురుచూస్తున్నప్పుడు, విధి మళ్ళీ దెబ్బతీసింది.

ఉన్నట్టుండి గుళ్ళో పూజారి ఓ సాయంత్రం రొప్పుతూ వచ్చాడు. సీతమ్మ యిచ్చిన మంచినీళ్లు తాగి, విషయం చెప్పాడు. "ఇవ్వాళ నేను ఏదో కోర్టు పనిమీద రాజమండ్రి వెళ్ళవలసి వచ్చింది వ్యవధి చిక్కడంమూలాన, బాగోగులు కనుక్కుందామని రాయుణ్ణి కలుసుకొన్నాను ..." మంగ కళ్ళలో ఏదో మెరుపు. సీతమ్మ గుండెల్లో ఏదో భయం... "నిన్నటికి పదో లంఖణం. టైఫాయిడ్ జ్వరం. జ్వరంమూలాన కాకపోయినా, మీ యిద్దరిమీదా బెంగతో చిక్కి శల్యమైపోయాడు. మీ రనవసరంగా కంగారు పడ్తారని ఉత్తరం వ్రాయ లేదన్నాడు. నేను నచ్చచెప్పగా అతి బలవంతంమీద, మీ రక్కడకు వచ్చి చూడ్డాని కొప్పుకొన్నాడు. నేను రేపు ఉదయం మళ్ళీ రాజమండ్రి మొదటి

బస్సుకి వెళ్ళవలసి ఉంది. ప్లీడరుగారికి కొంత ఫీజు ముట్టించుకోవాలి. మీరు తెల్లవారుఝామున నాలుగున్నరకల్లా తయారుగా ఉంటే, నేను వచ్చి మిమ్మల్ని తీసుకువెడ్తాను. మీరు రోజల్లా రాయుడి దగ్గరుంటే, నా పనులు పూర్తి చేసుకొని, సాయంత్రం బస్సుకి తిరిగి రావచ్చు. ఏమంటారు ?"

ఆవేదనతో నలిగిపోతూ, భారంగా రోజులు గడుపుతున్న మంగా, సీతమ్మా వెంటనే ఒప్పుకొన్నారు. ఆ రాత్రి వాళ్ళిద్దరికీ కలత నిద్రే శరణ్యమైంది. అన్నప్రకారం పూజారి తెల్లవారకముందే వచ్చాడు. ఇంటికి తాళం వేసి, పూజారివెంట బయలుదేరారిద్దరూ. రామాలయం దగ్గరకు వెళ్ళిన తర్వాత, "మీ రిక్కడే ఉండండి. నా చేతిసంచి పట్టుకొని ఒక్క నిముషంలో వస్తాను," అని పూజారి, ఆలయం వెనుక దిగువగా పల్లంలో ఉన్న తన యింటికేసి వెళ్ళాడు. అడుగుల సవ్వడి విని, వెనక్కు తిరగబోయిన మంగనీ, సీతమ్మనీ బలమైన చేతులు పట్టి, నోళ్ళు నొక్కేశాయి. ఆ చీకట్లో ఏమైందీ తెలియక భయంతో గింజుకొంటున్న వాళ్ళిద్దర్నీ, అరిచిన అరుపులన్నీ గొంతుకల్లోనే ఉండిపోగా, ఆలయం దిగువలోకి ఈడ్చుకొంటూ పోయి, పూజారి యింట్లో వెనుక గదిలో కూలేశారు — ఆ ఊళ్ళో కొత్తగా ప్రాక్టీసుపెట్టిన కుర్రడాక్టరు రంగనాథమూ, ఆ ఊరి హైస్కూలు హెడ్మాస్టరు పేరిశాస్త్రీ. యిద్దరికీ నోట్లో గుడ్డలు కుక్కి, కట్టిపారేశారు. ఆవరణలో తన కేమీ సంబంధం లేనట్టుగా పూజారి నేరేడుచెట్టు మాటున కూర్చున్నాడు. అంతలో పేరిశాస్త్రి వెళ్ళి, పూజారిమీదకు ఓ నోట్ల కట్ట విసిరేశాడు. అందిన నాలుగొందలూ పంచెకట్టులో దాసుకొని, చేల గట్లమ్మట అడ్డబడి, రాజమండ్రి వెళ్ళే మొదటి బస్సు ఎక్కేశాడు పూజారి.

తూర్పు తెల్లవారి, లోకమంతా వెలుగుతో నిండిపోయే తరుణంలో, సీతమ్మ కళ్ళెదురుగుండానే మంగని చీకటి ఆక్రమించింది.

ఆ మధ్యాహ్నం తిరిగి వచ్చిన పూజారి రెండు రోజులు రామాలయంలోనే గడిపేశాడు పాపచింతన లేని మనస్సుతోటీ, మలినమైన చేతుల్తోటీ, మంగళహారతు లిచ్చాడు.

మోజు తీరిన మూడో రోజు అర్ధరాత్రి — పేరిశాస్త్రి యిద్దర్నీ తీసుకుపోయి దూరంగా చేల మధ్యగా వదిలేశాడు. "మీరు రోడ్డున పడితే మా కభ్యంతరం లేదు. అందరికీ శ్రేయస్కరమైన మార్గం మీకు తెలిసే ఉండాలి ? ! "

పేరిశాస్త్రి మాటలు చెవుల్లో గింగురుమని మ్రోగుతుండగా, ఇద్దరూ అతి కష్టం మీద యిల్లు చేరుకొన్నారు.

ఆలోచించే పరిస్థితిలో లేదు మంగ. సీతమ్మ చెదిరిన గుండెని కూడ దీసుకొని శతవిధాలా ఆలోచించింది. ఏంచెయ్యాలి ? అన్నింటికి సమాధానం ఒక్కటే. పేరిశాస్త్రి చెప్పకనే చెప్పాడు. అదే-మౌనం.

నాలుగురోజులు అన్నపానాలు ముట్టలేదు మంగ. సీతమ్మ నెమ్మది నెమ్మదిగా మంగని మామూలు మనిషిగా చెయ్యడానికి ప్రయత్నించి, సఫలురాలే అయింది. ఓ విధమైన నిర్లిప్తత ఆవహించడంతో, మంగ మామూలుగా మసలసాగింది. 'ఎందు కిలా జరిగినట్లు ? వాళ్ళకు మనం ఏ అపకారం చేశామని ?' సీతమ్మ చాలామార్లు వాపోయింది. మంగ, గతంలోకి చూసి సమాధానం చెప్పగలిగింది.

పేరిశాస్త్రి రౌడీవెధవ. స్కూలు రోజుల్నుంచీ వాడు చేసిన జులాయి పన్లకు లెక్కలేదు. ఏదో హెడ్మాస్టరు కొడు కవడంమూలాన, ఆ హెడ్మాస్టరు ఊరి పెద్దల తొత్తు అవడంమూల్సాన, మిగిలిన మాస్టర్లందరూ ఎలాగో భరిస్తూ వచ్చారు. మంగ తొమ్మిదో క్లాసులో ఉన్న రోజులవి. పెద్ద మనిషి కావడం మూలాన, వోణీ, పరికిణీ వేసుకొని స్కూలుకు వెళ్ళిం దారోజు. అప్పటికే స్కూలుఫైనలు చదువుతున్న పేరిశాస్త్రి లొట్టలు వేశాడు మంగని చూసి. ఆ రోజు సాయంత్రం స్కూలునుంచి తిరిగి వెడ్తున్న మంగని వెటకపాటుగా వెళ్ళి వాటేసుకొన్నాడు. వాడి చెంప ఛెళ్ళుమనిపించి, పట్టునుంచి విడిపించుకొని యింటికి పరుగెత్తుకొంటూ వెళ్ళింది. తండ్రికీ, అత్తకూ చెప్పలేక భయంతో సతమతమైపోయింది. రెండురోజులు, నలతగా ఉందన్న నెపంతో స్కూలుకి వెళ్ళలేదు. మూడో రోజున భయం భయంగానే స్కూలుకి వెళ్ళింది. విశ్రాంతి సమయంలో వంటరిగా ఉండడం చూసి, విలాసంగా దగ్గరకు నవ్వుతూ వెళ్ళాడు పేరిశాస్త్రి. ఏదో మాటన్నాడు. ఎక్కడలేని ధైర్యం తెచ్చుకొని బొంకింది. "జాగ్రత్తగా ఉండు ! మా నాన్నకి చెప్పాను. మా అత్త అడ్డు కోవడంవల్లకాని, ఈపాటికి నీ నెత్తురు కళ్ళ జూసేవాడు !" ఆ తర్వాత పేరిశాస్త్రి, మంగ జోలికి వెళ్ళలేదు. పై చదువులకని కాలేజీకి పోయాడు

ఇన్ని సంవత్సరాల తర్వాత కూడా పేరిశాస్త్రి మనసులో మంగమీద కామతృష్ణ చల్లారలేదు. అది చివరకి భయంకర రూపం దాల్చి, మంగని దహించింది.

రాయుడు జైలు కెళ్ళిన నెల్లాళ్ళకు సీతమ్మకు జ్వర మొచ్చింది. సీతమ్మా, మంగా ధర్మాసుపత్రికి వెళ్ళారు. డాక్టరమ్మ పురిటి కెళ్ళిందని తెలిసి, అప్పుడే కొత్తగా ప్రాక్టీసుపెట్టిన రంగనాథం దగ్గరకు వెళ్ళారు. సీతమ్మ చెయ్యి పుచ్చుకొని నాడి చూస్తున్న రంగనాథం కళ్ళు, మంగమీద పడ్డాయి. ఏవో మందు లిచ్చాడు. "రే పుదయం వస్తే, మరో మూడు మోతాదులు మందిస్తాను" అని చెప్పి పంపించేశాడు. ఆ మర్నాడు సీతమ్మకి బాగా నీరసంగా ఉండడం వల్ల, మంగని మందుకని పంపింది. మందు లేవో కొనడానికని కాంపౌండరు రాజమండ్రి వెళ్ళడంమూలాన, రంగనాధ మొక్కడే ఉన్నాడు. పలకరించి కుర్చీలో కూర్చోబెట్టాడు మంగని. సీతమ్మ వంట్లో ఎలా ఉన్నదీ చెప్పింది మంగ. "ఇక్కడే కూర్చోండి. మందు కలిపి తీసుకొస్తాను" అని రంగనాథం లోపలికి వెళ్ళాడు. కొంతసేపు పోయిన తర్వాత, భుజాలమీద చేతులు పడ్డం చూసి ఉలిక్కిపడింది మంగ. మంగ కళ్ళలోకి మత్తుగా చూస్తూ అన్నాడు రంగనాథం. "అభ్యంతరం లేకపోతే ... " మాట పూర్తికాకముందే, శక్తినంతా కూడదీసుకొని మంగ కుర్చీలోంచి లేవబోతూంటే, చెయ్యి పట్టుకొని దగ్గరకు లాక్కొన్నాడు. రంగనాథం చెయ్యి కొరికి మంగ వీధిలోకి పరుగెత్తింది.

ఉత్తి చేతుల్తో తిరిగి వెళ్ళిన మంగని "మందు తీసుకురాలేదేం ?" అని అడిగింది సీతమ్మ. "జ్వరం తగ్గింది కాబట్టి, ఇహ మందఖ్ఖర్లేదన్నాడు." ముఖం చాటుచేసుకొని సమాధానం చెప్పింది మంగ.

కామాతురుడైన రంగనాథాని కిలా పశువులా బలైపోయింది.

పేరిశాస్త్రీ, రంగనాధమూ రాక్షసుల్లా ప్రవర్తించడానికి కారణం ? అంతా చెప్పి అత్తమ్మని అడిగింది మంగ. "నీ అందమే నీకు శత్రువైందమ్మా" అంటూ మంగని ఒడిలోకి తీసుకొంది. తల నిమురుతూ అడిగింది, "పేరిశాస్త్రి యాగీపెట్టినట్లు నువ్వప్పుడే నాన్నకి చెప్పి ఉంటే బావుండేదేమో ?"

"ఇప్పు డిద్దరూ కలిసి చేసిన ఈ దురాగతానికి, మనమేం చేశాం ? మౌనమే కదా వహించింది. ఊహ తెలియని ఆ వయస్సులోనూ మౌనమే వహించాను. అప్పుడు మీ దగ్గర భయపడ్డాను, మన మిప్పుడు లోకానికి భయపడ్తూన్నట్లుగా." ఆడదాని మనసు తెలిసిన సీతమ్మ మరి సమాధానం చెప్పలేదు.

మంగ నెల తప్పినప్పుడు సీతమ్మ అదిరిపోయింది. జరిగిన రాక్షస



కృత్యాన్ని మరిచిపోయి, మామూలుగా బ్రతకగలరన్న ఆశ చిగురించే సమయంలో, ఆ ఆశని మొదట్లోనే త్రుంచిపారేసిందా పరిణామం. సీతమ్మ కేంచెయ్యడానికీ పాలుపోలేదు. వీలు చూసుకొని రామాలయంలో పూజారిని కల్సుకొంది. "డబ్బు కాశించి దాని బ్రతుకు గంగపాలు చేశావు. ఇప్పుడేం చెయ్యమంటావు ?"

పూజారి సీతమ్మ కళ్ళలోకి చూడలేక మొహం చాటుచేసుకొని సమాధానం చెప్పాడు. "జరిగిందేదో జరిగిపోయింది. ఈ విషయంలో నన్నింక ఈడ్చక పోవడం మంచిది. ఇంకా ఆరంభదశే కాబట్టి, భ్రూణ హత్య కష్టం కాదను కొంటాను !" సీతమ్మకు కోపంతో, నోట మాట రాలేదు. పూజారి మొహం

మీద ఉమ్మేసి తిరిగి వచ్చింది. అనుకోకుండా పేరిశాస్త్రిని కలుసుకొంది. "రంగనాథం పెళ్ళి చేసుకొంటాడేమో అడుగు. కాదంటాడూ, పూజారి సలహా బాగుంది. రంగనాథం డాక్టరు కాబట్టి, వాడి కదెంత పని ? అయినా, నేనో, వాడో పోసిన ప్రాణాన్ని వాడు తీస్తా డనుకోను !" విషపు నవ్వు నవ్వి, పేరిశాస్త్రి యిచ్చిన సమాధానం విని సీతమ్మ బిత్తరపోయింది. అసహాయత నరాల్ని క్రుంగదీస్తోంటే, రంగనాథం ఆస్పత్రికి వెళ్ళింది. రంగనాథం ఊళ్ళో లేడనీ, నెలదాకా రాడనీ కాంపౌండరు చెప్పడంతో, నిరాశతో యింటికి తిరిగి వచ్చింది. సీతమ్మ చేసిన ప్రయత్నాలు విని మంగ కస్సుమంది. "ఆ వెధవలు నన్నుద్ధరిస్తారనుకోవడం నీ భ్రమ ! కలిసి నన్ను నాశనం చేసిన రాక్షసులు తాళికట్టడానికి ముందు కెలా వస్తారనుకొన్నావు ? ! "

"పెళ్ళిమాట దేముడెరుగు. అయినా ఆశ చావక వాళ్ల దగ్గరకు వెళ్ళినందుకు నా కిచ్చిన సలహా, నీలో పెరుగుతున్న జీవాన్ని నలిపి పారేయమని ! ఏం చెయ్యాలిప్పుడు ?" సీతమ్మ ప్రశ్నించింది.

అవును, ఏం చెయ్యాలి...? మంగ ఆలోచించింది. ఉందో లేదో తెలియని కుటుంబ గౌరవాన్ని కాపాడుకొనేందుకు, తనే సర్వస్వమూ అనుకొన్న తండ్రి మనసు వెయ్యి ముక్కలు కాకుండా ఉండేందుకు– ఏంచెయ్యాలి ? చూస్తూ ఉండిపోయింది.

మర్నాడు సీతమ్మ రహస్యంగా, ఎరుకలసాని సోదెమ్మని కదిపిచూసింది. "ఎన్ని ప్రాణాల్ని వెలుతురు చూడకుండా నలిపేశానోనమ్మా ! నా పాపం నన్నే కొట్టింది. ఎన్ని జీవాల ఉసురో నాకు తగిలింది. చేతి కందొచ్చిన కొడుకు మట్టిలో కలిసిపోయాడు. ఈ పాపా లింక చెయ్యలేను." సోదెమ్మ నిరాకరించడంతో సీతమ్మకి మరే మార్గం కనిపించలేదు.

ఆ రాత్రి తప్పతాగిన సోదెమ్మ నోరు విజృంభించడంతో, మర్నాడూరంతా గగ్గోలెత్తిపోయింది. 'తండ్రి జైల్లోపడి ఏడుస్తోంటే కాలుజారి కడుపు తెచ్చుకొంది మంగ !' విసుగెత్తేవరకూ, ఊళ్ళో ఏ మూల చూసినా ఇదే చర్చ జరిగింది. అసలు సంగతి బయటపడకపోవడానికి కారణం– సీతమ్మా, మంగల మౌనం. వచ్చిన సమస్యల్ని కాలమే పరిష్కరించ గలదన్న వాళ్ళ మొండిధైర్యం. ఆ మొండిధైర్యానికి పునాది వాళ్ళ నిస్సహాయత.

తలుపు తట్టిన చప్పుడూ, 'మంగా,' అన్న పిలుపు విని తడబడుతూన్న అడుగుల్తో వెళ్ళి తలుపు తీసింది– ఏడోనెల కడుపుతోఉన్న మంగ.

# 3

"నాయుడుదొరా !" అన్న పిలుపు విని, మంచంమీద ఓ మూలగా కుప్పగా పోసిన బట్టల్ని మీదకు లాక్కొంది నాగరత్నం. గ్లాసులోఉన్న విస్కీని గుక్కపట్టించి, "మధ్యాహ్నమనగా వచ్చావు, నువ్వింక వెళ్ళడం మంచిది. రాత్రికి పొలంలో పన్లున్నాయి. అప్పుడే ఎవరో కమతగా ళ్లొచ్చినట్లున్నారు. నే వెళ్ళి ఎవరో చూసొస్తా. ఈ లోపుగా నువ్వు బట్టలు కట్టుకో." నాయుడు లేచి, గదితలుపు దగ్గరగా వేసి, సావిట్లోకి వెళ్ళి తలుపు తీశాడు. రొప్పుతూ నిల్చున్న అప్పలస్వామి, కంగారుగా లోపలకు వచ్చి తలుపు దగ్గరగా వేశాడు. "ఏరా, ఇంత చలిలోనూ అలా మొహమంతా చెమట పట్టిందేమిట్రా ? ఏం కొంప మునిగిందని ?" నాయుడు ముద్ద ముద్దగా ప్రశ్నించాడు.

"ఏదో హడావుడిగా రావడం మూలాన చెమటలు పట్టింది కాని, ఏ కొంపా మునగలేదు. కాని, మునుగుతుందేమోనని..." అప్పలస్వామి అర్ధాంతరంగా ఆపేశాడు.

"ఏవిట్రా నువ్వంటున్నది ?" నాయుడు కొంచెం మత్తు వదిలించుకొని అడిగాడు.

"ఆఁహ, ఏమీలేదు కాని, రాయుడుదొర బస్సు దిగాడని చెప్పడంకోసం వచ్చాను." అప్పలస్వామి నాయుడు ముఖభంగిమల్ని పరిశీలిస్తూ అన్నాడు. నాయుడొక్కసారిగా బిగుసుకుపోయాడు. అదురు పుట్టింది. తాగిన మందు నరాలమీద పనిచేస్తుండడంవల్ల, ఆ అదుర్ని అదుపులో పెట్టుకొని, నవ్వుతూ అన్నాడు. "ఓర్నీ ! ఈ విషయం చెప్పడంకోసమేనా, ఇంత హడావుడిగా వచ్చిందీను ?"

లోపల గదిలో నాగరత్నం బట్టలు కట్టుకుంటున్నప్పుడు గాజుల చప్పుడు లీలగా బయటకు విన్పించింది. అప్పలస్వామి అదోలా చూస్తూ అడిగాడు. "ఏమో, ఎందుకైనా మంచిదని చెప్పడంకోసం వచ్చాను. అన్నట్టు అమ్మగారు తిరిగొచ్చేశారా ఏమిటి ?" నాయుడికి వళ్ళు మండింది. "ఆఁ, వచ్చేసింది. ఇంక నువ్వెళ్లు" అన్నాడు కోపంగా.

అప్పలస్వామి చల్లగా బయటకు జారుకున్నాడు. "ఈయనగారెవతినో తెచ్చుకుని కులుకుతున్నాడు. ఈ రోజిల్లా కొట్టుదగ్గరే ఉన్నానుకదా. కాకినాడ పోయిన నాయుడి కారు తిరిగి రాందే ! అమ్మగారొచ్చారట ! ఈ డబ్బున్న మారాజు లేంచేసినా చెల్లుతుంది !" అనుకొంటూ, అప్పలస్వామి యింటికి

పోయాడు, నాలుగు మెతుకులు తిని మళ్ళీ కొట్టుదగ్గరికి పోవడానికి. అప్పలస్వామి కొచ్చే లాభమంతా, రాత్రిపూట లారి డ్రైవర్లకి మందు పోయడంలోనే.

నాయుడు తలుపు గడియవేసి లోపలికి వెళ్ళాడు. "ఆ వెధవ్వి పాము చెవులు. నీ గాజుల చప్పుడు విని, ఏమన్నాడో విన్నావా ?" అన్నాడు, నాగరత్నంతో.

"నే నేదో నా ధోరణిలో ఉన్నాను. ఎవరొచ్చింది నాకు తెలియదు. ఎవరే మన్నదీ నాకు వినబడలేదు !" అంది, నాగరత్నం జాకెట్ బొత్తాలు పెట్టుకుంటూ.

"నీకు కనబడేదల్లా డబ్బే ! సరే ఇంక త్వరగా వెళ్ళు, వర్ధనం తిరిగొచ్చే సమయమైంది."

"ఈ గదంతా అగరొత్తుల వాసన గుప్పు మంటోంది, ఏమిటని అడగదూ?" నాగరత్నం చిలిపిగా అడిగింది.

"ఏదో ఒకటి చెప్తాలేకాని, నువ్వు కదులు." నాయుడు విసుగ్గా అన్నాడు. నాగరత్నం కదల్లేదు. మేకుకి తగిలించిన చొక్కా జేబులోంచి రెండొందలు తీసి నాగరత్నాని కిచ్చి, "ఊఁ, ఇకనైన కదులు!" అన్నాడు. అలవోకగా నవ్వుతూ రెండొందలూ జాకెట్లో దోపుకుంటూ నాగరత్నం సావిట్లోకి వెళ్ళింది. వంటింట్లోంచి పెరట్లోకిపోయే తలుపు తీసుకొని, దొడ్డిదారిన బయటపడింది. తలుపులన్నీ వేసి, మంచంమీద కూలబడి నాయుడు గ్లాసునిండా విస్కీ నింపేశాడు. చేతులమధ్య గ్లాసుని తిప్పుతూ, ఎదురుగా ఉన్న అద్దంలోకి చూశాడు. పైన వెలుగుతున్న దీపం మూలంగా నుదుటి నీడ కళ్ళ కిందకీ, ముక్కునీడ మూతి మీదకు జారిన నాయుడికి, తనకుతానే ఓ రాక్షసుడుగా కనబడ్డాడు.

—రాయుడు విడుదలై వచ్చాడు. ఇప్పుడేం జరుగుతుంది ? నిలువుటద్దంలో తనకు తానే ఓ ప్రశ్నార్థకంగా కనబడ్డాడు.

చిన్నప్పటినుంచీ కలిసి మెలిసి తిరిగిన ఇద్దరిమధ్యా అగాధాలు ఏర్పడ్డాయి. బద్ధవైరులై కూర్చున్నారు, ఆశయాలు వేరవడం మూలాన. ఆ వైరం పెరగ డానికి కారణం ఎవరు ? రాయుడు కటకటాల వెనక్కు వెళ్ళడానికి కారణం ఎవరు ?

మొదట్నించీ రాయుడు అభ్యుదయభావాలు కలవాడు. నిస్వార్థంగా అతగాడు చేసే పనులు కొంతమంది కిబ్బందులు కలిగించాయి. ముఠాతత్వాలవైపు మొగ్గుచూపే నాయుడు, పోను పోను రాయుడికి దూరమవుతూపోయాడు.

వర్ధనం చెప్పుకోదగ్గ డబ్బుతో నాయుడిచేత మూడు ముళ్ళు వేయించుకొంది. అందుచేత, మావగారి ప్రభావం చాలా మట్టుకు నాయుణ్ణి కట్టిపారేసింది. ఊరి చెరువులో మట్టితీసి, లోతుచేసి గట్లు పెంచాలనీ, పెద్దకాలువనుంచి చెరువులోకి చేల మధ్యగా మైలు పొడుగు సిమెంటు కాలవ కట్టాలనీ, ఊళ్ళోఉన్న మట్టి రోడ్లని తార్రోడ్లుగా మార్చాలనీ ప్రతిపాదనలు జరిగి అంగీకరించబడ్డాయి. ఇవన్నీ రాయుడు ఊళ్లో లేనప్పుడు జరిగిపోయాయి. రెండు లక్షలకు పైగా ఖర్చయే పనులు. నాయుడి బావమరది శోభనాద్రి కంట్రాక్టరు. ఆ ఊరికి కా గ్రాంట్లు రావడంలో అతగాడి చెయ్యి లేకపోలేదు. కంట్రాక్టరుకూడా తన చెయ్యి జారిపోకుండా చూసుకొన్నాడు. వర్ధనం యిరకాటంలో పెట్టేయడం మూలాన లాభాల్లో వాటాలు చూపించడంమూలాన నాయుడు చేసిన పనల్లా, ఆ ఊళ్ళో ఉన్నవాళ్ళని ఒప్పించి ప్రతిపాదనలు పైకి వెళ్ళేటట్లు చేయడమే. మిగిలిన పనులన్నీ వాళ్ళే చూసుకొన్నారు.

విషయం తెలిసిన రాయు డెదురుతిరిగాడు. "ఏళ్ళ తరబడి ఊరిమధ్య పడుందే కాని, ఈ చెరువు ఉపయోగంలేదు. అడ్డమైన అవసరాలకీ ఉపయోగించబడే ఈ చెరువులో నీరు ఒక్క చుక్క కూడా మనం తాగటల్లేదు. ఊళ్లో ఉన్న అరడజను మంచినీటి భావుల్ని మట్టి తీయిస్తే చాలు. ఆ నూతులమీద ఆధారపడిన వాళ్ళ సమస్య తీరిపోతుంది. మిగిలినవాళ్ళకి ఎవరిళ్ళలో వాళ్ళకి నూతు లున్నాయి. నాలుగేసి ఎకరాల కొక బోరింగు ఉన్న మోతుబరుల పొలాల మధ్యనుంచి సిమెంటు పంటకాలవ వేయించటం దారుణం. దూరంగా ఉన్న మెట్టభూములకి ఈ కాలవవల్ల ఎంతమాత్రమూ ప్రయోజనంలేదు.

"ఊరి మధ్యనున్న చెరువుని పూడిస్తే, పక్కనే ఉన్న హైస్కూలుకి ఓ ఆట స్థలమంటూ ఏర్పడుతుంది. అక్కడ మాలపల్లి దగ్గర చెరువు తవ్విత, పెద్దకాలువనుంచి ఓ పంటకాలువ తవ్వి అందులోకి నీళ్ళు మళ్ళించవచ్చు. మాలపల్లి దాహమూ తీరుతుంది. ఆ చెరువు కింద మెట్టభూమీ సాగుబడి అవుతుంది.

"మన ఊళ్లో ఎంతలేదన్నా మూడొందలదాకా యువతరం ఉంది. కొద్దిపాటి డబ్బుతో, ఈ యువతరం శ్రమదానంతో, మనం ఈ పనులన్నీ ఓ ఆర్నెల్లలోగా చేసుకోవచ్చు. తార్రోడ్లొక్కటే కంట్రాక్టర్ల కిస్తే సరిపోతుంది.

"ఆస్పత్రి సౌకర్యాలు లేక ఈ ఊళ్లో చాలా మరణాలు సంభవించాయి. ఇక్కడున్న రూరల్ డిస్పెన్సరీ పాతబడిన కొంపలో ఉంది. మనం ఆస్పత్రి

నిర్మాణంకోసం, మాలపల్లి దగ్గరగా ప్రాథమిక పాఠశాల భవన నిర్మాణం కోసం గ్రాంట్లని మళ్ళిద్దాం చేసే ఖర్చు ఉపయోగమైన పన్లకోసం చెయ్యడం మంచిది." ఇవన్నీ రాయుడు చెప్పిన సలహాలు. కొంతమంది రాయుడివైపు మొగ్గుమాపడంతో, నాయుడికి కష్టమైంది. ఇంట్లో వత్తిడి ఎక్కువైంది. ఇలా అయితే, వచ్చే లాభాలు ఎగిరిపోతాయి.

"నువ్వన్నది నిజమే అయినా, వచ్చిన గ్రాంట్లని మరో పనికి మళ్ళించాలని అర్జీపెట్టుకొంటే, మొదటికే మోసం వస్తుంది. అంచేత ప్రస్తుతానికి కీ పనులు జరిగిపోవడం బావుంటుంది. ఓ నాలుగైదేళ్ళు పోయిన తర్వాత, వాటి విషయమై మళ్ళీ చూడొచ్చు." నాయుడు, రాయుడికి నచ్చజెప్పడానికి చాలా ప్రయత్నించాడు. రాయుడు తన పట్టు వదలకపోవడంతో, నాయుడికి రాయుడిమీద ఎక్కడలేని కసీ పెరిగింది. ఊళ్ళో ఉన్న కుర్రకారు కూడా రాయుడికి మద్దతు నివ్వడంతో, నాయుడికి కోపం మరింత రెచ్చిపోయింది.

ఈ విషయాలిలా ఉండగా, ఆ ఊళ్లో మరో గొడవ జరిగింది. అవి పంట కోతల రోజులు. ధరలు విపరీతంగా పెరిగిపోవడంవల్ల, పొలం పనులు చేసే రోజువారీ కూలీలు, రోజుకో రూపాయి ఎక్కువగా అడిగారు. ఇచ్చిన వాళ్ళిచ్చారు. ఇవ్వనివాళ్ళు ఇచ్చిన వాళ్ళమీద కంయ్‌మంటూ లేచారు. వందెకరాల మోతుబరి సోమరాజు, మాట పంతంకొద్దీ, అనపర్తి మనుష్యుల్ని బేరమాడి, లారీలమీద తీసుకొచ్చే ఏర్పాట్లు చెయ్యడంతో, మాలపల్లిలో ఉన్న కూలీ జనమంతా గోలపెట్టింది. "ఏళ్ళతరబడి ఈ ఊరినే నమ్ముకొని ఉన్నాం. ధరలు ఆకాశాన్నంటుతున్న ఈ రోజుల్లో, ఓ పూట గంజికూడా కరువై పోయింది. పై ఊరి వాళ్ళని తీసుకొచ్చి, మా పొట్ట కొట్టడం మీ కేమంత న్యాయం ?"

సోమరాజు తన పట్టు విడిచి కిందకు దిగి రాలేదు. మాలజనం రోషంగా, నిస్సహాయంగా కేకలు వేసుకొంటూ వెళ్ళిపోయింది. రాయబారం చేద్దామనుకొన్న రాయుణ్ణి కసిరికొట్టాడు సోమరాజు. "ఇది నా విషయం. అనవసరంగా జోక్యం కలుగచేసుకోవద్దు."

ఆ సమయానికి ఆ ఊళ్లోనే ఉన్న నాయుడి మావ వీరాస్వామికి, ఈ గొడవ అంధకారంలో ఆశాజ్యోతిలా కనబడింది. నాయుడితో ఏవో మంతనాలు జరిపాడు. ఆ రాత్రి అనపర్తి కూలీలని తీసుకొస్తున్న లారీని, సోమేశ్వరం కాలువ మలుపులో కొందరు మనుష లటకాయించారు. కర్రలు కలియడంతో




ఎముకలు విరిగాయి. ఆమాకీ అంది, రామచంద్రపురంనుంచి పోలీసులు వెళ్ళి అందర్నీ చుట్టుముట్టేశారు. దారి కాని, ఆటకాయించిన మనుషులకు నాయకుడైన నర్సిగాడు, రాయుడు తమ నీ పనికి ఉసిగొల్పాడని చెప్పడంతో, రాయుడిమీద కేసు బనాయింపయింది. ఏ పాపమూ తెలియని రాయుడు కటకటాల వెనక్కు వెళ్ళిపోయాడు.

రాయుడు జైల్లో ఉన్నప్పుడు, మిగిలినవాళ్ళపనులు నిరాటంకంగా జరిగిపోయాయి. నాయుడు బాగానే డబ్బు చేసుకొన్నాడు.

నాయుడు మరోసారి తన్ను అద్దంలో చూసుకొన్నాడు. చింతనిప్పుల్లా ఉన్న తన కళ్ళలోకి తానే చూడలేక, తల దించేసుకొన్నాడు. "రాయుడికెంత ద్రోహం చేశాను? దీనికంతకీ కారణం వర్ధనం కాదూ? దాని మూర్ఖత్వానికీ, దాన్ని కన్నవాళ్ళ ఆశకీ లొంగిపోయి, ద్రోహం చేశాను." నాయుడనుకొన్నాడు. వర్ధనం అధికారంతో రాను రానూ, నాయుడు విసుగెత్తిపోయాడు. మాట్లాడితే తనూ, తనవాళ్ళూ తీసుకొచ్చిన లాభాన్ని వేలెత్తి చూపించే వర్ధనమంటే విసుగెత్తిపోయాడు. అందుకనే వర్ధనం ఆదివారాలు, కాకినాడ తండ్రి దగ్గరకు వెళ్ళినప్పుడల్లా, నాయుడు నాగరత్నాన్ని తీసుకొచ్చి కులుకుతున్నాడు. "దాని కిలా శాస్తి జరగాల్సిందే!" అనుకొన్నాడు కసిగా.

నాయుడక్కడే పొరబడ్డాడు.

# 4

కాకినాడనుండి బయలుదేరి, పెందుర్తి వంతెన దాటి, మలుపు తిరిగి కారు కోటిపల్లిరోడ్డు పట్టింది. హెడ్ లైట్ల వెలుతుర్లో దారి కిరుప్రక్కలా ఉన్న తుమ్మచెట్లు, జుట్లు విరబోసుకొన్న దెయ్యాల్లా కనబడ్డంతో వర్ధనం కారు నడుపుతున్న రంగనాధానికి మరింత దగ్గరిగా జరిగింది. ఒక చేత్తో స్టీరింగ్ పట్టుకొని, మరో చెయ్యి వర్ధనం భుజంమీదుగా పోనిచ్చి, దగ్గరగా లాక్కొన్నాడు రంగనాధం.

"నువ్వు రోడ్డుమీద దృష్టి నిలపడం మంచిది," అంది వర్ధనం గోముగా, రంగనాధం చెయ్యిని గుండెలకు మరింత గట్టిగా హత్తుకొంటూ.

"నీ కా భయం అక్కర్లేదు. నాకు నువ్వూ, ఈ దారీ – రెండూ అలవాటై పోయాయి !" రంగనాధం కొంటెగా అన్నమాటలకు, వర్ధనం హాయిగా నవ్వింది. మరుక్షణంలోనే వర్ధనం, రంగనాధం చెయ్యిని తోసివేసి కొంచెం కోపంగా అంది. "నీకు పెళ్ళి సంబంధాలు వస్తున్నాయని విన్నాను !" ఆ మాటల్లో అసూయ కొట్టవచ్చినట్లుంది.

"వావుంది, రాక మానుతాయా ఏమిటి? ఎంత కాదనుకొన్నా, నాకున్న డాక్టరు డిగ్రీకి కొంతైనా విలువ ఉంది కదా !"

"ఆ తర్వాత నాకు దూరమైపోవూ ?" వర్ధనం కొంచెం బాధగా అంది.

"ఇప్పుడు నీమీద నాకేం అధికారం ఉందని దగ్గరగా వచ్చావు. కట్టుకొన్న మొగుడిమీద మనసులేక నాకు దగ్గరయ్యావు. నాకు పెళ్ళయినంతమాత్రాన నీకు దూరమైపోతా ననుకోడం నీ భ్రమ ! నామీద నీకు మోజు తీరనంతకాలం, ఇలా సాగినంతకాలం, నే నెప్పుడూ నీకు దగ్గరగానే ఉంటాను !" రంగనాధం, వర్ధనాన్ని మరోసారి దగ్గరగా లాక్కొంటూ అన్నాడు. వర్ధనం, రంగనాధం భుజంమీద తల ఆన్చి, సంతృప్తిగా, మగతగా, కళ్ళు మూసింది.

కొన్ని జీవితాలు చాలా విచిత్రంగా మలుపుతిరుగుతూ ఉంటాయి. వర్ధనం నాయుడి జీవితంలో సలక్షణంగా అడుగుపెట్టింది. మొదట్లో పల్లెవాతావరణం కొంచెంగా యిబ్బంది కలిగించినా, ఆ ఊళ్లో నాయుడికున్న పలుకుబడీ, అధికారం–వర్ధనానికి ఒక హోదాని తీసుకొచ్చాయి. అదే సంతృప్తితో ఒకటిన్నర దశాబ్దం పైగా వర్ధనం జీవితం చాలా యాంత్రికంగా జరిగి పోయింది. పొద్దస్తమానమూ పొలం పనులూ, ఊరు రాజకీయాలతోనూ కాలం

గడిపే నాయుడు రాను రానూ వర్ధనానికి దూరమవుతూ కూర్చున్నాడు. పిల్లా పీచూ కలగకపోవడంతో, పోనుపోనూ వర్ధనం మరిన్ని అందాలు పుంజుకొందే కాని, మనిషి మట్టుకు నలిగిపోలేదు.

అంతంతమాత్రంగా ఉన్న ఆస్తుల్ని రెట్టింపు చెయ్యాలన్న ఉద్దేశంతో, ఏ విధమైన పనీ పాటూ లేకుండా తిని కూర్చుంటున్న కొడుకు శోభనాద్రిని, కంట్రాక్టు వ్యాపారంలోకి దింపాడు వీరాస్వామి. ఓ రెండు మూడు సంవత్సరాలు చిన్న చిన్న పనులతో నిలదొక్కుకొని, శోభనాద్రీ, వీరాస్వామి పెద్ద పనులకోసం ఎదురుచూడసాగారు. వీరాస్వామి అల్లుణ్ణి ఉపయోగించుకోవడంలో ఎంతమాత్రమూ వెనుదీయలేదు. ఎంత కష్టపడి పనిచేసినా, వ్యవసాయంలో ఉన్న కష్టనష్టాలు-అనుభవమైన నాయుడు, కంట్రాక్టుల్లో లభించే విపరీతమైన లాభాలు చూసి సులువుగా అటువైపు మొగ్గాడు. దాంతో పట్టణంలో పరిచయాలు పెరిగాయి అలవాట్లు మారాయి. వర్ధనం నాయుడి చుట్టూ మరో వాతావరణపు వలయం గీసింది. దాంట్లో చిక్కుకుపోయాడు వర్ధనానికి ఆశలు పెరిగి, ఏదో రకమైన అసంతృప్తి మనస్సుని ఆవహించడం మొదలైంది. ఎంత కాదనుకొన్నా, నాయుడిలో ఉన్న కొన్ని మోటు లక్షణాలు చూసి, వర్ధనం మనసులో ఏవగించుకోవడం మొదలుపెట్టింది. రాత్రిళ్ళుమాత్రమే దగ్గర చేరే నాయుడికి మానసికంగా దూరం అవుతున్న సమయంలో, వర్ధనం జీవితంలో రంగనాథం అనుకోకుండా కాలుపెట్టాడు.

ఓ రోజు ఉన్నట్టుండి వర్ధనానికి విపరీతమైన కడుపు నొప్పి వచ్చింది. ఎంతో హంగామా చెయ్యడంతో నాయుడు బెంబేలు పడిపోయాడు. కాకినాడ కార్లో తీసుకుపోదా మనుకొన్నాడు. ఏవో పొలంపనులమీద వచ్చిన పాలేరు కామరాజు, "ఇంత బాధలో అంతదూరం ఎలా తీసుకుపోతారయ్యా! మనూళ్లో కూడా ఎం.బి.బి.ఎస్. డాక్టరున్నాడు కదా! ఆయన్ని తీసుకొస్తానుండండి. ఆయ నెలా చెప్తే అలా చెయ్యొచ్చు," అని వెళ్ళి, రంగనాథాన్ని తీసుకొచ్చాడు. బాధతో మరో లోకంలో ఉన్న వర్ధనాన్ని, రంగనాథం పరీక్ష చేసి ఏవో మందు లిచ్చాడు. కొంత ఉపశమనం కలగడంతో, వర్ధనం నిద్ర పోగలిగింది. రంగనాథం నాయుడితో అన్నాడు. "ఎపెండిసైటిస్, అనుకొంటున్నాను. ఎంత త్వరలో ఆపరేషన్ జరిగితే అంత మంచిది. నే నింకా ఇక్కడ ఆపరేషన్ చేసే సౌకర్యాలు సమకూర్చుకోలేదు. ఈ రాత్రికి ఫర్వాలేదు. రేపు మీరు కాకినాడ తీసుకుపోయి, వివరంగా పరీక్ష చేయించడం

మంచివి. కాకినాడ హాస్పిటల్లో నాకు తెలుసున్నవాళ్లు చాలామంది ఉన్నారు. మీ కేవిధమైన సహాయం కావల్సినా, నేను చెయ్యగలను."

వర్ధనం ఆపరేషన్ కాకినాడలో, రంగనాథం ఆధ్వర్యంలో జరిగిపోయింది. హాస్పిటల్‌నుంచి తిరిగి వచ్చిన వర్ధనం కొంతకాలంబాటు కాకినాడలో తండ్రి దగ్గరే ఉండిపోయింది. ఓ ఆదివారం మందులు కొనడానికి కాకినాడ వెళ్ళిన రంగనాథం, వర్ధనం ఎలా ఉందోనని చూడ్డంకోసం, వీరాస్వామి యింటికి వెళ్ళాడు. ఆ సమయంలో వీరాస్వామీ, శోభనాద్రీ ఏవో కంట్రాక్టు పనులమీద బెజవాడ వెళ్ళడంమూలాన వర్ధనం ఒంటరిగా ఉంది. వర్ధనం, రంగనాథాన్ని సాదరంగా పిలిచింది.

రంగనాథాన్ని చూస్తున్న వర్ధనం మనస్సులో, అణగారిపోయిన కోరికలు ఓ చిన్న మెరుపుని కలిగించాయి. ఆ మెరుపు వదనం ముఖభంగిమల్ని మార్చడంతో, రంగనాథం ఆమెవైపు వింతగా చూస్తూ కూర్చుండిపోయాడు. ఒకరి కళ్ళలో భావాలు మరొకరు అర్థంచేసుకోవడంతో, తనువులు రెండూ కలిశాయి. సభ్యతా, సంస్కారమూ పట్టపగలు కాకినాడ పురవీధుల్లో తిరుగుతోంటే, అంతవరకూ మనస్సుని ఆవహించిన తెలియని అసంతృప్తిని, రంగనాథం మూలంగా దూరంచేసుకొంది వర్ధనం. తర్వాత వాళ్ళు ఎన్నో పగళ్ళని రాత్రుళ్ళుగా, ఎన్నో అవకాశాల్ని ఆనందపు ఘడియలుగా మార్చుకొన్నారు.

ఇప్పుడు రంగనాథానికి పెళ్ళయితే, ఈ అవకాశాలు బాగా తగ్గిపోయే ప్రమాద ముంది. ఆ ఆలోచనే, వర్ధనానికి కొంచెం యిబ్బందిని కలిగిస్తోంది.

"ఏదో ఆలోచిస్తున్నట్లున్నావు? ఊరు దగ్గరపడింది. నువ్వు స్టీరింగ్ తీసుకొంటే నేను చిన్న కాలవ దగ్గర దిగి, అడ్డదారమ్మట ఊరు చేరుకొంటాను." రంగనాథం, వర్ధనాన్ని దూరంగా తోస్తూ అన్నాడు. ఆలోచనల్లోంచి తేరుకొంది వర్ధనం. రంగనాథం కారాపు చేశాడు. రంగనాథం కిందకు దిగాడు. వర్ధనం స్టీరింగ్ ముందరకు జరిగింది. కారు డోర్ వేస్తూ, వర్ధనం బుగ్గమీద ముద్దుపెట్టుకొన్నాడు రంగనాథం. వర్ధనం నిట్టూరుస్తూ, కారు నడుపుకొంటూ వెళ్ళిపోయింది. చిన్న కాలవ గట్టు ఎక్కి, రంగనాథం చీకట్లో కలిసిపోయాడు.

సరిగ్గా పదడుగుల దూరంలో, చిన్న కాలవ గట్టుమీద మద్దిచెట్టు మాటున అవసరం తీర్చుకొంటున్న సోడా కొట్టు అప్పలస్వామి తమ్ముడు



వెంకటరత్నం, జరిగినదంతా చూశాడు. వాడి తల దిమ్మె త్తిపోయింది. వాడికి కుతూహలమూ, ఆందోళనా ఒకేసారి కలగడంతో, గుండె వేగంగా కొట్టుకొంది.

## 5

పేరిశాస్త్రి కంచంలో ఉన్న మెతుకుల్ని కొరుకుతున్నాడు. పక్కనే కూర్చుని భోజనం చేస్తున్న తండ్రి విశ్వనాధశాస్త్రి కోపంగా ఉన్నాడు. పెరుగ్గిన్నె ముందర పెట్టుకొని, వంటగది గుమ్మం దగ్గరగా తల్లి పార్వతమ్మ కూర్చుంది. ఉన్నట్టుండి విశ్వనాధశాస్త్రి విరుచుకుపడ్డాడు. "సిగ్గుండాలి, వెధవ ముఖానికి! ఇన్ని రోజులుగా హెడ్మాస్టరుగిరీ వెలిగించి, ఈ ఊళ్ళో కాస్తంత పరువు సంపాదించుకొంటే, దాన్ని ఒక్కసారిగా గంగపాలు చెయ్యడానికి ఉద్ధరించాడు ! జనతా తరగతి రెండు డిగ్రీలు పట్టుకొని, ఏడాదిపాటుగా బేవార్సుగా తిరుగుతున్నావని, జిల్లా సమితివాళ్ళ కాళ్ళూ, కడుపులూ పట్టుకొని మాస్టరుద్యోగం యిస్తే, చెయ్యకుండా, సారా దుకాణం తెరుస్తావ్ట ! బ్రాహ్మణ పుట్టుక పుట్టి, ఇటువంటి వెధవ్వేషాలు వెయ్యడం నా కిష్టంలేదు !"

"ఇన్ని రోజులు మాస్టరుగిరీ వెలిగించి సాధించిందేముంది ? పెద్దక్క పెళ్ళి పదిమంది కాళ్ళు పట్టుకొంటే కాని చెయ్యలేకపోయావు ! ఇంటిమీద పెంకు

తిరగవేయించి ఎన్నేళ్ళయింది ? ఎదుగూ బొదుగూ లేని ఈ జీవితాలకంటే, వ్యాపారం చేసుకొని పైకి రావడం చాలా సులువు. ఇంకా ఇద్దరాడపిల్లలకి పెళ్ళిళ్ళు చెయ్యాలి. దాన్ని గురించి ఆలోచనలేదు !" పేరిశాస్త్రి, నెమ్మదిగా అన్నా తన మనసులోని మాట స్పష్టంగా తెలియజేశాడు.

"ఈ బుద్ధి ఏళ్ళక్రితం ఉండవల్సింది. వెధవ తిరుగుళ్లు తిరిగి, చదువుని కొండెక్కించావు. చచ్చి చెడి పనికిరాని రెండు థర్డు క్లాసు డిగ్రీలు నీ చేత సంపాయించేసరికి, నా తల ప్రాణం తోకకి వచ్చింది. శ్రద్ధగా చదువుకొని ఏ డాక్టరో, ఇంజనీరో అయ్యుంటే, మా జీవితాల మాట ఎటున్నా, కనీసం నీ జీవితమైనా బాగుపడేది. నా ఆశలన్నీ వ్యర్థమే అయ్యాయి. హోటళ్ళలో సుష్టుగా మెక్కి, చెల్లెళ్ళకోసం కాస్తంత జిలేబీ కూడా పట్టుకురాని ముఖానికి, ఇప్పుడు వాళ్ళ పెళ్ళిళ్ళమీద బెంగపట్టుకొందా ? నమ్మాలి. అంతగా అవసరమొస్తే, ఉన్న ఆ రెండెకరాల్నీ, ఈ కొంపనీ అమ్మేసైనా వాళ్ల పెళ్లిళ్లు చేస్తాను !"

"ఒక్క అరెకరం పొలం అమ్మి నాకో అయిదు వేలిస్తే, నేను లైసెన్సు సంపాదించి దుకాణం తెరుస్తాను ! తర్వాత అంతా డబ్బే !" పేరిశాస్త్రి తల్లి వైపు చూస్తూ అన్నాడు.

"అయిదు వేలిస్తే అఘోరిస్తావు ! అవతల నీ భాగస్వామంటున్నావే, వాడు నెత్తిన చెంగేసి మరీ ముంచుతాడు. ఇన్ని మాట లనవసరం. దొడ్డంపేట సరిగ్గా ఆరుమైళ్లు కూడా లేదు. ప్రతిరోజూ హాయిగా సైకిలుమీద పోయి రావచ్చు. సరిగ్గా ఇంక నాలుగురోజులు గడువుంది. ఈ లోపుగా జాయినవక పోతే, ఈ కాస్త ఉద్యోగం కూడా మరొకరికి పోతుంది. తర్వాత ఏడ్చి ప్రయోజనంలేదు. ఇంక వ్యాపారమంటావా - నువ్వు లాభాన్ని గురించి కలలు కంటున్నావే కాని, నష్టాన్ని గురించి ఆలోచించటంలేదు. ఇవ్వాళ తీసేసిన ప్రొహిబిషన్ మళ్ళీ రేపు వస్తే, నష్టాల్లో మునుగుతావు ! ఆలోచించుకో."

పేరిశాస్త్రి కంచంలో చెయ్యి కడిగేసి, విసురుగా లేచిపోయాడు.

"ప్రయోజకత్వంలేదు కానీ, పౌరుషాలకి మట్టుకు లోటులేదు ! ఇంత పెరుగు తగలెట్టు !" విశ్వనాథశాస్త్రి కోపంగా అరిచాడు.

చెల్లెళ్ళిద్దరూ చూస్తుండగా పేరిశాస్త్రి చొక్కా తొడుక్కొని, టూరింగ్ సినిమా హాలుకేసి వెళ్ళాడు. మొదటి ఆట జనం బయటకు వస్తున్నారు. హాలు బయట

నున్న కిళ్ళీకొట్లో కిళ్ళీకొని, సిగరెట్ ముట్టించాడు. ఇంటి దగ్గర భోజనంచేసి, ఊరుబయట నున్న తన దుకాణంకేసి పోతున్న అప్పలస్వామికి కడుపు బరు వనిపించి, కిళ్ళీకోసం అదే కొట్టుదగ్గర ఆగాడు. పేరిశాస్త్రినిచి చూసి, "ఎలా గున్నారయ్యా ? మీకూ్కడా మాస్టరుద్యోగం దొరికిందటగా ?" అని అడిగాడు. పేరిశాస్త్రి, తల పంకించాడు కాని సమాధాన మియ్యలేదు. "సర్లెండి, నాన్నగారి ఉద్యోగమే మీకూ అయింది. ఆయన్లాగే మీరూ పేరు తెచ్చుకోండి," అన్నాడు అప్పలస్వామి. పేరిశాస్త్రి గొణుక్కుంటూ ఏవో రెండు మాటలన్నాడు కాని, అప్పలస్వామి కవి అర్థం కాలేదు. కిళ్ళీకొట్టతనితో అన్నాడు "ఒరేయ్ త్వరగా కట్రా, కళ్ళీ. అవతల నా దుకాణంలో బేరాలందుకొనే సమయం. నీకు తెలుసున్రా, రాయుడుదొర జైలునుంచి తిరిగొచ్చాడు !"

పేరిశాస్త్రి గతుక్కుమన్నాడు. ఆ సమయంలో– తండ్రితోపడ్డ ఘర్షణా, సారా వ్యాపారం సంగతీ, సినిమా కెళ్ళాలన్న ఆలోచనా, అన్నీ మరిచి పోయాడు, రాయుడు విడుదలై తిరిగి వచ్చాడన్న సంగతి విని. ఇంతకాలం నోరు మూసుకొని పడున్న మంగ, తండ్రితో జరిగిన విషయం చెప్పకపోదు, ఇప్పరు రాయు డే అఘాయిత్యానికి తలబూనుకుంటాడో ? పేరిశాస్త్రి గుండెల్లో గుబులు చోటుచేసుకొంది. కాలుతున్న సిగరెట్‌ని విసిరేసి, వెంటనే మరో సిగరెట్ ముట్టించి, వడివడిగా నడుచుకొంటూ రంగనాధం ఉంటున్న యింటికేసి బయలుదేరాడు.

## 6

"ఆ సమయంలో మీకేది యోగ్యమని తోచిందో, అదే చేశారు. నోరు మూసుకొని పడుండడంకంటె,మగదిక్కులేని ఆడవాళ్ళేం చేయగలరు ? నేనున్నా అదేపని చేసేవాణ్ణేమో. ఏ జన్మలోనో చేసిన పాపాన్ని, ఈ జన్మలో అనుభ విస్తున్నాం. నువ్వు నీ జీవితం నాశనమైందని విచారించకమ్మా, మంగా. ఏనాడైతే నాకు బేడీలు పడ్డాయో, ఆనాడే మన పరువు గంగపాలైంది. ఇప్పుడు మనం పరువు ప్రతిష్ఠల్ని గురించి, వాపోవడంవల్ల లాభంలేదు. వాటిని గురించి విచారించవలసిన సమయమూ కాదు. ఇన్నిరోజులూ మీరిద్దరూ ధైర్యంగా ఉండగలిగినందుకు నాకు చాలా సంతోషంగా వుంది. నీలో ధైర్యం ఉన్నంత కాలమూ, నాకు కాలూ చెయ్యీ ఆడుతుంది. రెండు మూడు రోజు లిక్కడి వ్యవహారాలు చక్కబెట్టుకొని, ఆ పైన పట్నం పోదాం. ఆ నలుసు కాస్తా భూమ్మీద పడిన తర్వాత, తర్వాతి సంగతి ఆలోచిద్దాం. ఈ లోపుగా నా

ప్రయత్నాలు నేను చేస్తాను. ఈ దేశంలో మంచి మనసులున్న మనుషులకింకా కరువు రాలేదు. నీ అదృష్టం బావుంటే, నీ మెళ్లో తాళి కట్టడానికి ఎవరో ఒకరు ముందుకు తప్పకుండా వస్తారు. ఆ తర్వాత నా కే విధమైన బెంగా ఉండదు." రాయుడు భోజనంచేస్తూ అన్న మాటల్లో ద్వేషంలేదు, బాధ తప్ప. మంగ హృదయం చాలా తేలికైంది. సీతమ్మ తమ్ముణ్ణి ఆప్యాయంగా చూస్తూ పెరుగ్గిన్నె విస్తట్లో బోర్లించింది.

మంగ ముగ్గురికీ పక్కలు పరిచింది. పక్కలో కూర్చుని, మంగ తలని ఆప్యాయంగా నిమురుతూ, రాయుడేవో ఆలోచనల్లో మునిగిపోయాడు. ఆ లాలనలో మంగకి హాయిగా నిద్రపట్టేసింది రాయుడు నెమ్మదిగాలేచి, కూతురి మీద దుప్పటి కప్పాడు.

"అక్కా, తలుపు దగ్గరగా వేసుకో. నేను కొంచెం అలా తిరిగివస్తాను." అన్నాడు రాయుడు, ఇంకా మేలుకొనిఉన్న సీతమ్మ నుద్దేశించి.

"ఇంతరాత్రి ఎక్కడికిరా. ఉదయమే తీరుబడిగా వెళ్లొచ్చు," అన్నది సీతమ్మ.

"అది కాదక్కా, నిద్ర రావటల్లేదు. కొంచెంసేపు అలా తిరిగి వస్తేనే కాని మెదడు చల్లబడదు."

"నువ్వు వెళ్తానంటే కాదనలేను కాని, ఒక్కమాట తమ్ముడూ. మన రోజులు మంచివి కాకపోవడం మూలాన, ఇలా దెబ్బ తీసింది. జరిగిన ఘోరానికి నీ గుండెలో మంటలు చెలరేగుతున్నాయని తెలుసు ఆ మంటలు నిన్నే అఘాయి త్యానికి దారితీయిస్తాయో యేమోనని, నా భయం. అందుకే ఇప్పుడు బయటకు వెళ్లొద్దంటున్నాను.

"ఏడాదిపాటు జైలు జీవితం నాకు చాలా పాఠాలు నేర్పింది. నువ్వన్నట్లు ఉద్రేకం వివేకాన్ని నాశనం చేస్తుంది. నేనిప్పు డే అఘాయిత్యం తలపెట్టినా, అది మంగ జీవితాన్ని మరింత దుర్భరం చేస్తుందే కాని, సుగమం చెయ్యదు. అందుచేత నీకా భయం అక్కర్లేదు. నిశ్చింతగా పడుకో. ఇద్దరు ముగ్గుర్ని కలుసుకొని ఓ గంటలో వచ్చేస్తాను."

సీతమ్మకి మనసులో బెంగగాఉన్నా, తమ్ముడి మాటల్లో నిజం గోచరించ డంతో మరి మాట్లాడలేదు. రాయుడు బయటకు వెళ్ళిన తర్వాత, నెమ్మదిగా తలుపువేసి వెళ్ళి పడుకుంది.

## 7

రామాలయం గర్భగుడిలో పూజారికీ, అతగాడి అల్లుడు వరదాచారికీ, ఘర్షణ జరుగుతోంది. పూజారి బాధగా అన్నాడు. "నీ ఆశకు అంతులేకుండా పోతోంది. ఎంతకాలం దాన్నిలా దుఃఖపెడ్తావు ? నీకు కట్టబెట్టి దాని జీవితాన్ని నేను చేతులారా నాశనం చేశాను."

వరదాచారి మావగారికేసి కొరకొరా చూశాడు. వ్రేలాడుతున్న ప్రమిదల్లోని వత్తులు కొడిగట్టుకుపోయి గుడ్డి వెల్తురు నిస్తున్నాయి. గర్భగుడిపైనున్న చీకట్లని పారద్రోలలేనట్లుగా, భయంభయంగా వెలుగుతున్నాయి. అలాగే పూజారికూడా అన్నాడు. "ఎంత కాల మిలా పేకాట్లమీద డబ్బు తగలెట్టవు? తల్లిలేని పిల్లకదా అని, దాని అమ్మ బంగారమంతా పెళ్ళిలోనే, వెర్రిపీనుగనై దానికి చుట్టబెట్టాను. హారతికర్పూరంలా రెండేళ్ళలో వెలిగించేశావు. అడిగిందల్లా ఇవ్వకపోతే దాని దారి దానిదని బెదిరిస్తూ నా నోరూ, చేతులూ కట్టిపడేశావు. ఇప్పుడు నాకింక స్తోమతలేదు. నాకే పూట గడవటానికి కష్టంగా ఉంది. నేనింక ఏ విధమైన సహాయమూ చెయ్యలేను."

"నాకోసం కాదయ్యా అడుగుతూంట ! నీ కూతురికోసమే. రెండురోజుల్లో కనక ఈ బాకీ తీర్చకపోతే, అవతలివాళ్ళు నన్ను బ్రతుకనివ్వరు వాళ్ళు పక్కా రౌడీవెధవలు. నన్ను చంపి పారేస్తారు. నీ కూతురు 'ముండమోసి' నీ దగ్గరకు వస్తుంది !" వరదాచారి చాలా నిర్దయగా అన్న మాటలకు పూజారి విలవిలలాడిపోయాడు.

"దాని జీవితాన్ని ఎరచూపే ఇంతకాలమూ నెగ్గుకొస్తున్నావు. ఇది మగతన మనిపించుకోదు. నాకెలాగూ మగసంతులేదు కాబట్టి, అనుశ్రుతంగా వస్తున్న ఈ అర్చకత్వం నీ కొచ్చేటట్లు చూస్తాను. ఇక్కడకు వచ్చేసేయ్."

"నీకు మగ సంతులేనందుకు, అది నీ తమ్ముడి కొస్తుంది. అక్కడ కోమటి దుకాణంలో పద్దులు రాయలేక నానా యాతనలు పడుతున్నాడు. ఈ అర్చకత్వంకోసం గోతికాడ నక్కలాగా ఎదురుచూస్తున్నాడు. అందుచేత నువ్వంటున్న ఈ అర్చకత్వం నాకు దొరకడ మనేది కల్ల ! అయినా అది తర్వాత సంగతి. ప్రస్తుతం నే నీ కష్టంనుంచి గట్టెక్కాలి కదా " మామగారికి ప్రస్తుతాన్ని గుర్తుచేశాడు వరదాచారి.

"ఏం చెయ్యమన్నావు ? ఉన దంతా ఊడ్చిపెట్టాను. ఇంక ఒక్కపైసా కూడా లేదు !" పూజారి నిస్పృహగా అన్నాడు

"చెయ్యదలచుకొంటే ఏమైనా చెయ్యొచ్చు. అదైనా నీ కూతురికోసం. అదుగో, అమ్మవారి మెళ్ళో ఉన్న బంగారపు చంద్రహారం ... " క్రీనీడల్లో మెరుస్తున్న హారాన్ని చూపిస్తూ, అర్థోక్తిగా ఆగిపోయాడు వరదాచారి.

పూజారి గుండెలు బాదుకొన్నాడు. "నన్నిలా ఇంకా ఎన్ని పాపాలు చెయ్యమంటావు ? ఇప్పటికే నా కూతురి జీవితంకోసం, మరో అమాయకురాలి జీవితం నాశనంచేశాను. దానికి ప్రతిరోజూ ఏడ్చి చస్తున్నాను. నీ ఆశలు తీర్చడంకోసం నే నింక ఏ ఘోరాలూ చెయ్యలేను."

వరదాచారిలో సహనం చచ్చిపోయింది. "నువ్వీ ఊళ్లో ఎవరి జీవితాలు ఎలా నాశనం చేస్తే నా కెందుకు ? సరేలే, వారి జీవితాలు నాశనం చేసినవాడికి, వాళ్ళ సొమ్ములు కాజేయడం పెద్ద పనేంకాదు ! ఆ చంద్రహారాన్ని తీసుకుపోతాను. దొంగలుపడి దోచుకుపోయారని రేపుదయం గుండెలు బాదుకొని ఏడు !" వరదాచారి అమ్మవారి విగ్రహంకేసి అడుగువేశాడు.

ఆ క్షణంలో, ఏళ్ళనుండీ పూజారి కళ్ళమీద క్రమ్ముకొన్న పొరలు తొలగి పోయాయి. కూతురి కాపురంకోసర మనుకుంటూ, అల్లుడి ధన దాహానికి తల ఒగ్గాడు. దాని కింక అంతంటూ లేదు. ఈ విధమైన బెదిరింపులకి ఎక్కడో ఒకచోట అడ్డువెయ్యాలి. మొండి ధైర్యంతో అల్లుడి కడ్డంగా వెళ్ళాడు. వరదాచారికి మొదటిసారిగా ప్రతిఘటన అవడంతో, కోపం తన్నుకొచ్చింది. నాలుగడుగుల కంచు దీపస్థంభాన్ని రెండు చేతుల్తోటీ పైకెత్తి, మామగారి బుర్రమీద గట్టిగా బాదాడు. బుర్రబద్ద లవడంతో పూజారి గిలగిలలాడుతూ నేల మీదపడి ప్రాణం విడిచాడు. మందంగా వెలుగుతున్న దీపాల వెల్తుర్లో, ఎర్రటి రక్తం నల్లటి విషంలా నాలుగు మూలలకీ ప్రవహించసాగింది. వరదాచారిలో మైకం ఒక్కసారిగా దిగిపోయింది. అడుగు వెనక్కి వేసి భయంగా చూశాడు. గర్భగుడి భయంకరంగా వికటాట్టహాసం చేసినట్లనిపించింది. చంద్రహారం సంగతి మరిచిపోయి, వెనక్కి తిరిగి పరుగెత్తుకొంటూ పోయాడు.

## 8

నాయుడు మత్తు వదిలించుకొని మంచంమీదనుంచి లేచాడు. దుప్పటిమీద అక్కడక్కడా నలిగి పడి ఉన్న మల్లెల్ని ఏరి, కిటికీ తలుపులు తెరిచి, అవతల మొక్కల్లోకి పారేశాడు. తలుపులు తెరవడంతో, అగరొత్తుల పొగతో నిండిన




గదిలోకి చల్లటి గాలి తోసుకొచ్చింది. అగరొత్తుల గుత్తి తీసుకెళ్ళి, బీరువా పక్కన చీకట్లో ఉన్న దేముడి పటం ముందుపెట్టాడు. బట్టలు మార్చుకొని, ఎర్రటి కంచి శాలువా కప్పుకొని, కిర్రు చెప్పులు తొడుక్కొని, టార్చి ఓ చేత్తో, చాపాటి కర్ర మరోచేత్తో పట్టుకొని, ముందు వసారాలోకి వచ్చాడు. వసారాకు దిగువగా చీకట్లో, పొలం పనివాళ్ళిద్దరు నిల్చున్నారు.

"ఏరా, కుప్పలు పడగొట్టారా ?" నాయుడు ప్రశ్నించాడు.

"పడగొట్టాం దొరా. పని మందంగా సాగుతోంది. ఎవళ్ళలోనూ చురుకు లేదు. ఈ రాత్రికి పని జరక్కపోతే, మళ్ళీ జనం దొరకడం కష్టం దొరా !" అన్నాడు, వాళ్ళలో ఒకడైన మల్లిగాడు.

"సరేలేరా మల్లిగా. నువ్వీ రెండొందలూ తీసుకొని, అప్పలస్వామి కొట్టు దగ్గరికిపోయి, వాడి కిచ్చి, మందు మన పొలానికి పట్టమ్మని చెప్పు. ఒరేయ్ శానాలూ, నువ్విక్కడే యింటి దగ్గరుండు అమ్మ గారింకా ఊర్నించి రాలేదు. దార్లో కారేదైనా ట్రబు లిచ్చిందో, లేక రేపు ఉదయమే వస్తుందో ? ఒకవేళ అమ్మగా రొస్తే, ఇల్లు అప్పజెప్పి నువ్వూ పొలానికి రా. రాకపోతే రేపటివరకూ ఇక్కడే ఉండు." వాళ్ళిద్దరూ బుర్ర లూపారు. నాయు డిచ్చిన రెండొందలూ తీసుకొని మల్లిగాడు వెళ్ళిపోయాడు. శానాలు చుట్ట వెలిగించి వసారా స్తంభాని కానుకొని కూర్చున్నాడు. నాయు డొక్క నిముషం ఆగాడు.

'వర్ధనం తిరిగి వస్తే ఒక స్త్రీ ఇంట్లో ఉండొద్దూ ? ఒకవేళ రాయుడు తనతో మాట్లాడానికి వస్తే ? తనింట్లో లేకపోతే, వర్ధనంతో ఏ సంఘర్షణ పడ్తాడో ? అయినా రాయుడు తనమీద దెబ్బతీయడానికి ప్రయత్నిస్తాడు కాని, వర్ధనం మీద విరుచుకుపడేంత అవివేకి కాడు. ఇప్పుడే వచ్చిన రాయుడిలో ఆవేశం అధికంగా ఉంటుంది. రెండు మూడురోజులు తను జాగ్రత్తగా ఉండాలి. ఈ రాత్రికి పొలంలో నలుగురి మధ్యనా ఉంటే అదో రకమైన ధైర్యంగా ఉంటుంది. ఉదయమే తను నాయు డింటికి వెళ్ళి, తను చేసిన తప్పు ఒప్పుకొని క్షమించమని అడగవచ్చును. నాయుడు పరి పరివిధాలా ఆలోచించాడు. "ఒరేయ్, అమ్మగారు తిరిగొచ్చినా, రాకపోయినా ఈ రాత్రికి ఇక్కడే పడుకో" అన్నాడు.

"సరేనయ్యా," అన్నాడు శానాలు. నాయుడు వసారా మెట్లు దిగి ఆవరణ తలుపు తోసుకొని, చీకట్లో కలిసిపోయాడు.

నాయుడు వెళ్ళిన రెండు నిముషాలకి వర్ధనం ఇల్లు జేరుకొంది.

"నేనమ్మా శానాల్ని. పొలంలో కుప్పలు పడగొట్టారు. అయ్యగా రిప్పుడే పొలానికి వెళ్ళారు. మీరు లోపలికి పోయి తలుపేసుకొని పడుకోండి. నే నిక్కడే వసారాలో పడుకొంటాను. మీ కేవిధమైన భయమూ లేకుండా పడుకోండి" శానాలు అమాయకంగా అన్నమాటలకు వర్ధనం చిన్నగా నవ్వుకొంటూ, లోపలకు వెళ్ళి తలుపు గడియవేసుకొంది.

తన తోటి పనివాళ్ళక్కడ అయ్యగారి పొలంలో అనుభవించే మందు మజా నూహించుకొంటూ, శానాలు నిద్రలోకి జారుకొన్నాడు. వాడెంత అదృష్ట వంతుడో వాడికి తర్వాత కాని తెలియలేదు.

## 9

'వర్ధనం తనంటే పడి చస్తోంది. ఇటు తనకా పెళ్ళి కుదిరింది. ఇద్దరూ ఈ విషయాన్ని ఎంత తేలిగ్గా తీసుకొన్నా, నిజంగా తన పెళ్ళి జరిగిన తర్వాత వర్ధనం తనకు దూరంగా జరిగిపోవచ్చు. ఈ లోపుగానే తను వర్ధనాన్ని మరింత ఆకట్టుకొని, ఎంతో కొంత ధనసహాయం పొందాలి. అప్పుడు తన హాస్పిటల్‌కి చాలా సదుపాయాలు కలిగించుకోవచ్చు.' తీయగా ఆలోచిస్తూ పథకాలు వేస్తున్న సమయంలో, పేరిశాస్త్రి గొంతు – అపరంజిరాగంలో అపస్వరంలా వినిపించింది రంగనాధానికి. విసుక్కుంటూ లేచి, లైటు వేసి, వెళ్ళి తలుపు తీశాడు. గాభరాగా ఉన్న శాస్త్రిని చూసి, రంగనాధం విసుగూ,

నవ్వూ – రెండూ జోడించి అన్నాడు. "నీ నిద్ర లేమికి నా దగ్గర మందేమీ లేదు !"

"నీకు నవ్వులాటగానే ఉంటుంది. రాయుడు జైలునుంచి తిరిగి వచ్చాడు !" అన్నాడు పేరిశాస్త్రి ఆందోళనగా.

రంగనాథం స్తబ్ధుడైపోయాడు. మరుక్షణంలోనే తేరుకొని అన్నాడు– "ఎప్పుడో అప్పుడు తిరిగి రాకపోడు కదా ! ఇవ్వాళ తిరిగివచ్చినందుకు జరిగే ప్రమాద మేమిటో ?"

"ఊరికినే అలా బింకంగా మాట్లాడకు. ఇంతకాలమూ వాళ్ళిద్దరూ నోరు మూసుకూర్చున్నా, ఇప్పుడు రాయుడితో జరిగింది చెప్పక మానరు. రాయు డూరుకునే రకం కాదు."

"ఈ బుద్ధి మన కా రోజే ఉండవల్సింది ! మంగ వ్యామోహంలో పడి యిద్దరమూ వళ్ళు తెలియకుండా ప్రవర్తించాం. ఆ పూజారిగాడికి డబ్బాశ చూపించి, అంతా జరిపించింది నువ్వే. అప్పటికప్పుడు మనం చేసిన వ్యవహారం, ఏనాటికో ఓ నాటికి బయల్పడక తప్పదనే జ్ఞానం ఆనాడే ఉండవల్సింది !"

"తప్పంతా నా మీదకే నెట్టకు. అయినా ఇప్పుడొకరి నొకరం, నిందించుకొని ప్రయోజనంలేదు. ముందు మనం, మన క్షేమం చూసుకోవాలి ! "శాస్త్రి, రంగనాథం మంచంమీద కూలబడుతూ అన్నాడు. "లోక నిందకు జడిసో మరెందుకో ఆ ఆడాళ్ళిద్దరూ నోరు మూసుకూర్చున్నారు. ఆ ఎరుకలసాని ముండ నోరు జారడంతో, మంగ కాలుజారిందని ఊరంతా ముక్కుమీద వేలేసు కుంది కాని, దానికా్కరణం మనమని ఎవరికీ తెలియదు. ఇప్పుడు రాయుడు తిరిగొచ్చిన తర్వాత మనల్ని రచ్చకీడిస్తే మట్టుకు ప్రయోజన మేమిటి ?– దొంగపడిన ఆర్నెల్లకి కుక్క మొరిగినట్లుగా ! మనకేమీ తెలియదని బొంకవచ్చు. వాళ్ళందరూ మతులు భ్రమించి మాట్లాడుతున్నారని మొండివాదన చెయ్యొచ్చును ! జైలునుంచి తిరిగివచ్చిన రాయుడు కూడా ఏమీ మాట్లాడడనే అనుకొంటున్నాను."

"నువ్వన్న మాటల్లో నిజమూ ఉంది ! వెర్రితనమూ ఉంది ! రాయుడు మాటలతో రచకీడ్చే రకం కాదు. ఈ పల్లెటూళ్ళలో చేతలే ప్రధానమని మర్చిపోకు. ఇప్పటికే రోడ్డున పడ్డ రాయుడు, మరి మాటలతో వ్యవహారం సాగించడు ! ఈ సంగతి మట్టుకు జ్ఞాపక ముంచుకో ?" శాస్త్రి నీరసంగా

అన్న మాటలు, రంగనాథాన్ని అచేతనుణ్ణి చేశాయి. పేరిశాస్త్రి మాటల్లో నిజం కొట్టొచ్చినట్టు కనబడ్డంతో, రంగనాథం గుండెల్లో కూడా గుబులు చోటు చేసుకొంది.

"ఇప్పుడేం చేద్దామంటావు ?" రంగనాథం బెదురుగా అన్నాడు. ఈమాటు శాస్త్రి నవ్వాడు.

"ఇప్పుడు తెలిసొచ్చిందా ? నిద్రమాత్రలు నువ్వే వేసుకుంటావో, నాకే యిస్తావో నీ యిష్టం !"

"హాస్యాలకీ, వ్యంగ్యాలకీ ఇది సమయం కాదు. ఏదో నిద్రమత్తులో అన్న మాటల్ని పట్టించుకోకు. ఇప్పుడేం చేద్దామంటావని మరోసారి అడుగుతున్నాను."

వేడి చల్లారేవరకూ మనం యిద్దరం కొంతకాలం ఊరు వదిలి వెళ్ళిపోవడం మంచిది. ఓ వారంరోజులు రాయుడెలా ప్రవర్తించేదీ తెలిసిన తర్వాత, సమయానుకూలంగా మనం ప్రవర్తించవచ్చు. అతగా డొకవేళ మనల్ని పంచాయతీ కీడిస్తే, నువ్వన్నట్లుగా అడ్డంగా తిరిగి వాదించవచ్చు.

"రేపుదయం కాకినాడ పోదాం, ఏమంటావు ?" రంగనాథం అన్నాడు.

"ఈ రాత్రి జరిగేదెలా ? నేను పోయి మా యింట్లో పడుకొంటాను. అరడజనుదాకా మా యింట్లో బలగముంది. ఎటొచ్చీ వంటరిగా ఉంటున్నవాడివి నువ్వే !" పేరిశాస్త్రి పుల్లవిరుపుగా అన్నాడు.

"అదీ నిజమే అయినా ఇంతరాత్రి ఊరువిడిచి వెళ్ళడమంటే ఎలా ? అన్నట్టు .."

"అన్నట్టు...?" పేరిశాస్త్రి ప్రశ్నించాడు.

"మన సంగతే ఆలోచించుకుంటున్నాం కాని, పూజారి సంగతి మరిచిపోయాం. రాయుడివల్ల మనకెంత ప్రమాదం ఉందో, అతగాడికి అంతే ఉంది. సరే పద, పోయి పూజారితో కూడా మాట్లాడుదాం. అతగాడి బుర్రలో ఏవో ఆలోచన లుండకపోవు ! అయినా ఈ తద్దినాన్ని కోరి తెచ్చుకున్నాం. ఇప్పుడేడ్చీ ప్రయోజనంలేదు !"

రంగనాథం త్వరగా బట్టలు మార్చుకొన్నాడు. ఉన్న డబ్బంతా జేబులో వేసుకొని 'పద' అన్నట్లుగా పేరిశాస్త్రికేసి చూశాడు. నిస్త్రాణగా మంచంమీదనుంచి లేచాడు శాస్త్రి. గదితలుపు తాళంవేసి, యిద్దరూ రామాలయంకేసి నడిచారు.

పూజారి బుర్రలో ఆలోచనలన్నీ రక్తపు కాల్వగా ప్రవహించి గడ్డలు కట్టుకుపోయాయన్న సంగతి, వాళ్ళకి రామాలయంచేరిన తర్వాతకాని తెలియలేదు.

## 10

అలా తిరిగొస్తా నన్నాడే కాని, రాయుడి కెక్కడికి వెళ్ళాలో ఏమీ తోచలేదు. ఎవరు మటుకు తన కే రకంగా సహాయం చెయ్యగలుగుతారు ? అయినా తాను ఆశించే సహాయ మేముందని ? తన గొడవలకి పరిష్కారమార్గం తానే చూసుకోవాలి అమాయికంగా నిద్రపోతున్న మంగని చూసి గుండె తరుక్కుపోయి, ఏదో వంకచెప్పి బయటపడ్డాడే కాని. నిజానికి—గోరుచుట్టుమీద రోకటిపోటులాంటి ఈ ఘాతుకానికి తట్టుకోలేకపోయాడు. జరిగిన దుష్కృత్యాన్ని సీతమ్మ వివరంగా చెప్తోంటే, ఎలా నిలదొక్కుకున్నాడో రాయుడికే తెలియదు. ఉవ్వెత్తుగా లేచిన ఉద్రేక పుటలలకి ఎలా గట్టు వేశాడో రాయుడికే తెలియదు. ఎటువంటి క్రోధావేశాల్ని చూపించినా, అవి మంగ జీవితంలో ఎటువంటి ముద్రలు వేస్తాయో నన్న భయం, రాయుడి కెక్కడలేని నిగ్రహాన్ని ఇచ్చింది. తను ప్రశాంతంగా ఉండడం చూసి, మంగ, సీతమ్మ కొండంత ధైర్యాన్ని పుంజుకొన్నారు.

అంతవరకూ నిలదొక్కుకున్న రాయుడు, మనసులోని ఆగ్రహాన్ని వెళ్ళగక్కుకొనేందుకు బయటపడ్డాడు. బయటపడ్డాడే కాని, ఎవరితో తన గోడు వినిపించుకోవడం ? మనసంతా చికాకుపడిపోతుండగా, ఏం చెయ్యడానికి తోచక, అనాలోచితంగా మాలపల్లెవైపు దారితీశాడు.

గొరమ్మదిబ్బమీద చీకట్లోకి చూస్తూ కూర్చున్నాడు నర్సిగాడు. జ్ఞానం తెలిసిన రోజునుండీ, వాడి జీవితం, వాడి తోటివాళ్ళ జీవితం, ఈ రోజువరకూ ఆ రాత్రి చీకటిలాగే ఉంటూ వచ్చాయి. చీకట్లో కీచురాళ్ళ రొదల్ని ఎవరూ పట్టించుకోనట్లుగానే, వాళ్ళ ఆక్రోదనలు కూడా ఎవరూ పట్టించుకోలేదు. ఊరంతా ఎవరి మడుల్లో వాళ్ళు కుప్పలు పడగొడ్తూంటే, ప్రభుత్వం పట్టా యిచ్చిన బంజరు భూముల్లో, గడ్డిమొక్కలు కూడా మొలిపించలేనివాళ్ళు, ఇంకా రెక్కలమ్ముకొనే బ్రతుకుతున్నారు. బంజరుభూముల సాగుబడికోసం చెరువూ, చెరువులోకి నీరు మళ్ళించడానికి కాలువలోంచి తూములు కావాలని వాళ్ళు పెట్టుకొన్న అర్జీ లేమయ్యా యో వాళ్ళకే తెలియదు. నర్సిగాడికి ఊరివాళ్ళ మీద కోపం ముంచుకొచ్చింది. పక్కనే పడుకొన్న బొల్లికుక్కమీద చూపాడా

కోపాన్నంతా. అది అరుచుకొంటూ దగువగా రోడ్డుమీదకు పోయింది. అది వెళ్ళినవైపు దృష్టి సారించాడు నర్సిగాడు. చీకట్లో వస్తున్న ఆకారాన్ని చూసి "ఎవరది ?" అని అరిచాడ.

నర్సిగాడి గొంతు సులువుగా ఆనవాలు పట్టాడు రాయుడు. "నేనేరా, రాయుణ్ణి. నీ కోసమే వస్తున్నాను. అంతదూరం నడవకుండా ఇక్కడే కలిశావు, బావుంది !" అన్నాడు రాయుడు. భయంతో నర్సిగాడి నరాలు బిగిసిపోయాయి. ఎక్కడ కూర్చున్న వాడక్కడే కూర్చుండిపోయాడు. వాడికి నోటమ్మట మాట రాలేదు. రాయుడు రొప్పుకుంటూ దిబ్బమీది కెక్కాడు. నర్సిగాడి పక్కన కూర్చుని భుజంమీద చెయ్యివేశాడు. అంతవరకూ రాయిలా కూర్చుండి పోయిన నర్సిగాడు, "నన్ను చంపకండి, దొరా !" అన్నాడు కంగారుగా. నక్షత్రాల వెలుతుర్లో లీలగా కన్పిస్తున్న నర్సిగాడి ముహంలోకి చూస్తూ అన్నాడు రాయుడు– "డబ్బుకి కక్కుర్తిపడి, తిన్న యింటి వాసాలు లెక్కపెట్టి, చీకట్లో వెన్నుపోటు పొడిచే నీలాంటివాణ్ణి కాదురా నేను ! నిన్నిప్పు డేంచేస్తే మట్టుకు నాకు కలిగిన నష్టం తీరుతుంది ?"

నర్సిగాడు రాయుడి కాళ్ళమీద పడ్డాడు. "క్షమించు దొరా! కాలే కడుపులు కళ్ళకు పొరలు కమ్మితే, నాయుడుదొర మాటలు విని తప్పుడు సాక్ష్యము చెప్పాను. రెండునెలలు జైల్లో ఉన్నందుకు నాయుడుదొర నాలుగొందలు ముట్ట జెప్పినా, తర్వాత ఏముంది దొరా ? ఈరోజువరకూ్కడా పస్లు సరిగ్గా దొరక్క ఎన్ని పస్తులున్నామో, ఆ భగవంతుడికే తెలుసు !" రాయుడు నర్సిగాణ్ణి లేవనెత్తి కూర్చోబెట్టాడు.

"ఇంత చీకట్లో ఇక్కడ కూర్చుని ఏం చేస్తున్నట్లు ?" రాయుడు ప్రశ్నించాడు.

"పంట పండినోళ్ళందరూ కుప్పలు పడగొడ్తూంటే, గడ్డి మొలవని గొడ్డు భూముల్ని చూస్తూ ఏడుస్తున్నాను దొరా. నీటి వసతిలేని భూముల్ని నెత్తిన కొట్టి, సాగు చేసుకోండని అంటే, ఏం చేసేది ? మాకిచ్చిన భూములు భూముల్లాగే వున్నాయి. పైవాళ్ళ పొలాల్లో పస్లున్నప్పుడు మాత్రమే, ఏదో రెక్కలు విరుచుకొంటే, కాసింత గంజికి నోచుకుంటున్నాం." నర్సిగాడు దీనంగా అన్నాడు.

"నాయుడి మాటలు విని నాకు ద్రోహం తలపెట్టి, మీ గోతులు మీరే తవ్వుకొన్నారు. మొదట్నించీ మీ బాగుకోసం పాటుపడిన నన్ను, విశ్వాసం



లేకుండా వెన్నుపోటు పొడిచారు. ఈ భూములయినా మీకు రావడంకోసం ఎంత కష్టపడ్డానో మీకు తెలుసును. చెరువుకూడా ప్రయత్నంచేసే సమయంలో, నాలుగొందలకి కక్కుర్తిపడి, నన్ను నాయుడి మార్గంనుంచి తప్పించావు ! మీరు బావుకొన్న దేమిటి ? పశువుల్ని కడగడం, బట్టలుతకడం ఇంకా ఇతరమైన అవసరాలకు వాడబడే ఊరి చెరువు, మంచినీళ్ళ కేనాడో యోగ్యం కాకుండాపోయింది. ఇంకా ఊరిజనం ఆ కృష్ణారావుగారి నూతులమీదే మంచినీళ్ళకోసం ఆధారపడ్తున్నారు. అటువంటి చెరువుని మట్టి తీయించి ఏం ప్రయోజనం ? పోనీ ఆ కూలి పనైనా మీకు దొరకిందా ? ఆ డబ్బుతో, మరి కొంత కలిసి కట్టు సహాయంతో, మీ వాడ ప్రక్కన చెరువు త్రవ్విద్దామన్న నా ప్రయత్నాల్ని మీరు అవివేకంగా గొడ్డలితో నరికి పారేశారు ! ఇప్పు డేడ్చి ఏం ప్రయోజనం ?"

"బాబూ, మీరందరూ చదువుకున్నోళ్ళు. నాలుగు మాటలతో మనసులు విరిచే లౌక్యంగల ప్రభువులు. ఎవరి మాటలు నమ్మాలో, ఎవరి మాటలు నమ్మకూడదో, తెలియని బుర్రలు మావి. ఏ చోట రెండు నూకలు కనబడితే, అక్కడ చీమల్లా చేరే బతుకులు మావి. మాల వాడ దగ్గర చెరువుకు మీరే

అడ్డం తగుల్తున్నట్లు నాయుడుదొర చెప్తే నమ్మేశాం. మర్యాదగా బతుకుతున్న మిమ్మల్ని జైలుపాలుచేసి, పాపం మూట కట్టుకొన్నాం. మేం ఏం చేస్తే మా పాపం తీరుతుంది ?"

"నేను జైలుకు వెళ్ళినందు కంత బాధగాలేదు. ఏ నాటికో ఓ నాటికి నువ్విప్పుడు గ్రహించిన సత్యం, నలుగురికీ తెలిసేది. మంట కల్సిందనుకొన్న మర్యాద మళ్ళీ నిలిచేది. కాని నేనింట లేనప్పుడు, నా కూతురి జీవితం నాశన మైంది. దాని బ్రతుకు నిలబెట్టగలనా, ఇప్పుడు ?" రాయుడు క్రోధంగా ప్రశ్నించాడు.

నర్సిగాడు నెమ్మదిగా సందేహిస్తూ అన్నాడు. "అవును బాబూ. అమ్మాయి గారలా పాడైపోవడం మాకందరికీ విచారంగా ఉంది."

"అది పాడైపోలేదు నర్సిగా !" రాయుడు గట్టిగా అరిచాడు. "దాన్ని బలవంతంగా పాడుచేశారు. నోట గుడ్డలు కుక్కి, నా అక్కగారి కళ్ళెదుట దాన్ని బలత్కారం చేశారు. ఇంట్లో మగదిక్కులేని సమయంలో మోసంచేసి నా మంగ జీవితాన్ని రాక్షసుల్లా నాశనంచేసి, గంగపాలు చేశారు. ఎవరో తెలుసా ?"

"ఏమిటి దొరా, మీరంటున్నది ?!" నర్సిగాడు ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"నీ కాశ్చర్యంగానే ఉంటుంది. తాగి వాగిన ఎరుకలసాని మాటలతో ఊరూ వాడా ఏకమైందే కాని, నా కూతుర్ని కన్నఊరే చెరిచిందని మీ రెవరూ ఊహించలేదు. మనసులు భ్రమసిపోయి మౌనంగా ఉండిపోయిన అ ఆడాళ్ళ మీద విరుచుకుపడ్డంతప్ప. నేనే కనక ఊళ్లో ఉంటే ఇటువంటి ఘోరం జరిగే దంటావా ?"

నర్సిగాడు రాయుడి కాళ్ళమీద మరోసారి పడ్డాడు. చాలా అన్యాయం జరిగిపోయింది దొరా. అభం శుభం ఎరుగని ఆ పిల్లదాని బతుకు బండలపాలైంది. నన్ను చంపెయ్యండి దొరా !" అంటూ బావురుమన్నాడు

"నిన్ను చంపగలిగితే, దానిమీద అఘాయిత్యం చేసినవాళ్లని, ముందుగా నరికి పారేసి ఇక్కడ కొచ్చేవాణ్ణి. లే, ఏదో నా మనసులో ఉన్న బాధ చెప్పుకోవడం కోసం వచ్చాను."

నర్సిగాడు లేచి కూర్చుంటూ అడిగాడు, "దొరా, ఎవరా లంజకొడుకులు ?"

రాయుడు నర్సిగాడికి జరిగినదంతా వివరంగా చెప్పాడు. "దొరా మే మందరమూ కలిసి, న్యాయానికి అన్యాయంచేసిపారేశాం. మా పాపాలు మమ్మల్ని

వెంటాడక మానవు. పదండి, చాలా రాత్రైపోయింది. మిమ్మల్ని యింటికాడ దిగబెడ్తాను." నర్సిగాడు లేచి, రాయుడి చెయ్యందుకున్నాడు. గుండెల్లో బరువు తగ్గడంతో, రాయుడు మౌనంగా ఇంటిదారి పట్టాడు, పక్క-పక్కనే నర్సిగాడు నడుస్తుండగా. తలుపు తట్టిన వెంటనే, సీతమ్మ తలుపు తీసింది. తమ్ముడి వెనకగా ఉన్న నర్సిగాణ్ణి చూసి ఆశ్చర్యపడింది. ఆ ఆశ్చర్యంనుంచి తేరుకొనే లోగా నర్సిగాడు సీతమ్మ కాళ్ళమీద పడ్డాడు. "సీతమ్మతల్లీ, మీకందరికీ తీరని ఘోరం జరిగిపోయింది. దీనికంతటికీ కారణం ఈ వెధవేనమ్మా ! దొడ్డ మనసుగల మీ తమ్ముడు నన్ను క్షమించి వదిలేశాడు !" తము దే అఘాయిత్యం చేస్తాడోయేమోనని కంటిమీద కునుకులేకుండా కూర్చున్న సీతమ్మకి, ఈ పరిణామం సంతృప్తి నివ్వటంతో, ఒక దీర్ఘ నిశ్వాసం విడిచింది. దణ్ణాలు పెడ్తూ నర్సిగాడు, చీకట్లో కలిసిపోయాడు. రాయుడు లోపలికి వెళ్ళి, నిద్రపోతున్న మంగవైపు జాలిగా చూసి, తన మంచంమీద నడుం వాల్చాడు. సీతమ్మ తలుపు గడియవేసి, దీపం తగ్గించి, తనూ మంచంమీద నడుం వాల్చింది.

# 11

అప్పలస్వామి కొట్టు చేరేసరికి, వెంకటరత్నం సారాబుడ్లు సైకిల్ కారియర్ కి తగిలించిన క్రరతొట్టిలో సర్దుతున్నాడు. అప్పలస్వామి తమ్ముణ్ణి అడిగాడు. "ఎక్కడికిరా పోతున్నావు ?"

"నాయుడిగారి చెక్కలో కుప్పలు పడగొట్టారట. నాయాళ్ళందరికీ హుషారుగా లేదంట. నాయుడి మనిషొచ్చి, రెండొందలిచ్చి వెళ్ళాడు, సరుకు వెంటనే పట్టుకు రమ్మని. అక్కడికే పోతున్నాను."

"ఉన్న సరుకంతా అక్కడకు తీసుకుపోతే, రాత్రి ఈ లారీ వాళ్ళందరూ నెత్తిమీద వెంట్రుకలు పీకేస్తారు !"

"వెధవది రాత్రంతా నిద్ర పాడుచేసుకొని ఉండడ మెందుకూ ? ఒక్క బేరంతో సరుకంతా చెల్లుబడి అయిపోయింది కదా. హాయిగా యింటికిపోయి పడుకొంటే, వీళ్ల కే రోగమో, రొచ్చో వచ్చిందనుకొని, వాళ్లే సర్దుకుపోతారు. ఇప్పటికే ఆలస్యమైపోయింది అక్కడ సరుకందించేసి, నేనింటికి పోతాను. ఈ రాత్రి కెవడైనా టీ నీళ్లతో సర్దుకు పోతాడన్న యిది ఉంటే, ఆ కాసిని డబ్బులకోసం నీ కోపిగ్గా ఉంటే ఉండు. లేకపోతే నీ యిష్టం !" అని వెంకట రత్నం, సైకిలెక్కి నాయుడి పొలంకేసి దారితీశాడు.

'ఎప్పుడో వచ్చే నాపసన్నాసి బేరాలకోసం, ఈ కుర్రవెధవ లిలాగే తట్ట

తగలేస్తారు ! సరేలే, టీ నీళ్ళే పోసి, ఈ రాత్రి కెలాగో సర్దిచెప్తా కానీ, దుకాణం మూస్తానా ?' అనుకొంటూ, గళ్ళాపెట్టెముందు కూర్చున్నాడు, అప్పలస్వామి.

"దొంగనాయాల, చెడుగుడు ఆటలో దెబ్బతిన్న స్నేహితుడికి కట్టు కట్టమంటే, ముందు డబ్బు పెట్టి మరీ మాట్లాడమన్నాడు, ఆ రంగనాథం డాక్టరు! వీడి బండారం బయటపడింది ! వీణ్ణి కాస్త ఆట పట్టిస్తేనే కాని, నా పేరు వెంకటరత్నం కాదు ! అయినా నాయుడు పెళ్ళాంకూడా ఎంత బరితెగించింది ! ఆ వెధవనాయాల మోజులో పడిపోయినట్లుంది. ఈ పెద్ద కొంపల్లో వ్యవహారా లిలానే ఉంటాయి కాబోలు !" అని పరిపరి విధాల ఆలోచిస్తూ, వెంకటరత్నం నాయుడి పొలం చేరాడు. పడమటి చెక్కలో ఉన్న కళ్ళంచుట్టూ, నాలుగైదు గాస్‌లైట్లు వెలుగుతున్నాయి. కుప్పల్ని నీరసంగా పడగొడ్తున్నారు, నీరసంగా ఉన్న కూలీలు. నెమ్మది నెమ్మదిగా డ్రైవరు, ట్రాక్టరుతో గడ్డి తొక్కుతున్నాడు.

నేరేడు చెట్టుకింద చీకటి నీడల్లో, పడక్కుర్చీలో చుట్ట కాలుస్తూ కూర్చున్నాడు. వెంకటరత్నాన్ని చూస్తూనే, "ఇంత ఆలస్యమైందేమిటోయ్ ? ఇక్కడ వీళ్ళందరూ నజ్జుపడిపోయారు. త్వరగా వెళ్ళి, అందరికీ తలో బుడ్డీ అందించి రా," అన్నాడు విసుక్కుంటూ. వెంకటరత్నం, సైకిల్ని కళ్ళం దగ్గరగా తీసుకువెళ్ళాడు. పని చేస్తున్న ఇరవైమందీ ఒక్కసారిగా ఎగబడ్డారు. వెంకటరత్నానికి శ్రమ లేకుండా, తమంత తామే, తలో బుడ్డీ ఎగరేసుకు పోయారు. దగ్గరగా వచ్చిన ట్రాక్టరు డ్రైవరుకి ఓ బుడ్డీ అందించి, వెంకట రత్నం దూరంగా తప్పుకొన్నాడు. కాలే కడుపులకి మందు పట్టించి, కూలీలు కదం తొక్కడం ప్రారంభించారు. నాయుడు నవ్వుకొంటూ వెంకటరత్నాన్ని దగ్గరగా పిలిచాడు. "ఇంకా ఎంత సరుకు మిగిలింది ?" ప్రశ్నించాడు.

"ఇంకా పదిసీసా లున్నాయి దొరా. ఇక్కడే మీ పక్కనే పెడ్తాను," అంటూ, వెంకరత్నం కారియర్‌కి తగిలించిన తొట్టిని తీసి, నాయుడి పక్కగా పెట్టాడు.

"సరే కష్టపడి తెచ్చినందుకు, నువ్వూ ఓ పట్టు పట్టించు. డబ్బు విరక్కోసు కోన్లే !" అన్నాడు, నాయుడు నవ్వుతూ. వెంకటరత్నం, ఓ క్షణం సందే హించాడు. నాయుడి కుర్చీ పక్కన గడ్డిలో కూలబడుతూ, ఓ సీసా అందుకొన్నాడు. తృప్తిగా నవ్వుకొంటూ, నాయుడు మాగన్నుగా నిద్రతీశాడు.




## 12

మంచం మీద వాలిన వర్ధనం, తీయటి ఆలోచనలతో, ఖాళీగాఉన్న పక్కను రంగనాథంతో ఊహించుకొంటూ, మత్తుగా తలగడకింద చెయ్యిపెట్టింది. చేతి కేదో తగలడంతో, లేచి, లైటువేసి చూసింది. ఎర్రగా మెరుస్తున్న చిట్లిపోయిన గాజు! దానికేసే గుడ్లప్పగించి చూస్తూ కూర్చుండిపోయింది, చాలాసేపు. అప్పుడప్పుడు తను తప్పుపని చేస్తుందేమో అన్న ఆలోచన వచ్చే వర్ధనం, ఒక్కసారిగా నవ్వుకొంది. ఇప్పుడు తను మొగుణ్ణి మోసం చేస్తోందన్న బెంగ లేదు! ఎవరి జీవితాల్ని వాళ్ళు నందనవనంగా చేసుకొంటున్నారు. మరుక్షణంలో, మొగుడు ఇంట్లోనే అంత తెగించి వ్యవహరిస్తోన్నందుకు విస్తుపోయింది. 'ఆడదానివై యుండీ, నువ్వే ఇంతకి తెగించినప్పుడు, మొగాడై ఉండీ నీ మొగుడా మాత్రం తెగింపెందుకు చెయ్యకూడదూ!?' అని తనకు తానే సమాధానం చెప్పుకొంది. మరుక్షణంలో మనస్సుని బెంగ ఆవరించింది. ఇలా జీవితాలు దాగుడుమూతల్లో ఎంత కాలం జరుగుతాయి? తప్పుడుదారులు ఆటలాడిస్తాయి. నిఃకడలేని ఆలోచనలతో వర్ధనానికి నిద్ర చెదిరిపోయింది. గదిలో ఊపిరాడనట్లనిపించి, హాలు తలుపు తీసుకొని, ముందు వసారాలోకి వచ్చింది. తలుపు తీసిన చప్పుడు వినిపించి, శానాలు నిద్ర మేల్కొన్నాడు.

"ఏమోయ్, ఇంకా నిద్ర పోలేదా ?" అని అడిగింది వర్ధనం.

"మంచి నిద్రే పట్టేసిందమ్మా. తలుపు తీసిన చప్పుడు వినిపించి మెలకువ వచ్చిందంతే," అన్నాడు.

"అంటే నీది ఏనుగు నిద్రన్నమాట !" వర్ధనం నవ్వుతూ అంది. శానాలు కూడా నవ్వేసి ఊరుకొన్నాడు. "నీకు పెళ్ళయిందా ?" వర్ధనం హఠాత్తుగా అడిగిన ప్రశ్నకు, శానాలు తబ్బిబ్బైపోయాడు.

"మనువాడి మూణ్ణెల్లయిందమ్మా," అన్నాడు వాడు సిగ్గుపడుతూ.

"సరేలే, నువ్వింటికి పోయి పడుకో. నాకేం భయంలేదులే," అంది వర్ధనం నవ్వుతూ. శానాలు సందేహించాడు. "రాత్రల్లా ఇక్కడే కాపలా పడుకొన్నావని నేనయ్యగారితో చెప్తాన్లే పర్వాలేదు, నువ్వింటికిపోయి పడుకో."

"అలాగే నండమ్మగారూ," అంటూ శానాలు కింద పరిచిన గుడ్డని తీసుకొని వెళ్ళిపోయాడు.

చాలా సేపు అస్తవ్యస్తమైన ఆలోచనల్తో వసార్లో పచార్లుచేసి, వర్ధనం లోపలికి వెళ్ళింది. 'గమ్యం తెలియని మార్గాల్లో ఎంతకాలమిలా గడవాలి?' అనుకొంటూ జుట్టు పీక్కొంది. ప్రాణం బిగుసుకుపోయినట్లయి చీరవిప్పి మూలకి గిరాటు వేసింది. గుండెలు బిగిసినట్లనిపించి, జాకెట్ తీసి, మరో మూలకు విసిరి పారేసింది. ఎదురుగా బల్లమీద సగంనిండిఉన్న విస్కీమూత తీసి, అయిదారు గుక్కలు పట్టించేసి, మంచంమీద కూలబడి నిద్రకోసం తన్నుకోసాగింది.

## 13

రంగనాథమూ, పేరిశాస్త్రీ పూజారింటికి వెళ్ళారు. తలుపు తాళంవేసి ఉండడం చూసి, ఒకవేళ గుళ్లోనే పడుకొన్నాడేమోననుకొని, రామాలయంలో అడుగు పెట్టారు. గర్భగుడివరకూ తలుపులన్నీ తెరిచిఉన్నాయి పూజారితోపాటు, దీపాలు కూడా ఎప్పుడో ఆరిపోవడంతో, ఆలయం దెయ్యాల గుహలా ఉంది. రంగనాథం 'పూజారీ,' అంటూ టార్చి వేశాడు. పేరిశాస్త్రీ, రంగనాథం ఇద్దరూ ఒకేసారిగా అదిరిపోయి, గుడిబయటకు పరుగెత్తారు. ఇద్దరూ పోయి గంగరావిచెట్టు చుట్టూ ఉన్న తిన్నెమీద కూలబడ్డారు. పేరిశాస్త్రి వణికిపోతూ అన్నాడు. "చూశావా, ఊళ్ళో అడుగుపెడ్తూనే రామాలయం పూజారిని కైలాసానికి పంపించేశాడు ! నే చెప్తే నమ్మావు కావు. రాయుడి లిస్టులో తర్వాతి రెండు పేర్లూ మనిద్దరివే!"

"నువ్వన్నట్టుగా ఇది మాటలతో వ్యవహారం కాదు. పోలీసులకి రిపోర్టు చేస్తే ?" రంగనాథం ప్రశ్నించాడు, ఆదుర్దాగా.

"ఏమని చేస్తాం ? 'మేమిద్దరమూ కలిసి పూజారి సహాయంతో, రాయుడి



కూతుర్ని చెరిచాం. రాయుడు కక్షకొద్దీ పూజార్ని చంపేశాడు. మమ్మల్ని ఇంత రక్షించండి ' అనా! ఈ ఊళ్లోఉంటే ప్రస్తుతానికి భూమ్మీద నూకలు చెల్లవు. రాయుడెప్పుడు దెబ్బతీస్తాడో తెలియదు. ఇప్పుడే మనం ఊరు విడిచి వెళ్ళిపోవాలి !"

"ఇంత రాత్రివేళ ఎలా?" అని రంగనాథం ఒక్క-క్షణం ఆలోచనలో మునిగిపోయాడు. తర్వాత అన్నాడు. "నేను నాయుడుగారింటికి వెళ్ళి, ఏదో వంకతో అర్జంటుగా కారు కావాలని తీసుకు స్తాను. కాకినాడ పోయి, కారుని నాయుడి మావగారి డ్రైవరుతో పంపించవచ్చు."

"తర్వాత..."

"ఓ నెల్లాళ్ళపాటు చూద్దాం. నేనింక ఈ ఊళ్ళో ప్రాక్టీసు చెయ్యగలననుకోను. దూరంగా మరో జిల్లాలో ఎక్కడో, ఏదో గ్రామం చూసుకొంటాను. ఇకపోతే నీ సంగతే నువ్వు చూసుకోవాలి."

పేరిశాస్త్రికి ఏడుపొచ్చినంత పనయింది. రంగనాథంమీద ఒక్కసారిగా కసి పెరిగింది. అయినా చేసేదేమీలేక, అవమానాన్ని భరించాడు. మళ్ళీ రంగనాథమే

అన్నాడు. "ఇద్దరమూ ఒకేసారిగా కట్ట కట్టినట్లుగా ఊరు విడిచి వెళ్ళడం, ఎవరికైనా అనుమానం కలిగించదూ ?"

"పూజారికీ మనకూ ఉన్న లావాదేవీలు, ఒక్క రాయుడి కుటుంబానికి తప్ప మరెవరికీ తెలియదు. పూజారి అంతు చూసిన రాయుడు, ఈ విషయంలో మౌనంగా ఉండక తప్పదు !"

"అవును. నువ్వన్న మాటల్లో నిజం లేకపోలేదు. అయినా మన జాగ్రత్తలో మన ముండాలి. అందుకని నువ్వో పనిచెయ్యి. నువ్వు మీ యింటికి పోయి, నాలుగైదురోజులవరకూ యిల్లు కదలకు. చుట్టూ నలుగురున్నవాడివి కాబట్టి, రాయుడు నిన్నేమీ చెయ్యగలడనుకోను. తర్వాత పీలునుబట్టి ఎలా చెయ్యాలో, అలా చేద్దువుగాని."

రంగనాథం తన దారి తాను చూసుకొంటున్నాడు. తను కాకినాడ మట్టుకు వెళ్ళి ఎక్కడుంటాడు ? రంగనాథం నీడ తప్ప మరో దారిలేదు. ఆ నీడ నివ్వడానికి రంగనాథం సిద్ధంగా లేడు. తనకు భుక్తి ఎలా గడుస్తుంది ? పేరిశాస్త్రికి నడుం విరిగినట్లయింది. నిరాశ హృదయాన్ని నింపేసింది. తన చేతకానితనానికి తనే అసహ్యించుకొంటూ, రంగనాథంతో మరి మాట్లాడకుండా, లేచి వెళ్ళిపోయాడు. రంగనాథం పేరిశాస్త్రి భారం వదిలినందుకు లోలోపల సంతోషించకపోలేదు, ఒక్క క్షణం. రాయుడు తరుముకొస్తున్నాడేమో అన్నంత భయంతో నాయు డింటికేసి పరుగెత్తాడు, మరుక్షణం.

## 14

నాయుణ్ణింటి దగ్గర దిగబెట్టిన తర్వాత నర్సిగాడి కేమీ పాలుపోలేదు. వాడికి గుండెలు కరిగిపోయాయి. అనాలోచితంగా తను చేసిన ద్రోహానికి, రాయుడి కుటుంబం రోడ్డున పడింది. తనిప్పుడు రాయుడుదొర కేవిధంగా సహాయం చెయ్యగలడు ? మాయ మాటలు చెప్పి, డబ్బాశ చూపించిన నాయుణ్ణి నిలదీసి నాలుగూ అడగాలి. దానికి వాడికి గుండె ధైర్యం చాల్లేదు. 'సర్లే, ఈ డబ్బున్న నాయాళ్ళకి కష్టా లొచ్చినా అవే సర్దుకుపోతాయి ! ఇప్పటికే వాళ్ళ గొడవల్లో అనవసరంగా ఇరుక్కొన్నాను. ఇంక మళ్ళీ మన కెందుకు ? అని సరిపెట్టుకొని, మాలగూడెంవైపు నాలుగైదడుగులు వేసి, మళ్ళీ మనసొప్పక నాయుడి పొలంకేసి దారితీశాడు.

నర్సిగాడు నాయుడు పొలం చేరేసరికి, జనం పని జోరులో ఉంది. మాగన్నుగా కునుకు తీస్తున్న నాయుడి పక్కగా నిల్చుని, "దొరా," అని

పిల్చాడు. పక్కనే గడ్డిలో పడుకొన్న వెంకటరత్నం నిద్రలో కదిలాడు. నాయుడికి మెలకువ వచ్చింది. నర్సిగాణ్ణి చూస్తూ, "ఏరా, పనుందని కబురంపితే, నీ జట్టుని పంపించి నువ్వు రాలేదు. నువ్వు లేకపోతే ఆ వెధవలు సరిగ్గా పనిచెయ్యరు. రెండొందలు తగలెట్టి ఇంత మందు పోసిన తర్వాత, నాలుగడుగులు వేస్తున్నారు" అన్నాడు.

" మా ఇంటిదానికి వంట్లో ఆరోగ్యంలేక రాలేకపోయాను." నర్సిగాడన్నాడు.

"మరేదీ కానివేళ ఇప్పు డెందుకొచ్చినట్లు ? పను లున్నప్పుడు రమ్మని కబురంపితే రాక, పనులు లేనప్పుడు మా కడుపులు మాడ్చేస్తున్నారని గొడవ చెయ్యడం మట్టుకు వచ్చున్నా నీకు ! సరేలే, నువ్వూ కాస్తంత మందు పట్టించి, నాలుగు బూతులు తిడితే, తెల్లవారేలోగా పని జరిగిపోతుంది !" అన్నాడు నాయుడు. నాయుడితో మాట్లాడ్డానికి తనకు ధైర్యం కావాలి. ఆ ధైర్యంకోసమని నర్సిగా డో సీసా తీసుకొని ఖాళీ చేసేశాడు. మూతి తుడుచుకొనే సమయానికి వాడికి ధైర్యం వచ్చేసి నట్లనిపించింది. దాంతో గొంతు సవరించుకొని, నెమ్మదిగా అన్నాడు. "రాయుడు దొర కలిశాడు !"

"ఏమిటీ, రాయుడు నిన్ను కలిశాడా ?!" నాయుడు బిత్తరపోతూ అడిగాడు.

"అందుకే కద, ఇంత రాత్రివేళ ఇక్కడి కొస్త ! మీ రేమీ అనుకోకపోతే ఓ మాటంటాను దొరా !" చెప్పమన్నట్లుగా చూశాడు నాయుడు.

"మనందరం కలిసి రాయుడి దొర కన్యాయం చేసేసినాం. దానికా దొర విచారించటంలేదు కాని, కూతురి జీవితం గంగపాలయిందని ఇదైపోతున్నాడు." నర్సిగాడి మాటలు విన్న నాయుడికి కొంత ఆశ్చర్యమే కలిగింది. అంటే రాయుడు తనమీద విరుచుకుపడకపోవచ్చును. మనసులో కొంచెం ధైర్యం కలిగింది.

"బావుందిరా, ఏదో తొందరపాటులో ముందు వెనుక లాలోచించకుండా అతగాణ్ణన్యాయం చేసినందుకు బాధపడ్తోనే ఉన్నాను. మరి తండ్రి ఇంట లేనప్పుడు, కూతురు చేసిన పనికి మనమేం చేస్తాం ?"

నర్సిగాడు కోపంగా అన్నాడు. "అక్కడే అందరమూ పొరబడిపోయాం. ఆ పూజారిగాడి సహాయంతో, రంగనాథం డాక్టరూ, పెద్దపంతులు కొడుకు పేరిశాస్త్రీ కలిసి, బలవంతంగా ఆ ఆడకూతుర్ని చెరిచేశారు. మీరు చెంప

లేసుకొంటే, కటకటాల వెనక్కు వెళ్ళిన బాధ మర్చిపోగలడు కాని, మచ్చ పడిన కూతురి జీవితాన్ని బాగుచేసుకోగలడా, దొరా ! ? "

నాయుడు స్తబ్ధుడై పోయాడు. పొలం గట్లకి దూరంగా చీకట్లో గుంటనక్కల అరుపు లొక్కసారిగా, భయంకరంగా వినిపించాయి నాయుడికి. నర్సిగాడు జరిగింది చెబ్తోంటే, నాయుడికి బుర్ర తిరగడం ప్రారంభించింది. ఎంత దారుణం జరిగిపోయిందని ! తను చేతుల్తో ఎత్తుకొని ఆడించిన మంగని, కసాయివాళ్ళ చేతుల్లోకి తను పరోక్షంగా తోలాడు. ఎన్నో జన్మల పాపాన్ని, తను ఈ ఒక్క జన్మలోనే చేశాడు. ఈ పాపాన్ని ఎన్ని జన్మల్లో అనుభవిస్తే తన పాపానికి నిష్కృతి లభిస్తుంది ? నాయుడు రెండుచేతుల్తోటీ, తల పట్టుకొన్నాడు బాధగా. మత్తెక్కుతున్న నర్సిగాడు నాయుడికేసి చూస్తూ, నేలమీద చతికిలబడి మరో సీసా అందుకొన్నాడు.

ఉన్నట్టుండి కళ్ళంలోంచి అరుపులు వినవచ్చాయి. నాయుడు దిగ్గున లేచి అటు వెళ్ళాడు. ట్రాక్టరు నడుపుతున్న డ్రైవరు స్టీరింగ్ వదలి, రెండు చేతుల్తోటీ కడుపు పట్టుకొని, బాధతో మెలికలు తిరిగిపోతూ కింద కురికేశాడు. ట్రాక్టరు తిన్నగా వెళ్ళి పక్కనే ఉన్న బోదిలోకి దిగబడి ఆగిపోయింది. లగెత్తి అరుస్తోన్న కూలీజనం కొంతమంది కిందపడి కొట్టుకోసాగారు. కొంత మందికి వాంతు లొచ్చి రక్తం కక్కుకొంటున్నారు. "ఓర్నాయనోయ్, కళ్ళు మసగలు కమ్మేశాయిరోయ్ !" అంటూ మరి కొంతమంది అడ్డదిడ్డంగా పరుగెడుతూ కూలబడిపోయారు. నాయుడి కొక్కసారిగా మతిపోయింది. 'కొంప మునిగింది ? ఇప్పుడేం చెయ్యాలి. ఈ నాటుసారాలో విష మేదో కలిసింది !' నాయుడికి వళ్ళంతా చెమట పట్టేసింది. పరుగున వెళ్ళి వెంకట రత్నాన్ని కుదిపాడు. వాడు బాధగా మూలిగి, కళ్ళు తెరిచి, బాధతో తన్నుకో సాగాడు.

నాయుడు గాభరాగా అడిగాడు. "ఇదేమిటోయ్, ఏం సరుకు తీసుకొచ్చావు? అందరి కందరూ ఒక్కసారే పడిపోయారు !"

"ఏమో తెలియదు బాబూ ! ప్రాణాలు పోతున్నాయి. మీరు త్వరగా వెళ్ళి సహాయాన్ని తీసుకురండి." వెంకటరత్నం దీనంగా అన్నాడు.

సగం ఖాళీ అయిన రెండో సీసాని పట్టుకొని నర్సిగా డచేతనంగా చూస్తూ ఉండిపోయాడు. నాయ డు వాడి చేతిలో సీసా లాగి పారేశాడు. "నేను ఊళ్లోకి వెళ్ళి జనాన్ని తీసుకొస్తాను. అమ్మగా రొచ్చారో లేదో తెలియదు. ఒకవేళ

వస్తే, వెంటనే కారులో జనాన్ని తీసుకొస్తాను. ఎడ్లని బళ్ళకట్టి, వీళ్ళందరిన్నీ ఊళ్లోకి తీసుకుపోవచ్చు. ఒకవేళ కారు లేకపోతే, గుర్రబ్బళ్ళమీద తీసుకొస్తాను. ఒరేయ్ నర్సిగా, నువ్వు నోట్లో వేళ్ళెట్టుకొని కక్కడానికి ప్రయత్నించు," అని, వెంకటరత్నం సైకిలు తీసుకొన్నాడు.

"అయ్యా, అమ్మగారు తిరిగొచ్చేశారు. డాక్టరు రంగనాథం కూడా అమ్మ గారితోపాటు కారులో వచ్చాడు. మీరు ముందరగా కారు తీసుకొని, జనంతో పాటు, డాక్టర్ని కూడా తీసుకురండయ్యా. ప్రాణాలు పోతున్నాయి!" వెంకటరత్నం అతి ప్రయత్నంమీద అనగలిగాడు.

"వాళ్ళు రావడం నువ్వు చూశావా ?" నాయుడు ప్రశ్నించాడు.

ఏదో అనబోయిన వెంకటరత్నం, అంత బాధలోనూ మనసు నదుపులో పెట్టుకొన్నాడు. దాచి డబ్బు చేసుకొందామన్న రహస్యాన్ని, పదిలంగానే ఉంచుకొన్నాడు. "మా కొట్టు మలుపులో... " అని ఇంకా ఏదో చెప్పబోయిన వెంకటరత్నం స్పృహ తప్పి పడిపోయాడు.

నాయుడు మరింక ఆలస్యం చెయ్యలేదు. పులిమీద పుట్రలా ఒకదాని తర్వాత ఒకటి, మీదపడిన అవాంతరాలతో అదిరిపోయిన నాయుడు, వణుకు తున్న కాళ్ళతో, మొద్దుబారిపోయిన మెదడుతో సైకిలు తొక్కుకొంటూ ఊరు దారి పట్టాడు. మొద్దుబారిన ఆలోచనల్లో, రంగంనాథం కూడా వర్ధనంతోబాటు కారులో రావడ మనేది - లీలగా, అస్పష్టంగా, చోటుచేసుకొంది. వర్ధనం తిరిగి వచ్చింది కాబట్టి, తిన్నగా ఇంటికి పోయి ముందరగా కారు తీసుకొని బయటపడితే బావుంటుందని నిశ్చయించుకొని, నాయుడు వడివడిగా సైకిలు తొక్కడం ప్రారంభించాడు.

నాయుడు వెళ్ళిన మరి నాలుగు నిముషాలకి, నోట్లో వేళ్ళెట్టుకొని కక్కడానికి ప్రయత్నిస్తూన్న నర్సిగాడికి కక్కురాలేదు కాని, భయంతో ప్రాణాలు మట్టుకు త్వరగా బయటకు వచ్చేశాయి.

## 15

రంగనాథం నాయు డింటికి చేరాడు రొప్పుతూ. ఆవరణ దాటి, వసారా మెట్లెక్కి "నాయ డుగారూ," అని పిల్చాడు. తలుపులు కొద్దిగా తెరుచుకొనే ఉన్నాయి. ఆ సందులోంచి లోపలి వెలుతురు లీలగా బయటకు కనబడుతోంది. నిద్రపట్టక తన్నుకొంటోన్న వర్ధనానికి రంగనాథం గొంతు వినబడ్డంతో, లేచి

ముందర హాల్లోకి వచ్చి, తలుపు దగ్గర నిలబడి, "ఎవరూ ?" అని అడిగింది దీర్ఘం తీస్తూ.

"నేను - రంగనాధాన్ని. నాయుడుగారు లేరా ?" ఆదుర్దాగా ప్రశ్నించాడు రంగనాధం.

"గారూ అనక్ఖర్లేదు. పొలం పనిమీద చేను కెళ్ళాడు. నువ్వు లోపలికి రా!" వర్ధనం వెనక్కు తిరిగి, గదిలోకి పోయి మంచంమీద పడుకొంది. రంగనాధం తటపటాయించాడు. నెమ్మదిగా తలుపు తోసుకొని, హాల్లోంచి నడిచి వెళ్ళి, వెల్తురున్న గదిలోకి వెళ్ళాడు. రేగిన జుట్టు, మత్తెక్కిన కళ్ళు. తెల్లటి లంగా - బ్రా. కవ్విస్తున్న కామదేవతలా ఉన్న వర్ధనాన్ని, గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోయాడు రంగనాధం.

"అలవాటయిన శరీరమేకదా ! ఎందు కలా చూస్తావు ?" వర్ధనం మత్తుగా, కవ్వింపుగా అడిగింది. సమాధానం చెప్పటానికి, రంగనాధం గగన ప్రయత్నమే చెయ్యవలసి వచ్చింది.

"సరసాల కిది సమయం కాదు. నా కర్జంటుగా కారు కావాలి. కాకినాడ వెళ్ళాలి. కారక్కడ మీ నాన్న గారింట్లో వదిలేస్తాను."

"ఎందుకో, అంత అవసరం ?"

"నేను గదికి వెళ్ళేసరికి మెడికల్ ఆఫీస రుద్యోగంకోసం, హైద్రాబాద్ నుండి ఇంటర్వ్యూ కాయితం వచ్చి పడుంది. కాకినాడ వెళ్ళి వెంటనే, బస్సుమీద హైద్రాబాద్ వెళ్ళాలి." రంగనాధం ముందుగానే ఆలోచించుకొన్న అబద్ధాల్ని ఆడాడు.

"నా దగ్గర్నుండి దూరంగా పోదామనా ? నువు వెళ్ళడానికి వీల్లేదు ! నీ కా ఉద్యోగం రాకూడదు !" వర్ధనం బాధగా అంది.

"ఉద్యోగం వచ్చి మరో ఊరు వెళ్ళినా, నే నెప్పుడూ నీకు దగ్గరగానే వస్తూంటాను." రంగనాధం అనునయంగా అన్నాడు.

"మరి వచ్చిన వెంటనే రాకుండా, ఇంత ఆలస్యంగా ఎందు కొచ్చినట్లు ? ఇలా నా కళ్ళలోకి చూసి చెప్పు. నిజంగా నీకు హైద్రాబాద్ వెళ్ళే పనుందా ? ఏదీ, ఇంటర్వ్యూ కాయితం చూపించు."

రంగనాధం ఇరుకునపడ్డాడు. "అది గదిలో ఉంది." రంగనాధం సమాధానంలో బరువు లేదు. వర్ధనం లేచి కూర్చుంది. గుండెల మీదనుంచి బ్రా దిగజారిపోయింది.




"తెల్లారేవరకూ వొంటరితనాన్ని భరించలేకుండా ఉన్నాను. కాస్త తోడుండరాదూ ? ఎప్పుడూ పగల్ని రాత్రి చేస్తున్నావు కాని, ఈ రాత్రిని రాత్రిగా నా దగ్గర గడపరాదూ !?" వర్ధనం చిలిపిగా అడిగింది.

అప్పటికే నరాలు బిగిసిపోయిన రంగనాథం అతి ప్రయత్నంమీద అన్నాడు– "నువ్వు బరితెగిస్తున్నావు. ఇది ప్రమాదాలకి దారితీయొచ్చు !"

తలగడ కిందనున్న ఎర్రగాజుని బయటకు తీసి, రంగనాథానికి చూపిస్తూ అంది. "ఇంతకాలమూ భయంగానే వ్యవహరిస్తూ వచ్చాను. ఈ గాజుని చూస్తున్నావా ? ఇది నాది కాదు. నే నింట్లో లేనప్పుడు, అతగాడు మరో దానితో ఇదే మంచంమీద కులికాడు ! నేనూ అదే పనిచేస్తే తప్పేముంది కనక ?"

వర్ధనం వంటిమీద తెలివిలేకుండా ఆ మాట లంటోందని రంగనాథం గ్రహించాడు. అయినా వర్ధనం ఆహ్వానాన్ని తిరస్కరించలేకపోయాడు. ఒక్క అడుగు ముందుకు వేసి, బుర్ర బద్దలయిన పూజారి రూపం కాళ్ళకు బంధం వెయ్యడంతో, ఆగిపోయాడు.

"కారు కావలిస్తే, అలాగే తీసుకువెడుదువుగాని. కాని ఇప్పుడు కాదు, తెల్లారేముందు." వర్ధనం మొండిగా అని, చేతులు చాచింది. రంగనాథం మరి

ఆగలేక, ముందుకు నడిచాడు. చాచిన చేతుల్ని, వర్ధనం రంగనాథం మెడ చుట్టూ పెనవేసింది.

ఆ ఆనందపు ఘడియల్లో, తలుపులు తీసి ఉన్నాయన్న ధ్యాస వాళ్ళిద్దరికీ లేకపోయింది. అదే వాళ్ళ కొంప ముంచింది !

## 16

"అమ్మా, అన్నయ్యొచ్చినట్లున్నాడు. తలుపు కొడుతున్నాడు." అంది పేరిశాస్త్రి చెల్లెలు, నిద్రమత్తులో. నడవలో నులకమంచంమీద పడుకొన్న పేరిశాస్త్రి తల్లి పార్వతమ్మ, తలుపు తీయడానికని లేచింది. పక్క గదిలోంచి విశ్వనాథశాస్త్రి కోపంగా అరిచాడు. "ఊరంతా అడ్డగాడిదలా తిరిగి అపరాత్రి వేళా, అర్ధరాత్రివేళా ఇష్టంవచ్చినప్పుడు తిరిగి రావడాని కిదేమీ సత్రంకాదు. వెధవని బయటనే ఉండనీ. తలుపు తీసావంటే తంతాను." చెట్టంత కొడుకుని అలా తిడ్తూంటే, పార్వతమ్మకి బాధే అనిపించింది. పిల్లిలా బయట నుంచున్న పేరిశాస్త్రికి తండ్రి మాటలు వినిపించాయి. మరో సందర్భంలో అయితే, ఇటువంటి పరిస్థితిలో హాయిగా ఎక్కడో గడిపేసేవాడు. కాని ఇప్పుడు రాయుడి భయంవల్ల, బయట తిరగలేని పరిస్థితి. పేరిశాస్త్రిని నిరాశా, నిస్పృహా మరోసారి ఆవహించాయి. తల్లిని అడ్డంపెట్టుకొని, ఇంతకాలమూ ఆడిన ఆట లింక సాగవని గ్రహించాడు. తన కిప్పుడు రక్షణ అవసరం. "అమ్మా తలుపు తియ్యవే. ఆ ఉద్యోగంలో చేర్తానని నాన్నగారికి చెప్పు," అన్నాడు దీనంగా.

"ఏమండీ, అబ్బాయి ఉద్యోగంలో చేరతానంటున్నాడు. వాడేదో ఆలోచించు కోడానికి బయటకు పోయినంతమాత్రాన, ఇలా తలుపులు తియ్యకుండా వాణ్ణి బయట ఉంచడం బావుండదు. నలుగురికీ తెలిస్తే నవ్వులాటగా ఉంటుంది !" అంది పార్వతమ్మ ఇద్దరికీ వినబడేటట్లుగా. విశ్వనాథశాస్త్రి మాట్లాడలేదు. పళ్ళు కొరుక్కుంటూ మంచంమీద దొర్లాడు. పార్వతమ్మ లేచి, నెమ్మదిగా తలుపు తీసి, పేరిశాస్త్రి లోపలికి వచ్చిన తర్వాత మళ్ళీ తలుపు వేసి నిద్రలోకి తృప్తిగా జారుకొంది.

పేరిశాస్త్రి మౌనంగా వెళ్ళి వెనక వరండాలో మంచం వాల్చుకొని, దుప్పటి కప్పుకొని పడుకొని ఆలోచించసాగాడు. త నిప్పు డిల్లు కదలకుండా, ఇంటి పట్టున కూర్చోడమనేది అసంభవం. ఉద్యోగంలో చేరకుండా ఏమాత్రం జాప్యంచేసినా, తండ్రి మెడపట్టుకొని బయటకు గెంటుతాడు. ఉద్యోగం



కోసం ప్రతిరోజూ, దొడ్డంపేట సైకిలుమీద వెళ్ళి రావడమనేది ప్రస్తుత పరిస్థితుల్లో సాధ్యంకాని పని. ఏ క్షణంలోనైనా తను రాయుడి కోపానికి ఆహుతి కావచ్చు. ఎవరికీ ఏమీ చెప్పుకోలేని ఇరకాటంలో పడిపోయాడు తను. ఆదుకొంటా డనుకొన్న రంగనాథం, తన దారి తాను చూసుకొంటున్నాడు. కళ్ళు తెలియని కామంలో, త నీ తద్దినాన్ని కోరి తెచ్చుకొన్నాడు. మరిప్పుడు మార్గం ? ఆలోచనలతో వేడెక్కిన బుర్రలో ఏదో చిన్న మెరుపు మెరిసి నట్లయింది. దానికో రూపాన్ని తీసుకొచ్చిన పేరిశాస్త్రి, నెమ్మదిగా మంచంమీది నుంచి లేచాడు. వంటగదిలోకి పోయి, దేముడి గూట్లో ఉన్న తల్లి తాళాలు తీశాడు. వెనక గదిలో ఉన్న బీరువా తలుపు తీసి, ఇద్దరి చెల్లెళ్ళకోసం తల్లి చేయించిన రెండేసి జతల బంగారం గాజుల్ని, పట్టుచీర మడతల్లోంచి తీసి, జేబులో పెట్టుకొన్నాడు. బీరువా తాళంవేసి, తాళాన్ని దేముడి గూట్లో పడేశాడు. పసుపుగుడ్డ కట్టిఉన్న హుండీ తీసి, ఉన్న డబ్బంతా జేబులో కుక్కుకొని, దొడ్డిగుమ్మంతలుపు తీసుకొని బయటపడ్డాడు.

కామ క్రోధాలే కాదు – భయమనేది కూడా ఎంత పనైనా చేయిస్తుంది. ఆ భయానికి లొంగిపోయే, పేరిశాస్త్రి ఆ నిశ్చయాని కొచ్చాడు. అస్తవ్యస్తమైన ఆలోచనలతో పుంతదారమ్మట నడిచి మెయిన్‌రోడ్డు చేరుకొన్నాడు. పుంత మలుపులో, అప్పలస్వామి కొట్లో సందడిలేదు. అప్పలస్వామి గల్లాపెట్టి ముందు కూర్చుని నిద్రకి జోగుతున్నాడు. పేరిశాస్త్రి వడివడిగా అడుగు లేసుకొంటూ, అప్పలస్వామి కొట్టుకి ఎగువగా అరమైలు దూరం నడిచి, రోడ్డుపక్కగా నిల్చుని, రాజమండ్రి పోయే లారీలకోసం, ఎదురు చూడసాగాడు.

## 17

ఉన్నట్లుండి నిద్రలోంచి మేలుకొన్న మంగ, "అత్తమ్మా !" అంటూ ఓ గావుకేక పెట్టింది. సీతమ్మా, రాయుడూ వెంటనే ఉలిక్కిపడి లేచి, మంచం దగ్గరకు వెళ్ళారు. అత్తమ్మా, కడుపులో చాలా నొప్పిగా ఉందంటూ మెలికలు తిరిగిపోసాగింది మంగ.

సీతమ్మ బెంబేలుపడిపోతూ, "దీని కర్థాంతరంగా నొప్పు లొస్తున్నాయి. నువ్వు వెంటనే పోయి, ధర్మాసుపత్రి డాక్టరమ్మని తీసుకురా," అని మంగని పొదివి పట్టుకొంది. రాయుడు వేరు ఆలోచించకుండా బయటకు పరుగెత్తాడు. ఆస్పత్రి ఎలా చేరాడో రాయుడికే తెలియదు. ముందు వరండాలో ముసుగు దన్ని పడుకొన్న చౌకీదారు బాలయ్యని లేపి, నర్సు సంగతి అడిగాడు. "దానికి కొత్తగా పెళ్ళయింది బాబూ. సెలవుమీద పోయింది. మీరేదో చాలా కంగారుగా ఉన్నట్లున్నారు. డాక్టరమ్మ ఊళ్ళోనే ఉందిలెండి. పదండి, వెనక్కు పోయి లేపుదాం," అని బాలయ్య ఆస్పత్రి ఆవరణలో వెనకవైపుగా నడిచాడు. రాయుడు కూడా వెంటనే వెళ్ళాడు. బాలయ్య, "అమ్మగారూ" అంటూ తలుపు తట్టాడు.

"ఎవరూ ?" అంటూ విసుక్కుంటూ లేచి, తలుపు తీసిన డాక్టరు, ఎదురుగా ఉన్న రాయుణ్ణి గుర్తించి, "మీరా !" అంది. రాయుడు త నెందుకు వచ్చిందీ చెప్పాడు కంగారుగా. "ఒక్క క్షణం ఆగండి. ఇప్పుడే వస్తాను," అని లోపలికి వెళ్ళి మొగుణ్ణి లేపింది. "ఏదో అర్జంటుగా పురిటి కేసు వచ్చింది. మీరు పిల్లాణ్ణి చూస్తూ ఉండండి," అని మందుల బాగ్ తీసుకొని బయటకు వచ్చింది. బాలయ్య బాగ్ అందుకొన్నాడు. రాయుడు ముందు నడుస్తుండగా, బాలయ్య వేస్తున్న టార్చి వెల్తుర్లో అడుగులేసుకొంటూ వాళ్ళని అనుసరించింది డాక్టరమ్మ

డాక్టరమ్మ, రాయు డిల్లు చేరిన తర్వాత బాలయ్య చేతిలోంచి బాగ్ తీసుకొని, లోపలకు వెళ్ళింది. రాయుడూ, బాలయ్యా బయటే ఉండిపోయారు. పదినిము షాలు పోయినతర్వాత డాక్టరు బయటకు వచ్చింది. "సమయం కాకుండా నొప్పు లొస్తున్నాయి. కడుపులో బిడ్డ అడ్డం తిరిగిపోయింది. మీరు వెంటనే కత్తెర వేయిస్తేనే కాని లాభంలేదు ఆ సౌకర్యాలు ఈ చిన్న అస్పత్రిలో లేవని మీకూ తెలుసు. మీరు వెంటనే అమ్మాయిని రామచంద్రాపురం పెద్దాసుపత్రికి తీసుకువెళ్ళండి. ఈ ఆస్పత్రి అంబులెన్సు కూడా లేని దౌర్భాగ్యపు స్థితిలో ఉంది. ఎలాగోలా రామచంద్రపురం చేరడం అవసరం," అన్నది రాయుడితో.

రాయుడు బాలయ్యతో అన్నాడు – "నువ్వు అమ్మగారిని ఆస్పత్రిలో దిగబెట్టి, గుర్రబ్బండి వెంకటేశాన్ని లేపి, బండి తీసుకురమ్మను. నే నీ లోపుగా నాయుడిదగ్గర కారుందేమో చూసొస్తాను కారైతే త్వరగా వెళ్ళవచ్చును. లేనిపక్షంలో బండి ఎలానూ తప్పదు" బాలయ్యా, డాక్టరూ వెళ్ళిపోయారు.

రాయుడు తనన్న మాటలకు తనే ఆశ్చర్యపోయాడు. ఏమిటీ, తను నాయుడి దగ్గరకు కారుకోసం వెడతాడా !? తీరని విధంగా తన కన్యాయం చేసిన నాయుడి దగ్గరకు కారుకోసం వెడతాడా? బిడ్డమీద మమకారం, గతాన్ని ఒక్క క్షణంలో ఎలా మరపించేసింది ? "అక్కా, నువ్వు మంగని కనిపెట్టు కొని ఉండు. ఇప్పుడే నేను కారుకోసం ప్రయత్నించి వస్తాను," అని రాయుడు, నాయు డింటికేసి పరుగెత్తాడు.

## 18

మిన్ను విరిగి మీదపడ్డట్టు, పడగ్గది గుమ్మందగ్గర నిల్చుండిపోయి, ఎదురుగా ఉన్న దృశ్యాన్ని చూశాడు నాయుడు. గుండె వేగంగా కొట్టుకొంది. రక్తనాళాలు చిట్లి కళ్ళెర్రబడ్డాయి. ప్రళయకాలరుద్రుడై, "ఏమిటీ ఘోరం !" అని గర్జించాడు. ఆనందపు టలల్లో తేలిపోతున్న రంగనాధం, వర్ధనం ఒక్కసారిగా హడలిపోయి లేచి కూర్చున్నారు. ఇద్దరి ముఖాల్లోనూ కత్తివాటుకు నెత్తురు చుక్కలేదు. వంటిమీద నూలుపోగు కూడా లేని వర్ధనం, దుప్పటిని మీదకు లాక్కొంది. రంగనాధం మంచంమీదనుంచి కిందకు జారాడు. రంగనాధానికి తన ఆయువు మూడిందని తెలిసింది. ఆ ప్రాణభయం ఎక్కడ లేని తెగువనీ ఇచ్చింది. ఉన్న శక్తినంతా కూడబెట్టుకొని, ఒక్క ఉదుటున

లేచి, నాయుణ్ణి పక్కకు తోసి పారిపోవాలని ప్రయత్నించాడు. దూసుకు పోతూన్న రంగనాథం చెయ్యిని ఉడుంపట్టులా పట్టి, ఒక్క గుంజు గుంజాడు నాయుడు. రంగనాథం గూడులోంచి జబ్బ బయట కొచ్చింది. బాధతో విలవి లలాడిపోయాడు.

"నన్నొదలండి. ఇందులో నా దోషం లేదు. ఏనుండి కారుకోసం వస్తే వర్ధనమే నన్ను ఇరకాటంలో పెట్టేసింది !" రంగనాథం ఏడుస్తూ అన్నాడు.

"ఇదీ ఒక్కరోజు వ్యవహారమే కాదనీ, వర్ధనం కూడా తోడుదొంగేనని మీ ఇద్దరి వాలకం చూస్తూంటేనే తెలుస్తోంది. రాయుడి కూతురు కూడా, నిన్నూ పేరిశాస్త్రిని కలిసి, కావాలనే చెరచమందిరా తొత్తుకొడకా ! తల్లిలాంటి మరో ఆడదాని కళ్లెదుటగా కావాలనే చెరిపించుకొందిరా దొంగనాయాలా !" నాయుడా క్షణంలో, పొలంలో విలవిలలాడుతున్న ప్రాణుల సంగతి మర్చిపోయాడు. "పదరా, లంజకొడకా, మీ ముగ్గుర్నీ కలిసి ఇప్పుడే ఉప్పు పాతర వేస్తాను !"

రంగనాథం బేజారెత్తిపోయాడు. బాధ భరించలేకపోతున్నాడు. చెయ్యి వదులుగా వేలాడుతోంది. అప్పటి కప్పుడే గూడంతా వాచిపోయింది. "మీ కా అవసరం లేదు. పూజారిని రాయుడు బుర్ర బద్దలు కొట్టి చంపాడు ! జన్మలో మరి ఇటువంటి పనిచెయ్యను ! నన్ను వదలండి ప్లీజ్ !"

"మంచిపనే చేశాడు. అందుకనే బెదురుపుట్టి పలాయనంకోసం, కారు కోసం వచ్చి ఉంటావు ! అవునా ?"

రంగనాథం మాట్లాడలేదు. వర్ధనం కొయ్యబారిపోయి రంగనాథంకేసి అసహ్యంగా చూస్తూ ఉండిపోయింది.

"ప్రాణభయం వెన్నాడుతోన్నా, నీ దాహం తీర్చుకోడానికి వెనుకాడని గుండె లున్న బంటువిరా ! నిన్ను ప్రాణాలతో వదిలితే, ఇంకా ఎన్ని కొంపలు కూలుస్తావో ! లే !" నాయుడు వెర్రి ఆవేశంతో రంగనాథం గొంతుక చుట్టూ చేతులు బిగించేశాడు. భయవిహ్వాల అయిన వర్ధనం కళ్లెదుట నాలికా, గుడ్లూ బయటకు తన్నుకొచ్చి, రంగనాథం ప్రాణాలు వదిలేశాడు.

ఎర్రగాజుని చూపించి రంగనాథంతో చేసిన తర్కం, మొగుడి ముందు సాగదని వర్ధనానికి తెలుసు. మొగుడికేసి దీనంగా చూడ్డం తప్ప, మరేమీ చెయ్యలేకపోయింది.

"కారు తాళా లెక్కడ ?" నాయుడు గర్జించాడు. వర్ధనం బల్లమీదనున్న హాండ్‌బాగ్ కేసి చూసింది. నాయుడు తాళాలు తీసుకొన్నాడు.

"ఈనాటితో నీకూ, నాకూ బంధం తీరిపోయింది. ఇదింక మాటలకు సమయం కాదు. నా తెలివితక్కువ మూలాన, నమ్మకద్రోహం చేసినందుకు, నాకు తగిన శిక్షే లభించింది. వస్తాను !" నాయుడు గిరుక్కున తిరిగి, బయటకు వచ్చి తలుపు లాగి, బయట కసిగా గొళ్లెంపెట్టి, హాల్లోంచి బయటకు వచ్చాడు. వసారా మెట్లు దిగి, ఆవరణలో ఓ మూలగా ఉన్న కారుకేసి నడుస్తున్న సమయంలో, "నాయుడూ!" అన్న రాయుడి పిలుపు విని ఎక్కడివా డక్కడే నిలిచిపోయాడు.

## 19

"నాయుడూ ! గతాన్ని తవ్వి నీ మీద కక్ష సాధించుకోడానికి రాలేదు. అర్ధాంతరంగా నొప్పు లొచ్చి, నా కూతురు నరకయాతన పడ్తోంది. రామచంద్రపురం అస్పత్రికి తీసుకువెళ్ళి, కత్తెర వేయిస్తే కాని పిల్ల గండం గడిచి బయటపడే మార్గం లేదు. నువ్వు నీ కారులో నా కూతుర్ని అక్కడకు తీసుకువెళ్ళాలి." రాయుడు, నాయుడి చేతులు పట్టుకొంటూ అడిగాడు. చీకట్లో నాయుడి కళ్ళమ్మట కారుతున్న నీళ్ళని, రాయుడు గమనించ లేకపోయాడు.

నాయుడు, రాయుణ్ణి కౌగలించుకొంటూ, "నేను చేసిన పాపమే నన్ను దెబ్బ తీసింది ! రాయుడూ, నిక్షేపంలాంటి నీ జీవితాన్ని నాశనం చేశాను, నా స్వార్ధంకోసం ! నా వాళ్ళ స్వార్థంకోసం ! చేసిన తప్పులకి తర్వాత క్షమార్పణలు చెప్పుకొంటా కాని ప్రస్తుతానికి వద్దాం. అక్కడ పొలంలో ఇరవైమందిదాకా కాపు సారా వాతకుబడి గిలగిలా కొట్టుకొంటున్నారు. జనాన్ని పోగుచేసుకొని వెళ్దామని కారుకోసం వచ్చాను. ఇప్పుడేం చేద్దాం ?" అన్నాడు. రాయు డేదో అనబోతుండగానే, నాయు డన్నాడు. "పద ఇక్కడున్న అస్పత్రి సౌకర్యాలతో, వాళ్ళ ప్రాణాలు నిలబెట్టడం కష్టం. నే నూళ్లో పదిమంది జనాన్నీ, నాలుగైదు బళ్ళనీ పోగుచేసుకొని ఆ జనాన్ని అస్పత్రిదాకా తీసుకొస్తాను. నువ్వు రైసు మిల్లు మెకానిక్ సుబ్బరాజుతో నా కారు తీసుకొని, నీ కూతురితో రామచంద్రపురం వెళ్ళు. అక్కడ ఆస్పత్రి వాళ్ళకి సంగతి చెప్పి, అంబులెన్సులీన్ని, సహాయాన్నీ పంపే ఏర్పాట్లు చెయ్యి. ఈ లోపుగా మన డాక్టరమ్మ ఏంచెయ్యగలదో చూద్దాం !" నాయుడి గుండెనిబ్బరానికి, రాయుడు వింతపడుతూ కారులో కూర్చున్నాడు. నాయుడు కారుని చెరువు గట్టుకేసి పోనిచ్చాడు. దార్లో నాయు డన్నాడు. "నర్సిగాడు జరిగిందంతా

చెప్పాడు. నిన్నొక ప్రశ్న అడుగుతున్నాను. నిజం చెప్పు. పూజారిని కాని నువ్వు బుర్ర బద్దలుకొట్టావా ?"

రాయు డాశ్చర్యపోతూ అన్నాడు— "నేను ప్రతీకారం మొదలెడ్తే, నీతో ప్రారంభించేవాణ్ణి. నా కడుపులో బాధ దాచుకోలేక నర్సిగాడితో చెప్పుకొన్నా కాని, లేకపోతే అదీ జరిగేది కాదు. జైలు నాకు చాలా పాఠాలు నేర్పింది. నాలోని వివేకం నన్ను నిగ్రహపర్చింది. అయినా పూజారి బుర్ర బద్దలయిందన్న సంగతి నీ కెలా తెలుసు ? నా కిదో వార్త !"

"నీ కా నేరంలో జోక్యం లేనప్పుడు, ప్రస్తుతానికి నీకు వివరాలు తెలియకుండా ఉండడమే మంచిది. నిజానికి నాకూ తెలియవు వివరాలు. నువ్వు నాలుగైదు రోజులపాటు రామచంద్రపురంలోనే ఉండిపో." నాయుడు తృప్తిగా ఆలోచించుకొంటూ, రాయుడితో అన్నాడు. కారు సుబ్బరాజు ఇంటి ముంద రాపాడు. హారన్ విని కళ్ళు నులుసుకుంటూ లేచాడు, సుబ్బరాజు. రెండు ముక్కల్లో నాయుడు, సుబ్బరాజుని లేవదీశాడు. సుబ్బరాజెలా ఉన్నవాడలాగే వచ్చి కారులో కూర్చుని స్టీరింగు తీసుకొన్నాడు.

రాయు డింటి దగ్గర కారాగింది. ఇద్దరూ వెంటనే కారు దిగారు. మంగని మోసుకొచ్చి కారులో కూర్చోబెట్టారు. ఆశ్చర్యంతో, సీతమ్మ మంగని పొదివి పట్టుకొని, కారులో కూర్చుంది. రాయుడు కూడా కారులో కూర్చుండబోతున్న సమయంలో వెంకటేశు గుర్రబ్బండిని తీసుకొచ్చాడు "నీ కారు దొరకని పక్షంలో ఉంటుంది కదా అని బండికోసం ఏర్పాటుచేశాను నువ్వు వెంటనే వీడి సహాయంతో మరో నాలుగైదు బళ్ళని కుదుర్చుకొని, వాళ్ళనందర్నీ ఆస్పత్రికి తీసుకువెళ్ళు. అక్కడ మంగని ఆస్పత్రిలో చేర్పించిన వెంటనే నేనూ ఇక్కడి కొస్తాను" అన్నాడు రాయుడు.

"రాయుడూ, నిన్నిక్కడికి నాలుగైదురోజుల దాకా రావద్దన్నాను నీ కూతురి క్షేమం నువ్వు చూసుకో. ఇక్కడి వ్యవహారాలు నేను చూసుకొంటాను. సుబ్బరాజూ, పుంత మలుపులో ఒక్కసారి కారాపి, అప్పలస్వామితో, వాడిచ్చిన సరుకు తాగి, జనం చావుబతుకుల్లో ఉన్నారని చెప్పు. వెంకటరత్నం కూడా స్పృహతప్పి పడున్నాడని చెప్పు. ఆ వెధవని మరింక సారా అమ్మొద్దని కూడా చెప్పు. ఇక్కడ ఈ జనంకాక మరెంతమంది దాని వాతబడ్డారో !" నాయు డన్నాడు, వాళ్ళిద్దర్నీ ఉద్దేశించి. సుబ్బరాజు కారుని స్టార్టుచేసి బయలుదేరాడు.

నాయుడు వెంకటేశుబండిలో కూర్చుని, "చెప్పింది విన్నావు కదా! నన్ను ముందుగా ఆసుపత్రి దగ్గర దింపి, నువ్వు ఊళ్ళో ఉన్న బళ్ళన్నీ తీసుకురా ఊఁ కదులు," అన్నాడు - ఏం జరుగుతుందో లీలగా అర్థమైన వెంకటేశు గుర్రాన్నదలించాడు. నాయుడు ఆస్పత్రిదగ్గర దిగి లోపలకు పరుగెత్తాడు. వెంకటేశు ముందుకు సాగాడు. అప్పటికే నిద్రా భంగమై కూర్చున్న బాలయ్య "ఏం జరిగింది దొరా ?" అంటూ ముందుకు వచ్చాడు.

"డాక్టరమ్మని తీసుకురా" అన్నాడు నాయుడు. బాలయ్య విస్తుపోతూ వెనక్కి పరుగెత్తాడు. డాక్టరు మళ్ళీ ఏం కొంప మునిగిందోయేమోనని కంగారు పడుతూ వచ్చింది.

నాయుడు జరిగిందంతా నాలుగుముక్కల్లో చెప్పి అన్నాడు— "రాముణ్ణి అతని కూతురితోపాటు రామచంద్రపురం నా కారులో పంపాను. అక్కణ్ణుంచి ఆ బులెన్సులూ, సహాయమూ వచ్చేలోపుగా, మీరు కాపుసారా వాతబడ్డ జనానికి చేయగలిగింది చెయ్యండి."

"ఎంతమంది జనం?" డాక్టరు ప్రశ్నించింది.

"ఇరవైమంది పైనే ఉన్నారు."

"ఆస్పత్రిలో ఉన్న విరుగుడు మందు ఇద్దరికూ్కడా చాలదు. అయినా అక్కడ పొలంలో వాళ్ళని చూడ్డం కష్టమే అవుతుంది. నే నిక్కడ నాకు వీలైనన్ని మందుల్నీ, ఏర్పాట్లనీ సిద్ధంచేస్తాను. మీ రీ లోపుగా ఆ జనాన్ని బళ్ళమీద తీసుకొని రండి. రామచంద్రపురంనుండి సహాయం రాగానే, ఎలా వీలుంటే అలా చేద్దాం" అంటూ డాక్టరు ఆస్పత్రిలోకి వెళ్ళింది. "అయ్యా, మీకు బళ్ళవాళ్ళందరూ సహాయంగా ఉంటారు కదా! నే నీ లోపుగా అమ్మగారికి సహాయం చేస్తాను" అంటూ బాలయ్య కూడా లోపలికి వెళ్లాడు.

మరో అయిదు నిముషాల్లో వెంకటేశు, అరడజను గుర్రబ్బళ్ళతో తిరిగొచ్చాడు. నాయుడు వెంకటేశు బండిలో కూర్చుని, "కంకిపాడు రోడ్లో, నా పొలం తెలుసును కదా! అక్కడకు పోనియ్," అన్నాడు. ఒకదాని వెనుకగా మరొకటి, ఆ చీకటి రాత్రిలో గతుకుల రోడ్డమ్మటపడి, ఆ బళ్ళన్నీ నాయుడి పొలంకేసి దౌడుతీయసాగాయి.

## 20

వర్ధనం ఎర్రగాజుకేసి చూస్తూ కూర్చుండిపోయింది. రంగనాథం కట్టెకేసి అప్రయత్నంగా కళ్లు తిరిగాయి. తను కవ్వించి, కదిలించిన

రంగనాథం శరీరం నిర్జీవంగా పడిఉంది. తనను కదిలించి, కవ్వించి, మురిపించిన రంగనాథం శరీరం, నిర్జీవంగా, భయంకరంగా తన కేసి చూస్తోంది. గదిలో ఆ కట్టెను తోడుగా ఉంచి, తలుపు గొళ్ళెంపెట్టి, చాలా కఠోరమైన శిక్ష విధించి మరీ వెళ్లాడు. బలవంతంగా దృష్టిని ఎర్రగాజు మీదకు తిప్పుకొంది. తన మూర్ఖత్వంవల్లా, తనను కన్నవాళ్ళ మూర్ఖత్వంవల్లా, నిక్షేపంలాంటి జీవితంలో నిప్పులు పోసుకొంది! తను చేసిన తప్పులు మంటలు మండుతూ చుట్టూ వలయాన్ని గీస్తున్నాయి. ఎర్రగాజులోంచి భయంకరమైన జ్వాలలు లేచి తనను చుట్టుముట్టుతున్నాయి. వాటినుండి తప్పించుకోలేదు. తప్పించుకొన్నా తన జీవితం, ఆ చిట్లిపోయిన గాజులాగే వ్యర్థం. బతికి తను లోకం ముఖం చూడలేదు.

వర్ధనం ఓ నిశ్చయాని కొచ్చేసింది. మంచంమీదనుంచి లేచి, మూల గిరవాటువేసిన చీరని తీసి, పై దూలంమీదకు విసిరింది.

## 21

రోడ్డువారగా నుంచున్న పేరిశాస్త్రి, ఓ పది పదిహేను లారీలను ఆపడానికి ప్రయత్నించాడు. లారీల నిండా సరుకు వేసుకొని, కడుపు నిండా సరుకు నింపుకొని, రాత్రిపూట లారీలు నడిపే డ్రైవర్లకి, మనుషులమీదనుంచి పోవడం తప్ప, మనుషుల్ని చూడగానే ఆపుచేసే అలవాటు ఉండదు. చేతులెత్తి విసుగెత్తిపోయాడు పేరిశాస్త్రి. అతగాడి కేంచెయ్యాలో పాలుపోలేదు. నడక తప్ప మరో గత్యంతరం లేదు. అప్పలస్వామి దుకాణం దగ్గరుంటే లారీలు దొరకడం సులువు. కాని పేరిశాస్త్రికి, అప్పలస్వామి కంటబడ్డం ఇష్టంలేదు. 'సరేలే, మరో నాలుగైదు లారీలని ప్రయత్నించి చూద్దాం. లేకపోతే రామచంద్రపురంవరకూ నడక సాగించి, ఉదయమే ఏ మొదటి బస్సో పట్టుకొని రాజమండ్రి పోవచ్చు' అని నిశ్చయించుకొన్న పేరిశాస్త్రికి, దూరంగా పాలెం పుంతలోంచి వస్తున్న కారు లైట్లు, తాటిచెట్ల మధ్యగా కనిపించాయి. 'వీడింత ఆలస్యంగా బయలుదేరా డేమిటి? అయితే ఎలాగో కారు సంపాదించా డన్నమాట. ఘటికుడు!' అనుకొన్నాడు కసిగా.

సుబ్బరాజు, మలుపు దగ్గర కారాపి హారన్ మోగించాడు. ఇద్దరు ముగ్గురు డ్రైవర్లకి టీ నీళ్ళు కలుపుతున్న అప్పలస్వామి బయట కొచ్చాడు. సుబ్బరాజన్నాడు. "ఒరేయ్, దొంగసన్నాసీ: నువ్వు సప్లై చేసిన మందు తాగి, అక్కడ

జనం చావుబ్రతుకుల్లో ఉన్నారు. నీ తమ్ముడు వెంకటరత్నం కూడా స్పృహ లేకుండా పడున్నాడు. నాయుడుదొర నీకు కబురు చెప్పమన్నాడు ఆ లాటులో మందు ఇంకా ఎంతమందికి పోశావో, ఏమిటో ? నేను రామచంద్రపురం ఆస్పత్రికి సహాయంకోసం పోతున్నాను." అప్పలస్వామి ఏదో మాట్లాడ బోయేంతలో, సుబ్బరాజు కారుని కదిలించి, మెయిన్‌రోడ్ ఎక్కి, ఏక్సిలరేటర్ మీద కాలు పూర్తిగా నొక్కేశాడు.

అప్పలస్వామి లబోదిబో మన్నాడు. బయట బెంచీలమీద కూర్చున్న డ్రైవర్లంతా విన్నారు. "ఇవ్వాళ మన అదృష్టం బావుందిరా, వీడి దగ్గర మందు లేకపోవడంమూలాన. పదండిరా పోదాం" అంటూ లేచారు. అప్పలస్వామి, "నన్ను కాస్త కంకిపాడు రోడ్లో దింపి పొండర్రా. నా తమ్ము డక్కడ స్పృహ లేకుండా పడున్నాడు" అన్నాడు వాళ్ళతో దీనంగా.

"ఓర్నాయాల, అదేమైనా దార్లో ఉందనా. నీకోసం దారి మళ్ళించి వెడ్తే, ఆ నాటురోడ్లో మా లారీలు తిరగబడ్తాయి. అంతదాకా ఎందుకు, ఈ పుంత లోనే దిగబడిపోతాయి. ఆస్పత్రినుంచి సహాయం వస్తుందంటున్నాడుగా. ఇక్కడే కాసుకూర్చుని వాళ్లతోబాటు నువ్వూ వెళ్లొచ్చు. ఇదో పోలీసు కేసవక మానదు. అనవసరంగా మేం యిరుక్కుపోతాం !" అప్పలస్వామి అసహాయుడై చూస్తుండగా, వాళ్ళు లారీ లెక్కి కోటిపల్లికేసి పోయారు. అప్పలస్వామి దిగులుగా లోపలికి వెళ్లాడు. టీపొడుంవేసిన నీళ్ళు మరిగి, పొంగి, పొయ్యిలో పడిపోతున్నాయి. ఉన్న ఒక్క పుల్లపెరుగు ముంతనీ సంచిలో పెట్టుకొని, చేల కడ్డంబడి, నాయుడి పొలంకేసి పరుగెత్తసాగాడు అప్పలస్వామి.

మంగ ఉండుండీ మెలికలు తిరిగిపోతోంది. సీతమ్మ ధైర్యాన్ని కూడగట్టుకొని మంగను పట్టుకొని కూర్చుంది. రూపంలేని ఆలోచనల్లోకి జారుకొంటూ, రాయుడు కళ్లుమూసుకొని కూర్చున్నాడు. ఇటు రాయుడి కూతురు పరిస్థితీ, అటు చావు బ్రతుకుల్లో ఉన్న జనం పరిస్థితీ పూర్తిగా అర్థంచేసుకొన్న సుబ్బరాజు, కారుని స్పీడుగా పోనిస్తున్నాడు.

కారులైట్లు కాకినాడవైపు కాకుండా, రాజమండ్రి రోడ్డువైపు మళ్లడం చూసి పేరిశాస్త్రి విస్తుపోయాడు. 'కాకినాడ పోతానన్న వాడిటు రాజమండ్రి దారి పట్టించాడేమిటి వీడు ?! సరేలే, వాడేదో ప్లాన్ మార్చుకొని ఉంటాడు. ఇదీ నా మంచికేనేమో. దారి కడ్డంగా నుంచుని కారాపితే, కనీసం రాజమండ్రిలో వదలకపోడు,' అనుకొన్నాడు పేరిశాస్త్రి.

ఉన్నట్లుండి హెడ్‌లైట్ల వెల్తుర్లోకి అడ్డంగా వచ్చి, చేతులుచాచిన పేరిశాస్త్రిని సుబ్బరాజు చాలా ఆలస్యంగా చూశాడు. బ్రేకులు వెయ్యడానికి సుబ్బరాజు చేసిన ప్రయత్నమూ, చివరి క్షణంలో పక్కకు తప్పుకుందామని పేరిశాస్త్రి చేసిన ప్రయత్నమూ- విఫలమే అయ్యాయి. ఎడమవైపు కారు చక్రాలు పేరిశాస్త్రిమీదనుంచి వెళ్ళిపోయాయి. కారు స్వాధీనం తప్పి, రోడ్డుకి కుడివైపు నున్న చెట్టుకెళ్ళి గుద్దేసింది. కారూ, కారులోని జనమూ తుక్కైపోయారు.

చేలం కడ్డంపడి చీకట్లో పరుగెడ్తున్న అప్పలస్వామి, కాళ్ళలో సత్తువతగ్గి గుండెలు బిగపట్టినట్లయి, ఒక్క క్షణం ఆగాడు. ఆగినవాడు మరి ముందుకు కదలలేకపోయాడు. ఉధృతంగా గుండెనొప్పివచ్చి, కుప్పగా కూలిపోయాడు. సంచిలోని పెరుగుముంత బద్దలయింది.

## 22

బళ్లు నాయుడిపొలం చేరేసరికి, గాస్‌లైట్లు గుడ్డిగా వెలుగుతున్నాయి. బళ్ళ వాళ్ళందరూ కింద కురికారు. వెంకటేశం పరుగున పోయి, రెండు మూడు లైట్లకి గాలి కొట్టాడు. నాయుడు చుట్టూ చూస్తూ అన్నాడు. "అందరూ స్పృహ తప్పి పడున్నారు. కదలికలున్న వాళ్లందర్నీ బళ్ళలో వేసుకొని, వెంట వెంటనే ఆస్పత్రికి వెళ్ళండి. ఆలస్యం జరక్కూడదు."

చాలామంది స్పృహతప్పి పడున్నా, తెలిసీతెలియనట్లు శ్వాస పీలుస్తున్నారు. ట్రాక్టరు డ్రైవరూ, మరో ముగ్గురూ బ్రతకాలని విశ్వప్రయత్నం చేస్తూ, మూలుగుతున్నారు. నర్సిగాడూ, వెంకటరత్నం, మరో యిద్దరూ ఆఖరి శ్వాస నిస్సందేహంగా ఎప్పుడో పీల్చేశారు. ప్రాణాలు పోయిన ఆ నలుగుర్నీ వదిలేసి మిగిలిన వాళ్ళనందర్నీ బళ్లలో పడుకోపెట్టేశారు. అయిదుగురు బళ్లవాళ్ళు ఆ జనాన్ని తీసుకుపోయారు. వెంకటేశు వెనగ్గా ఉండిపోయాడు. నాయుడికేసి చూస్తూ, "వీళ్ళ సంగతేం చేద్దాం దొరా," అన్నాడు. పోలీసులొచ్చేవరకు వాళ్ల నలా ఉంచేయడమే మంచిది. పద " అని నాయుడు బండెక్కి కూర్చున్నాడు. వెంకటేశుకూడా బండెక్కి, గుర్రా న్నదిలించాడు.

ఆస్పత్రి చేరిన తర్వాత, బళ్ళలోంచి జనాన్ని మోసుకొచ్చి, వరండాలో నేలమీద పడుకోబెట్టేశారు. ఆ లోపుగానే బాలయ్య చుట్టుపక్కల వాళ్లని కొంత మందిని లేపి, సహాయంగా తీసుకొచ్చాడు. డాక్టరు ఒక్కొక్కరి నాడీ పరిశీలించి స్పృహలేని మనుషుల కేవో యింజక్షన్లు ఇచ్చింది. కొంతమందికి గొంతుకలో ఏవో మందులు పోసి బలవంతంగా అతి ప్రయత్నంమీద, మింగించగలిగింది.




నాయుడు వాళ్ళకేసి చూస్తూ నిల్చుండిపోయాడు. కూటికి కరువులేని ట్రాక్టరు డ్రైవరు, మరో యిద్దరి ముగ్గురికీ తప్ప, మిగిలిన వాళ్లందరికీ డొక్కలు లోతుగాపోయి-వెన్నెముక ల్నంటుతున్నాయి. డాక్టరు నాయుడి పక్కగా వచ్చి అంది. "ఈ పాటికి రామచంద్రపురంనుంచి సహాయం వచ్చి ఉండాలే! ఎందుకింత ఆలస్యమవుతోందో అర్థం కావట్లేదు. నిజానికి మీరిక్కడికి తిరిగివచ్చే లోపుగానే, వాళ్ళిక్కడికి వచ్చి ఉండవలసింది. వెంటనే సహాయం అందితే, వీళ్ళలో చాలామందికి బ్రతికే అవకాశం ఉంది. నాకు చేతనైంది నేను చేశాను. మీరు పోస్టుమాస్టర్ని లేపి, ఫోన్లో మాట్లాడే ప్రయత్నం చేస్తే మంచిది. ఒకవేళ అక్కణ్ణించి అంబులెన్సులు కాని రాకపోతే, వీళ్లని బళ్లమీదే రామచంద్రపురం పంపే ప్రయత్నాలు చెయ్యాలి."

నాయుడక్కడున్న వాళ్లలో ఒకర్ని చూసి, "చంద్రం, నీవు పోస్టుమాస్టర్ని లేపి, వివరాలు చెప్పి రామచంద్రపురం ఆస్పత్రితో మాట్లాడమను ట్రంక్ కాల్ కాబట్టి కొద్దిగా ఆలస్యం కావొచ్చు. నువ్వక్కడే ఉండి ఏ సంగతీ తెలుసుకొని మరీ రా. పన్లోపని, రామచంద్రపురం పోలీసు స్టేషను కూడా కబురందచెయ్యమని చెప్పు," అన్నాడు

డాక్టరు నాయుడి గుండె నిబ్బరానికి కొంచెం ఆశ్చర్యపడింది. డాక్టరు మరోసారి అందర్నీ పరీక్షించి నాయుడితో అంది- "ఈ ఆస్పత్రికి ఫోనుకూడా

లేకపోవడం, ఖర్మ ! మందులకోసం డిమాండు పెట్టి నాలుగు నెల్లయింది. ఈ రోజువరకూ వాటి విషయం ఏమైందో తెలియదు. సీరియస్ కేసుల్ని పై ఊళ్లకు పంపిద్దామంటే అంబులెన్సు కూడా లేదు ! ఇలాంటి అవాంతరా లొచ్చినప్పుడు వీటి ఉపయోగం ఎంతైన ఉంది." ఆమె మాటల్లోని బాధ, నాయుడికి కొట్టొచ్చి నట్లు తెలిసింది. మౌనంగా ఉండడం తప్ప, మరేమీ చెయ్యలేపోయాడు.

స్పృహ పప్పిపడిన వాళ్లలో ఒకడికి మెలకువ వచ్చి డోకేశాడు. డాక్టరు సంతృప్తిగా వాణ్ణి పక్కకు లాగి, ఓ డోసు మందు మింగించింది

పది నిముషాల్లో చంద్రం పరుగెత్తుకొంటూ వచ్చాడు. "అదృష్టం బావుండి వెంటనే కనెక్షన్ దొరికింది. రాయుడుగా రక్కడకు చేరనేలేదట. వాళ్ళు మూడు అంబులెన్సుల్నీ ఒక డాక్టర్నీ, ఇద్దరు కాంపౌండర్లనీ వెంటనే పంపిస్తున్నారు. ఓ గంట లోగా రావచ్చును." జరిగింది డాక్టరుకీ, నాయుడికీ చెప్పాడు.

"ఏమిటీ, రాయు డక్కడకు చేరనేలేదా ? ! దార్లో కారు పాడైపోవడమో జరిగిఉంటుంది. అక్కణ్ణించి సహాయం వస్తోంది కాబట్టి మీరు వీళ్ల సంగతి చూస్తూ ఉండండి. ఈ లోపుగా ఇక్కడ వీళ్లందరూ సహాయంగా ఉంటారు. నేను వెళ్ళి రాయుడికూతు ర్నెలాఅయినా రామచంద్రపురం పంపే ఏర్పాట్లు చేస్తాను. ఒరేయ్ వెంకటేశూ, పద. ఇంకో బండికూడా ఎవరైనా తీసుకురండి." అంటూ, నాయుడు వెంకటేశు బండిలో కూర్చున్నాడు. మరొకడు కూడా తన బండిలో కూర్చుని,గుర్రాన్నదిలించాడు. రెండుబళ్ళూ పుంతదారినిపట్టి, మెయిన్ రోడ్డెక్కాయి. నాయుడు కంగారుపెట్టడంతో, వెంకటేశు గుర్రాన్ని మాటి మాటికీ అదిలిస్తున్నాడు. అతగాడు గుర్రాన్ని అట్టే పరుగెత్తించ నవసరం లేకపోయింది. ఓ అరడజను లారీలు రోడ్డుకి రెండు వైపులా ఆగి ఉన్నాయి. హెడ్ లైట్ల వెల్తుర్లో, లారీలనుంచి కిందకు దిగిన జనం, చెట్టును గుద్దేసిన కారు చుట్టూ మూగిఉన్నారు. వెంకటేశు బండి ఆపాడు. నాయుడు బండిలోంచి దిగి, ఎదురుగా ఉన్న దృశ్యాన్ని చూసి, ఆ రాత్రి మరోసారి స్థాణువులా నిలబడి పోయాడు.

'సర్వనాశన మైపోయింది' నాయుడిలో అణువణువూ కోటి గొంతుకలతో అరిచింది.

"వీడెవడో దారి కడ్డంవచ్చి ఉంటాడు. వాణ్ణి రక్షించడం కోసం జరిగిన ప్రయత్నంలో వాడూ చచ్చాడు, కార్లో ఉన్న వాళ్ళూ చచ్చారు. లంజకొడుకులు తాగి రోడ్డు కడ్డంపడి, వాళ్ళ ప్రాణాలు పోగొట్టుకోడమే కాకుండా, కార్లవాళ్ల

ప్రాణాలుకూడా తీస్తారు. ఈ పోలీసునాయాళ్ళకూడా కార్లవాళ్లదే తప్పంటారు!" అంటున్నాడో లారీడ్రైవరు. నాయుడు రోడ్డుకి ఎడంపక్కగా పడున్న శవం కేసి చూశాడు. నోట్లోంచి రక్తం కక్కుకొని, పేగులు బయటకొచ్చి భయంకరంగా ఉన్న, పేరిశాస్త్రి కట్టెని గుర్తుపట్టాడు.

నాయుడి హృదయం బండబారిపోయింది. తనకూడా వచ్చిన రెండో బండివాణ్ణి ఉద్దేశించి అన్నాడు. "ఒరేయ్, నువ్విక్కడే ఉండు. అటునుంచి వస్తున్న అంబులెన్సుల్ని దగ్గరుండి మన ఊళ్ళోకి తీసుకురా." వాడు సరే నన్నాడు. నాయుడు పోయి వెంకటేశు బండిలో కూర్చున్నాడు. వెంకటేశు బండి వెనక్కు తిప్పి, పొలంకేసి బండి తోలాడు పుంతదగ్గర మలుపు తిరిగి ఊరుదారి పట్టాడు. ఊరు చేరుతూండగా, వెనుకనుంచి లైట్లు కనబడ్డాయి. "ఒరేయ్ వెంకటేశూ, అంబులెన్సులు వస్తున్నట్లున్నాయి. నన్నింటిదగ్గర దింపి నువ్వాసుపత్రికి పోయి ఉండు. నేను మీకందరికీ డబ్బూ అదీ పట్టుకొని ఓ పావు గంటలో వస్తాను," అన్నాడు. వెంకటేశు బండిని నాయుడింటిదగ్గ రాపాడు. నాయుడు బండి దిగాడు. వెంకటేశు బండి తోలుకొంటూ పోయాడు.

నాయు డింట్లో అడుగుపెట్టిన తర్వాత, వర్ధనాన్ని తను గదిలో పెట్టి గొళ్లెం వేసిన సంగతి గుర్తుకొచ్చింది. వెళ్ళి గది తలుపు తీశాడు. దూలంనుంచి వేలాడుతోంది వర్ధనం బండబారిన నాయుడి హృదయం ఆ దృశ్యాన్ని చూసి మరి చలించలేదు. నిర్లిప్తంగా డ్రాయరు సొరుగు తీసి తెల్లకాయితం తీశాడు.

"ఇది, నా స్వదస్తూరితో రాస్తున్న చివరి రాత. ఇది నా చివరి కోరిక. నాకున్న యావదాస్తినీ వెచ్చించి, ఈ ఊరికో పెద్ద ఆస్పత్రిని కట్టించండి. మాలవాడ దగ్గర చెరువు తవ్వించండి. ఈ రెండింటికీ నాయుడిపే రుండాలి." అని రాసి, సంతకంచేసి మడిచి జేబులో పెట్టుకున్నాడు.

ఇంటి బయటకు వచ్చి, వెంకటరత్నం సైకిలు తీసుకొని, నాయుడు పొలం చేరాడు. పడక్కుర్చీలో కూర్చుని, కర్రతొట్టిలో మిగిలి ఉన్న సారాయిబుడ్లని ఒకదాని తర్వాత మరోదాన్ని తాగి, ఖాళీ చేసేశాడు.

## 23

ఏళ్ల తరబడీ ఎదుగూ బొదుగూ లేని ఊరు— ఉడుకు మొత్తనం వచ్చి, రాత్రి తెల్లవార్లూ మేలుకొని, కాలసర్పంలా కాటేసి, పాపం చేసిన వాళ్ళకి శిక్షగా, కష్టాల్లో ఉన్న వాళ్లకి ముక్తిగా, మృత్యువుని ప్రసాదించి, తూర్పు తెలతెలవారుతూండగా నిద్రలోకి జారుకుంది.

---




"అయితే అందరూ ఒప్పుకున్నట్లేనా?"

రాజారావు గొంతు ఖంగుమంది- అతని కళ్ళలో ఎర్రజీరలు వుత్సాహంగా నాట్యమాడుతున్నాయి. సీసాలోని స్కాచ్‌ని గాబ్లెట్‌లోకి వంపుకుని సిప్‌చేసి, లేచి కిటికీదగ్గరకు వెళ్ళాడు. గాజు తలుపులు రెండూ తెరిచి చూస్తే బయట వర్షం కురుస్తూంది. చిక్కటి చీకటి యీదురు గాలికి తలలూంచే మామిడిచెట్లు జుట్టు విరబోసుకున్న దెయ్యాల్లా వున్నాయి.

చలిగాలితోపాటు తుంపర కూడ

రాజారావును తోసుకుని లోనికొచ్చింది. రాజరావు తలుపులు మూసేశాడు. ఇప్పుడు రాజారావుకి స్వర్గంలో వున్నట్లుంది.

"యేం మాట్లాడరేం- అయితే మీలో ఎవరికీ నమ్మకాల్లేవన్న మాట," అన్నాడు.

చిప్స్ తింటున్న క్రిష్ణమూర్తి, చికెన్ తింటూ లండన్ డ్రై జిన్ బాటిల్ ఖాళీ చేస్తున్న విశ్వం రాజారావు వంక చూశారు. చూసి ఒకర్నొకరు చూసుకున్నారు.

"నాకేం అటువంటి భయం లేదు. నేను రెడీ " అన్నాడు కృష్ణమూర్తి. కొత్త హేవర్డ్స్‌ను చేతిలోకి తీసుకుంటూ.

"వెరీ నైస్" అంటూ రికార్డ్ ప్లేయర్ ఆన్‌చేశాడు రాజారావు. పాశ్చాత్య సంగీతం ఆ గదినంతటినీ ఆవరించింది.

"మరి నీ సంగతేమిటి" అన్నట్లు చూశాడు రాజారావు విశ్వంవైపు.

"మా ఆవిడేం అంత సంస్కార హీనురాలు కాదు. నే నా విషయం నిరూపించగలను కానీ ఒక్కసంగతి..." అంటూ ఆగిపోయి అందరివంకా ఒక్కసారి చూసి రాజారావుపైన దృష్టిని నిలిపాడు.

రాజారావు మరో పెగ్గు పూర్తిచేసి, గొంతు సవరించుకుని, "యేవిటో చెప్పు- మీ ఎవ్వరికీ ఎటువంటి అనుమానమూ, అన్యాయమూ జరగకుండా ఈ గేమ్ పూర్తిచేసే భారం నాది," అన్నాడు నిర్భయంగా.

"అదే నేనంటున్నది- డబ్బున్న వాడివీ, బ్రహ్మచారిముండాకొడుకువీ కాబట్టి నువ్విలాంటి పందేలేస్తున్నావు అయినా ఒప్పుకుంటున్నాం- గెలిచిన వాళ్ళకి అయిదొందల చొప్పున యిస్తానన్నావ్. అదీ బాగుంది- కానీ యీ పోటీలో మేమే నెగ్గి నువ్వే ఓడిపోతేనో..."

విశ్వం మాటలకు నవ్వి, "జీవితాంతం బ్రహ్మచారిగానే వుండిపోతాను. సరా!" అన్నాడు రాజారావు.

"వుండిపోతావ్. నువ్వెందుకుండవ్. నీలాంటి వాడికి పెళ్ళి కావాలా యేమిటి కోరికలు తీరేందుకు," అన్నాడు అంతవరకూ వారి మధ్యకేరాని ఆనందరావు.

"అది సర్లే- మీలో ఎంతమంది పెళ్ళికి బ్రహ్మచార్లో నాకు తెల్సు గాని నీ సంగజ్జెప్పు," అన్నాడు రాజారావు ట్రిబుల్ ఫైవ్ నోట్లో నుంచుకు పొగ వదుల్తూ.

"ఐయామాల్‌సో రెడీ- మా ఆవిడేం అంత అనాగరికురాలేం కాదు- చదువుకున్నదీ, పైగావుద్యోగంచేస్తూ సొసైటీలో తిరుగుతున్నదీను- మా మధ్య రహస్యాలకు తావే వుండదు."

"ఓకే— మీరందరూ యిందుకు ఒప్పుకున్నారు కాబట్టి యిప్పుడు నేను చెప్పినట్లు మీరంతా ఉత్తరాలు మీ మీ

భార్యలకు రాయాలి. నేను చెప్పడ మెందుకో తెల్సా? భాషలోగాని, భావంలోగాని మీ ముగ్గురూ వ్రాసే ఉత్తరాల్లోనూ తేడా వుండకూడదు," అంటూ లెటర్ పేడ్ తీసి వాళ్ళ ముందుం చాడు రాజారావ్.

"బతికించావ్- నాకుత్తరాలు రాయ డమే రాదు" అన్నాడు క్రిష్ణమూర్తి.

"రచయితవి కాబట్టి ఒప్పుకుంటు న్నాను-ఆ యేడుపేదో తొరగా కానీ" విసుక్కున్నాడు విశ్వం. ఆనందరావు మౌనంగానే యేకీభవించాడు.

## 2

ఐదు నిముషాల్లో ఉత్తరం డిక్టేట్ చేసి మరో సిగరెట్ వెలిగించాడు రాజారావ్. అతడి కళ్ళు యిప్పుడు సంతృప్తిగా మెరుస్తున్నాయి-

ఎంత జీవిత భాగస్వామి అయినా భార్యదగ్గర కొన్ని కొన్ని రహస్యాలు దాచక తప్పదు. ముఖ్యంగా స్త్రీల విషయాలు- అలా దాచకుండా వున్నది వున్నట్లు చెబితే ఎప్పటికైనా భర్త అన్నవాడు యిబ్బందుల్లో పడకమానడు అంటాడు రాజారావు.

విశ్వం అందుకు ఒప్పుకోలేదు. మనసులో వున్నది మంచో చెడో ఆమెకు చెబితేనే యే అనర్థం వుండదు. లేదా ఆ నిజాలెప్పుడెప్పుడో బయిటపడి ప్రళయం ముంచుకురాక మానదు, అంటాడు—పెళ్ళయినవాళ్ళు కాబట్టి కృష్ణమూర్తి, ఆనందరావుకూడ విశ్వానికే సపోర్ట్ యిచ్చారు- వారిలో పెళ్ళికానివాడు రాజారావే చివరికి పందాలవరకూ వచ్చింది - ఓ కట్టుకథతో పరీక్ష మొద లయ్యింది- మూడు ఉత్తరాలూ పోస్ట్‌చేసి జవాబులకోసం నిరీక్షణ ప్రారంభించారు స్నేహితులు, నలుగురూ.

* * *

జీవితానికి థ్రిల్ కావాలి అనుకునే వ్యక్తి రాజారావు. అందుకే వింటర్‌లో, అదీ చలి ఎక్కువగా వున్న రోజుల్లో తాతగారు మిగిల్చిపోయిన లంకంత బంగళాలో తన స్నేహితులతో ఖుషీగా ఓ రెండు రోజులన్నా బాహ్యప్రపంచాన్ని మరచి గడిపితేగాని అతని మనసు వూరట చెందదు- రాజారావు తలపెట్టిన యీ యజ్ఞం ప్రతియేడూ అతని స్వంత ఖర్చులతో మొదలయి ముగుస్తుంది. ఎక్కడ యే పరిస్థితులలో వున్నా అతని స్నేహితులు రెక్కలు కట్టుకు వాల్తారు.

## 3

మూడోనాడు ముగ్గురికీ వుత్తరాలు వచ్చాయి- మొదట విశ్వం కవరు విప్పాడు.

"ఎవరో వన్నెలాడి తన పేరూ, వూరూ కూడ అడగొద్దని, ఓ వారం రోజులు తలదాచుకోనిమ్మని అడిగితే ఒప్పేసుకోడమేనా? యేళ్లొచ్చినా బుద్ధి పెరగలేదు మీకు - ఇంట్లో పెళ్ళాం,

పిల్లలూ వున్నారన్న సంగతి కూడ మరిచిపోయి దాని వలలో పడ్డారంటే ఎవరన్నా నవ్విపోతారు— వెంటనే వస్తారో- పోలీసు రిపోర్టిమ్మంటారో తేల్చుకోండి."

ఇదీ ఆ ఉత్తరం యొక్క సారాంశం. విశ్వం ముఖం నల్లబడిపోయింది.

"నే చెప్పలేదూ ? అసూయ, అనుమానం ముందు పుట్టి యీ ఆడవాళ్ళు తర్వాత పుట్టారట— అనవసరంగా పందెం కట్టావు." రాజారావు హీహోగా నవ్వేడు

విశ్వం పరిస్థితి చూశాక కృష్ణమూర్తికి కూడ జంకు పుట్టింది— అయినా చేసేదేం లేదు- ఇది మానసిక బలహీనతలకీ మనుషుల మీదుండే నమ్మకాలకీ పరీక్ష. కృష్ణమూర్తి కవరు చించి రాజారావునే చదవమని అందించాడు. దాని సారాంశమిది——

"మొదట్నుంచీ అనుమానంగానే వుంది మీ వరస— చదువుకోనిదాన్ననీ, అందమైనదాన్ని కాదనేగా మీ అలుసు ? చదువులేకపోయినా సంస్కారముంది నాకు. అందం లేకపోయినా మంచి నడవడిక వుంది. ఒకగంట పరిచయంతో ఎవరో రోడ్డున పోయేది వారంరోజులు వుంచుకోమంటే వుద్దేశం మీకు, నాకు ఎలా అన్పించినా లోకులేమనుకుంటారు? అందరి దృష్టిలోనూ లోకువయ్యాక నా బ్రతుకెందుకు ? నా మాటమీద గురి వుంచి వుత్తరం అందినవెంటనే వచారా సరేసరి— లేకుంటే పుట్టింటికి కాదు పైలోకానికే పోతాను."

ఈ మాటు రాజారావు కాలరు పైకెత్తి మీసం మెలేశాడు.

"నాకు సెంట్ పర్సంట్ సక్సెస్— మిగిలిన ఆ మూడో ఉత్తరం చదవనే అక్కరలేదు," అంటూ జిన్‌బాటిల్ సీల్ వూడదీశాడు.

"నో నో- ఈ ఉత్తరం కూడా చూడాల్సిందే" అన్నాడు ఆనందరావు. మొదట్లో అతడూ నిరుత్సాహపడ్డాడు. కానీ తన భార్య వాళ్ళలా వంటింటి కుందేలు కాదు. ఉద్యోగంచేస్తూ నాలుగు రాళ్ళు తెచ్చి భర్తకు సాయపడుతున్న ఆధునిక స్త్రీ. సమాజాన్నీ, అందులోని లోతుపాతుల్నీ అర్థంచేసుకుని వీలైతే సమాన హక్కులకోసం పోరాడగలిగే ప్రతిభావంతురాలు.

అందుకే ధైర్యంగా కవరు విప్పేడు. అతని కళ్లు ఆనందంతో మెరిసిపోయాయి.

"సమాజం వెంటాడి తరిమికొడితే అలసిపోయిన అభాగినులెందరో వున్నారు మన దేశంలో. అటువంటి స్త్రీ ఎదుట పడి నీడకోసం అర్థించినపుడు ఆదుకోవలసిన బాధ్యత మనకుంది. ఎవరేమనుకున్నా మీరు చేసింది మంచి పనే. నిజంగా మీవంటి సంస్కార హృదయమున్న భర్త దొరికినందుకు నేను గర్వి

స్తున్నాను. వారం రోజులు ఎంతలో గడిచిపోవాలి- అవసరమైతే వ్రాయండి. డబ్బు పంపుతా."

ఈసారి ఆశ్చర్యపోవడం రాజారావు వంతు అయింది.

"ఇప్పుడేమంటావ్ రాజారావ్- లోకంలో స్త్రీజాతినంతా ఒకే త్రాసులో తూచాలనుకున్నావ్- నువ్వనుకునే రకం స్త్రీలలోనూ వుండొచ్చు- సంస్కార మన్నది పుట్టుకతో వచ్చి అనుభవాలతో పెరుగుతుంది. అయినా పెళ్ళికాని బ్రహ్మచారివి స్త్రీ గురించి నీకేం తెల్సు. నీ దృష్టిలో ఆడది అయిదు నిముషాలు ఆడుకునే ఆటబొమ్మ. అంతే తెల్సు నీకు."ఆనందరావు ఈమాటలంటూవుండే రాజారావు ముఖం వాడిపోయింది. అను కున్నట్లుగానే అయిదు వందలూ ఆనంద రావు చేతికిచ్చాడు రాజారావు.

## 4

రాత్రి పదకొండయింది. చినుకులు చిన్నగా రాల్తున్నాయి. వీధి దీపాలు మసగమసగ్గా ఎప్పుడారిపోదామా అన్న ట్లున్నాయి. ఈదురుగాలి రివ్వుని వీస్తోంది.

రిక్షా దిగి గుమ్మంలో అడుగు పెట్టాడు ఆనందరావు.

గదిలోనుండి బెడ్‌రూంలైట్ యొక్క లేత నీలంకాంతి కిటికీలోంచి క్రోటన్ మొక్కమీద పడుతోంది. తలుపు తట్టి భార్యను పిలవాలనుకున్నవాడల్లా టక్కున ఆగిపోయాడు. లోపలినుండి మాటలు నెమ్మదిగా విన్పిస్తున్నాయి. మగగొంతు చాల అస్పష్టంగావుంది. "నో డియర్- ఆయ నిప్పుడే రారు. ఎవతో నాలుగు రోజులు తలవాచుకోనిమ్మందిట. ఆ సంగతి నాకు రాశాడు. మగాడు!"— నవ్వింది.

నవ్వుతున్నది తన భార్యే అని గుర్తించడానికి ఆనందరావు కాస్సేపు పట్టలేదు. అతని మనసు కుతకుతలాడి పోయింది. పిడికిళ్ళు బిగుసుకున్నాయి. వద్దనుకుంటూనే సన్‌షేడ్ నాధారం చేసుకుని చూశాడు కిటికీలోంచి. లోపలి నుండి మత్తయిన సువాసన- ఆ నీలి వెలుగులో పాలమీగడలాంటి డబుల్‌కాట్ పైన తన భార్య కౌగిట్లో...ఎవరో?

ఆనందరావు మనసులో పిడుగులు పడ్డాయి.

జేబులో పందెంతాలూకు డబ్బు బరువుగా అన్పించి దతనికి.

ప్రక్క వీధిలో ఎక్కడో కుక్క అరుపు కర్కశంగా వినిపించింది.

బయట వర్షం హెచ్చింది.





# ఖులాసా పురుషుడు

బెహరా వెంకట సుబ్బారావు

ఆఫీస్‌నుంచి యింటికి వస్తూంటే సిద్ధంగా ఉన్నారు రఘురాంగారు. స్టార్ట్ స్కూటరు ఎక్కి బయలుదేరడానికి చేయలేదు. ఇంట్లోకి చూస్తున్నారు.

భార్యామణి రమణికోసం. కొత్త సినిమా రిలీజ్ అయింది కాబట్టి సినిమా ప్రోగ్రాం కాబోలు అనుకొన్నా. నా అర్ధాంగి అనూరాధ మా వాటా గుమ్మంలో నిలబడి అతడ్నీ, అతని స్కూటర్నీ చూస్తోంది. నన్ను గమనించినా మాట్లాడే పరిస్థితిలో లేదు. పక్కకు జరిగింది, నేను లోపలికి పోడానికి వీలుగా. ఆఫీసునుంచి రాగానే నాకు కాఫీ తాగడం అలవాటు. బట్టలు మార్చుకొని ఓసారి వీధిగుమ్మంలోకి చూసా. అనూరాధ అలాగే నిలబడి చూస్తోంది. ఫ్లాస్కులోని కాఫీ గ్లాసులో పోసుకొని పెరటి గుమ్మంలో నిలబడి అరటి మొక్కలవైపు చూస్తూ తాగడం మొదలుపెట్టా. రెండురోజులక్రితం వేసిన గాలికి ఏపుగా వేసిన గెలతో పెద్ద అరటిచెట్టు పడిపోయింది గెల కొట్టేసి యింట్లో పెట్టింది అనూరాధ. చెట్టు కొట్టి అవతల పారేయడం నా వంతు. రేపు ఉదయం తప్పకుండా కొట్టిపారేయాలి అనుకొన్నా ! రఘురాంగారు తిరిగి యింట్లోకి వచ్చారు కాబోలు ! ఆ దంపతుల మాటలు పక్కగదిలోంచి స్పష్టంగా వినబడుతున్నాయ్.

"ముష్టి యాభై రూపాయిలకోసం మొహం చూసుకొన్నారు ! ఈ చీర నా కేమీ నచ్చలేదు ! మీ యింజనీర్ భార్య లలిత చూడండి ! రెండువందల యాభై పెట్టి కొనుక్కుంది ! ఎంత బాగుందని!" విసుక్కొంటోంది రమణి.

"ఇదిమాత్రం తక్కువా ? రెండు వందలు తగలేసావ్ !"

"మా గొప్ప ఖరీదుపెట్టి కొన్నారు ! మరో యాభై పారేస్తే లలితలాంటి చీర వచ్చి ఉండేది ! మీ కక్కుర్తి పోనిచ్చుకున్నారుకాదు !" సణుగుతోంది

"సినిమా టైమ్ అయిపోతోంది ! తొందరగా తెములు !"

"నాకూ అలాంటి చీర కొంటా నంటేనే వస్తా." మారాము చేస్తోంది.

"సరే ! వచ్చే నెల్లో కొంటా ! క్విక్ !"

తొందరచేస్తూ ప్రామిస్ పారేసా డా కులాసాపురుషుడు.

"అంత తొందరెందుకండీ ? మూడు రోజులు ముందుగానే కొనేసారుగదా టిక్కెట్టు !"

"టికెట్టు మనదగ్గరుంటే సీట్లు రిజర్వుఅయి ఉంటాయి గానీ సినిమా బిగిన్ చెయ్యడం మాత్రం మానడు ! ఇంటర్వెల్ దగ్గరనుంచే చూడాల్సి వస్తుందేమో !" విసుక్కొంటున్నారు రఘురాంగారు.

"వచ్చేస్తాగానీ ముందు మీ రవతలికి పదండి !"

ఆజ్ఞాపించింది రమణి. చీర కట్టుకొంటోంది కాబోలు !

వాళ్ళు బయలుదేరడానికి యింకా టయిము పడుతుంది. ఆ విషయం అనూరాధకి తెలీక యింకా గుమ్మంలోనే

నిలుచుంది, ఆ ముచ్చటయిన నవయువ జంటను చూడ్డానికి. కాఫీ గ్లాసు కింద పెడుతూ కేకేసాను. ఆమెకు వినబడి నట్లు లేదు. పార్కునించి పిల్లలు కూడా వచ్చేసారు—బాగా పొద్దుబోయింది.

"అమ్మను పిలూ బాబూ !" అన్నా గట్టిగా.

వాడు పోయి అనూరాధని చేయి పట్టుకొని లాక్కొచ్చాడు.

"ఎందుకూ ? కాఫీ తాగేసారు గదా !"దూకుడుగా వస్తూ కస్సుమంది. నేనేదో అనబోయేలోగా ఆవే అందు కొంది.

"ఓ ముద్దా, ముచ్చటా ? పెళ్ళయి ఆరేళ్ళయినా అనుభవించింది ఒక్కటీ లేదు ! పిల్లలుమాత్రం పుట్టారు నలుగురు !"

విసుక్కొంది గట్టిగానే. నే నేమీ మాటాడలేదు. ఏమయినా అంటే ఆమెకి మరీ ఫోర్సు ఎక్కుతుంది. అయినా ఆమె ఊరుకోలేదు. "నాలుగు చీరలూ, నాలుగు నగలూ ఉంటే సరా ? ఓ గాస్ స్టవ్వయినా తెచ్చి మొహాన పడేయ మన్నా ! డబ్బున్నా అనుభవించే అదృష్టం ఉండాలి ! నాన్నగారూ, పెద్దన్నయ్యా నా పెళ్ళయేవరకూ నిద్ర పోలేదు ! పది హేనువేలు తగలేసి సంబంధం చేసారు ! ఏదో అందలం ఎక్కి సుఖపడిపోతానని..."

ఇంకా ఏవేవో ఏకరువుపెట్టి తననీ, తనను కన్నవాళ్ళనీ, నన్నూ తిట్టి పోసింది. ఆమె శృతిమించినందుకు నాకు కోపం వచ్చింది అప్పుడే కాదు అప్పు డప్పుడు వస్తూ ఉంటుంది ఆమె మాటలకి. ఈ మధ్య అంటే మా యింట్లో ఆ దంపతులు అద్దెకి దిగినప్పటినుంచీ ఆమె సాధింపులూ, చీత్కారాలూ మరీ ఎక్కువయ్యాయ్.

మా యింట్లో అద్దెకు దిగిన రఘురాం గారికిగానీ, వారి అత్తవారికిగానీ ఏపాటి ఆస్తిపాస్తు లున్నాయో తెలీదు ! నే నెప్పుడూ అడగనూలేదు కూడా. వారు యిదివరలో సీతమ్మధారలో ఉండేవారు. టౌనుకి దూరం అని ఊళ్ళోకి మారారు. అతనికి కాల్టెక్స్‌లో ఉద్యోగం. జీతం వెయ్యిరూపాయ లుంటుందని వినికిడి. అద్దె నూటముప్ఫయి ముట్టజెబుతున్నారు ... చాలా ఖరీదైన బట్టలే కడు తూంటారు. వాళ్ళింట్లో ఆపిలూ్సా, బత్తా యిలూ, ద్రాక్షపండ్లూ ఎప్పుడూ స్టాకుం టాయ్ ! ఏ బాదరబందీ లేదు. అత్యా ధునిక విలాసజీవితం అనుభవిస్తున్నారు. వారు సమస్త సౌకర్యాలూ సమకూర్చు కొని అనుభవిస్తున్నారనీ, నేను వట్టి పిసినారివాడిననీ, డబ్బును దాచడమే గానీ అనుభవించననీ, తక్కినవారిని అనుభవించనీయననీ మా ఆవిడ భావన. ఆ భావంతోనే నన్ను ఈసడించు కొంటుంది. దానికి తోడు ఈ మధ్య రఘురాంగారు స్కూటరు కొన్నారు...

ఆ స్కూటర్ను చూసినప్పుడల్లా అనూరాధ నన్ను తిట్టుకొంటుందని నా అనుమానం. ఎందుచేతనంటే నన్నూ ఓ స్కూటరు కొనమని అడిగింది, అర్థించింది. ఆఖరికి ఓనాడు సత్యాగ్రహం చేసింది కూడా. ఎంతకూ లొంగకపోవడంతో సహాయ నిరాకరణోద్యమం నడిపింది కొన్నాళ్ళు.

మనకు పిల్లలున్నారనీ, వాళ్ళలా డబ్బుని మంచినీళ్ళప్రాయంగా ఖర్చు చేస్తే ఆఖరిదశలో అగచాట్లు పడాల్సి వస్తుందనీ, అలాగని కనీసావసరాలు, సౌకర్యాలూ మానుకోనవసరంలేదనీ, అదనీ, యిదనీ ఏవేవో చెప్పి కొన్నాళ్లకి ఆమెను ఒప్పించా. రఘురాంగారు దిగిన కొంతకాలంవరకూ సుమారు ఆరు నెల్లవరకూ మా రెండు కుటుంబాలూ ఒక్కటిగానే నడిచాయ్. మా పిల్లలు ఎప్పుడూ వాళ్ళింట్లోనే ఉండేవారు. తినడానికి అవీ యివీ యిచ్చేవారేమో వాళ్ళని వదిలేవారు కాదు. వాళ్ళని చదివించి ఆడించేది రమణి— మా ఆఖరి అబ్బాయికి ఏడాది వెళ్ళింది. వాడంటే ఎంతో ముద్దు రమణికి. వాళ్లకి పిల్లలు లేకపోవడం కారణం అయి ఉండొచ్చు !

అనూరాధా—రమణీ వాళ్ళిద్దరి మధ్యా ఏ మొచ్చిందో మరి! ఓ సుముహూర్తాన ఉదయం భోజనం వడ్డిస్తూ అంది అనూరాధ.

"చూసారా? దాని కెంత పొగరో !" అని

"ఎవరూ ?" అన్నట్లు తలెత్తి చూసా ఆమెవైపు.

"ఎంత డబ్బుంటేమాత్రం అంత పొగరు కూడదు ! డబ్బుని చూసి వాణ్ణి ప్రేమించింది. దాని వగలూ, వయ్యారం చూసి దాని వల్లోపడ్డాడు ! దానికేముంది దిబ్బ !"

నా కేమీ అర్థంకాలేదు.

"ఎవర్ని గురించి మాట్లాడుతున్నావ్ ?" అడిగా.

అనూరాధ ఆగ్రహానికి గురయిన అబల ఎవరో తెలీక తికమక పడ్డా. ఊహించుకోలేకపోయా.

"ఈవేళ ఉదయం మన రెండోవాడు పాపం సరదాపడి స్కూటరుమీద కూర్చుంటే రెక్కపట్టుకొని కిందకి లాగేసింది చూసారా దాని కెంత పొగరో !"

అప్పుడు అర్థమయింది - అంత ప్రాణస్నేహితురాలు అంత ఆగ్రహానికి ఎందుకు గురయిందో ! అనూరాధ చెప్పింది సరైన కారణంగా తోచలేదు. మరొకటి ఏదైనా ఉండి ఉండాలి.

"అసలు ఏమయింది ?" పక్కగదిలో ఉన్న రమణి వింటుందేమోనని మెల్లిగా అడిగా.

"ఆ రంకులాడి యింట్లో యింకా ఎందుకుంటుంది ! మొగుడు అలా

ఆఫీసుకు పోగానే యిలా వుడా యిస్తుంది. క్లబ్‌లో ఏదో మీటింగుందిట! పోయింది !"

అంది గట్టిగా, నిర్భయంగా, నా అనుమానాన్ని నివృత్తి చేస్తూ.

"అసలేం జరిగింది ?" మరలా అడిగాను, వివరంగా చెబుతుందని.

"ఆ రఘురాం స్కూటర్ని తుడుచు కొంటున్నాడు ! (ఏకవచన ప్రయోగం చేసింది మొట్టమొదటిసారిగా. కోపంలో అయితే అవ్వచ్చు !) మనవాడేమో సీటుమీదకి ఎక్కబోయాడు ! ..."

సగంలోనే అందుకొన్నా.

"అవును మరి ! తుడుస్తూంటే అడ్డుగా ఉన్నాడని దింపింది కాబోలు!" అని అన్నానో లేదో చ(క్రమని అందుకొంది.

"మీరు చూసినట్టు చెప్పకండి! నాకు వళ్ళుమంట ! అడ్డు లెమ్మంటే లేవడూ! రెక్కపట్టుకొని లాగాలా ?" అంది కోపం ఎక్కువ చేసుకొంటూ.

ఆ విషయం అప్పటితో ఆపుచేస్తే మంచిదనిపించింది. అందుకే నేనేమీ మాట్లాడలేదు. చెప్పి, చెప్పి ఆమే ఊరు కొంటుంది అనుకొన్నా. ఆమె రమణి గురించి చాలా విషయాలు ఏకరవు పెట్టింది. ఎప్పుడు సేకరించిందో లేక ఊహించిందో మరి !

వాళ్ళది (పేమ వివాహంట ! పైగా కులాంతర వివాహంట ! (?) కాలేజీలో యిద్దరూ (పేమించుకొన్నార్ట ! రమణి పుట్టింటివారు చాలా బీదవారుట! రమణి క్యారక్టరు కూడా మంచిదికాదుట పూర్వం. బంగారంలాంటి కుర్రాడు దాని వల్లో పడిపోయాట్ట. ఇదీ ఆమె చెప్పిన విషయాల సారాంశం! రఘురాం గారి గురించి మాత్రం ఏమీ చెప్పలేదు. ఆ రోజునుంచీ ఆ వాటా పెంకులుమీద వాలిన కాకి మా వాటా పెంకులుమీద వాలడానికి వీల్లేదు ! (ఇల్లు ఒక్కటే కాబట్టి) అంతవరకూ మా రెండిళ్ళకీ పనిచేసే పనిమనిషీ, పాలుపోసే పాల వాడూ, చాకలీ అందరూ మారిపోయారు. అనూరాధ వాళ్ళ ఐశ్వర్యం చూసి అసూయపడుతోందని నా అనుమానం. ఇంట్లో పనిమనుషులు యిద్దరవడంవల్ల కొన్ని కొన్ని చీకాకులు వస్తూండేవి. పనిమనుషుల తగవుల్లో యిల్లాండ్రు తలదూర్చేవారు. ఆ తగవులు మా యిద్దరి దగ్గరికీ వచ్చేవి జడ్జిమెంటు కోసం. అయితే నాలాగే రఘురాంగారు కూడా పట్టించుకొనేవారు కాదు. ఆఖరుకు అనూరాధ ఆఖరి అస్త్రం ప్రయోగించడానికి ఉద్యుక్తురాలయింది.

ఓనాటి రాత్రి అంది.

"వాళ్ళని యిల్లు ఖాళీచెయ్యమని చెప్పాలండీ !" అని.

ఆ మాట ఎప్పుడో ఒకప్పుడు అంటుందని నాకు తెల్సు. ఆమె

సూచనకు తగువిధంగా జవాబు చెప్పా లనుకున్నా.

"మొన్న మున్సిపాలిటీవాళ్ళు వచ్చి వాళ్ళని ఏమైనా ఎంక్వయరీ చేసారా ?"

"ఆఁ అడిగారు ! అప్పుడు ఆ బడ్డూ స్క్వేర్ యింట్లోనే ఉన్నాడు!"

రఘురాంగారికి పెట్టిన పేరుకి నవ్వొచ్చింది ! ఆపుకొన్నా.

"ఏమని చెప్పారు ?"

"అరవై రూపాయిలు అద్దె యిస్తున్నా నని చెప్పాడు ! వాళ్ళు నమ్మలేదు కాబోలు! ఇంత వాటాకీ అరవై రూపాయి లేనా అద్దె అని రెట్టించారు !"

"అప్పు డేమన్నారు ?"

"వారు మాకు దగ్గర బంధువులు. ఎంతో కొంత యివ్వమన్నారు! అరవై రూపాయిలు యిస్తున్నాం ! అని చెప్పాడు !"

"చూసావా ! ఆయ నెంత మంచివాడో ! అలా చెప్పమని మనం ఆయనతో చెప్పామా ? అనవసరంగా రమణితో పేచీకి దిగుతున్నావేమో అనిపిస్తోంది !"

నా మాటలకి అనూరాధకు రోషం వచ్చింది.

"తీరి కూర్చుని నేనే తగువుపెట్టు కున్నానంటారు ! అనండి ! మీరూ నన్నే అనండి ! దిక్కుమాలిన సంత ! అద్దెకు కక్కుర్తిపడి నెత్తిమీద కుంపటి తెచ్చి పెట్టుకొన్నా ! ఇంట్లోవాళ్ళకీ ఊళ్ళో వెధవలకీ లోకువైపోయాను!"

రాగాలు ప్రారంభించింది.

"నువ్వే కదా దింపావ్ ! మొగుడూ పెళ్ళాం ! యిద్దరే ! చిన్నకుటుంబం పెద్ద అద్దె ! పైగా మర్యాదగా అణకువగా కనిపిస్తున్నా రన్నావ్ !" అన్నాను, నా తప్పు లేదన్నట్లు. నా అదృష్టవశాత్తూ అనూరాధే అద్దె మాట్లాడి వాళ్ళని దింపింది.

"అందుకే ఏడుస్తున్నా !" అంటూ లేచిపోయింది.

ఈ సమస్య ఎలా పరిష్కారం అవుతుందిరా భగవంతుడా అనుకొంటూ ఆలోచిస్తున్నా మంచంమీద పడుకొని పైకి చూస్తూ. ఏమీ మార్గం తోచలేదు. పేపరు తీసుకొని చదవడం మొదలు పెట్టా. ఇంటి పనులన్నీ ముగించుకొని వచ్చింది అనూరాధ. నా మంచానికి దగ్గరగా కుర్చీ లాక్కొని కూర్చొంది. పేపరు చాటునుంచి గమనించా. మళ్ళా ఆ విషయం ఎత్తుతుందని తెల్సు.

"ఎలాగయినా ఖాళీ చేయించాలండీ !" అంది.

నే నేమీ మాటాడలేదు. అలాగని పేపరూ చదవలేదు ... నా ధోరణి ఆమెకి నచ్చలేదు.

"ఆ దిక్కుమాలిన పేపరు తీయండీ! ఎక్కడికి పోదు !" అంటూ నా చేతిలోని పేపర్ని లాగి కిందపడేసింది.




"ఆఁ ఏవిటంటావ్ ?" అడిగా కోపం తెచ్చుకోకుండా.

"ఉదయంనుంచీ పోరుతున్నా మీ కొక్క మాటా బుర్ర కెక్కలేదన్న మాట ! అవునులెండి నా బాధ మీ కెలా తెలుస్తుంది ! అసలు నా మాటకి ఎప్పుడు విలువుండి యేడిసింది ఈ యింట్లో !"

సాగదీసింది. ఇక లాభంలేదని రాయబారానికి దిగాలనుకొన్నా.

"ఏ వంకపెట్టి ఖాళీ చేయించ మంటావ్ చెప్పు ? అద్దె ముందునెల్లోనే వారంరోజులు ముందుగానే యిచ్చేస్తు న్నారు. రెండునెల్ల అడ్వాన్సు నీ దగ్గర డిపాజిట్ ఉంది! ఇల్లు పాడుచేస్తున్నారా అంటే అదీలేదు." అన్నా, ఏమనాలో బోధపడక.

కొన్ని నిముషాలు మౌనంగా గడిచి పోయాయ్. అనూరాధ ఏదో ఆలో చిస్తోంది కాబోలు !

"అద్దె మరో యాభై పెంచా మనండి! చెప్పా పెయ్యకుండా ఖాళీచేసి పోతారు !"

సూచించింది ఎంతో తెలివైనదానిలా. నాకు నవ్వొచ్చింది.

"అలాగే రఘురాంగారితో మాటా డుతా ! ఈ విషయం రమణి దగ్గర అనకు !"

అంటూ గోడవైపు తిరిగాడు పడుకొనే ఉద్దేశంతో...

"దాంతో మాటాడ్డానికి నాకేం ఖర్మ !"

అంటూ తనూ లేచిపోయింది.

* * *

మర్నా డుదయం రఘురాంగారు నూతిదగ్గర స్నానంచేస్తూంటే పనిగట్టుకొని వెళ్ళి కబుర్లలోకి దింపా. ఆ మాటా, ఈ మాటా అయాక అసలు విషయంలోకి మాటలు మార్చా...

"ఈ హవుస్ టాక్సెస్ మరీ ఘోరంగా పెంచేసారండీ !" అన్నా రియాక్షను ఎలా ఉంటుందోఅని చూస్తూ.

"అవునండీ ! మా కొలీగ్ కూడా గోలపెడుతున్నాడు !" అన్నారు.

"ఇల్లు అద్దె కిచ్చుకొనేకన్నా అమ్ముకొని ఏ చెట్టకిందనో కాపరంపెడితే మంచిదనిపిస్తోంది !"

నా మాటకు ఆయన వెంటనే అందుకొన్నారు.

"బాబ్బాబూ ! ఇల్లు అమ్మడంగానీ, ఖాళీచెయ్యమనడంగానీ చేయకండి ! కావలిస్తే మరికొంచెం పెంచుకోండి !" అన్నారు, సబ్బునురగలు రుద్దుకొంటూ. అదేమి సబ్బోగానీ పెరడంతా గుప్మని సువాసన వెదజల్లుతోంది ! ఒక్కసారి రుద్దుకొంటే బావుణ్ణు ! అనిపించింది. అనూరాధ మా వంటింటి కిటికీ దగ్గర నిలబడి చాటుగా మా మాటలు వింటోంది. కొద్దిగా జరిగి వార్నింగిస్తూ నావైపు చూసింది.

"అదేనండీ ! ఈ నెలనుంచీ మరో ఫిఫ్టీ రుపీస్ ఎక్కువ చెయ్యాలను కొంటున్నా !" అన్నా గట్టిగా అనూరాధకి విన్పించేలా.

"అలాగే చేద్దాం మాష్టారూ !" ఈజీగా అనేసారాయన, బాల్చీలోని నీళ్లు కిందకి గుమ్మరిస్తూ. వెంటనే అనూరాధ వైపు చూసా, ఆమె ఇనస్ట్రిక్షన్స్‌కోసం. ఆమె మూతి వంకర్లు తిప్పుతూ లోనికి పోయింది.

"ఇలా కాదండీ ! మీ రుండడం మా కిష్టంలేదని నిర్మొహమాటంగా చెప్పెయ్యండి !" అంది భోజనం వడ్డిస్తూ.

అంత నిర్మొహమాటంగా చెప్పే శక్తి నాకు లేదు. అలా అంటే అనూరాధతో గొడవ.

"ఈ మాటు అలాగనే చెబుదాం ! నాలుగురోజులు పోనీ !" అన్నా అప్పటికా ప్రోబ్లెం టెంపరరీగా డ్రాప్ చేస్తూ.

అంతటితో తృప్తిపడి ఊరుకొంది అనూరాధ.

ఆ రోజునుంచీ కుక్కమీదా, పిల్లిమీదా పెట్టి మాటలు విసిరేది అనూరాధ.

"తప్పు అనూ ! పొమ్మంటే వాళ్ళే పోతారు ! సాటి స్త్రీని అలా అవమాన పరచకూడదు!" అనేవాడ్ని సౌమ్యంగా, ఆమెకు కోపం రాకుండా.

"మొగుడు వెయ్యిరూపాయిల జీతగాడని దానికి గర్వం ! క్లబ్‌లూ,

బీచ్‌లూ, సినీమాలూ, షికార్లూ ఏమి పోకిరీ వేషా లేస్తుందని ? డబ్బుంటే మాత్రం అంత మిడిసిపాటా !" అంది గట్టిగా ఆమెకు వినబడేలా.

ఆ క్షణంలో అక్కడున్నందుకు నాకు చాలా సిగ్గేసింది. పాపం ఆమె ఎంత బాధపడుతోందో ! ఈ మాట బయటకంటే అనూరాధ చంపేస్తుంది. పరిష్కారమార్గంకోసం పరిపరివిధాల ఆలోచిస్తూ ఉండిపోయా. కాంపర్‌మైజ్ ప్రశ్నేలేదు. 'ఇంటిలోని పోరు యింతింతగాదయా !' వేమన పద్యం జ్ఞాపకానికి వచ్చింది.

*    *    *

మా బాబాయికి సుస్తీగా ఉందనీ గుంటూరు జనరల్ హాస్పిటల్లో అడ్మిట్ చేసారని ఉత్తరం వస్తే బయలుదేరక తప్పిందికాదు. అనవసరంగా రమణితో తగువు పెంచుకోవద్దనీ మూడో రోజు కల్లా వచ్చేస్తాననీ చెప్పి బయలుదేరా. నాకు హాస్పిటలన్నా, జబ్బులన్నా చచ్చేంత భయం. ఆ వాసనే పడదు ! అంటీసెప్టిక్ లోషన్ల వాసన అయిదు నిమిషాలు చాలు ! తల తిప్పుతుంది. మా బాబాయి ఉన్నది మెడికల్ వార్డు కాబట్టి చాల నీట్‌గా ఉంది. వార్డు అంతా రోగులతో నిండి ఉంది. బెడ్సు చాలక కొంతమంది రోగులు కిందపడుకొన్నారు. రకరకాల రోగాలు !, బతకాలనే ఆశ అందరికీ ! బాబాయితో ఓ గంట మాట్లాడాక రోగుల్ని చూడాలనిపించింది ...మూడో నెంబరు బెడ్‌కి ఏమి జబ్బో తెలీదు చాలా సీరియస్ ఉంది కాబోలు! ఒక చీఫూ, ఇద్దరు అసిస్టెంట్లూ, ముగ్గురు నర్సులూ ఆ మంచం చుట్టూ మూగారు. హడావిడిగా ఉన్నారు. వారి మొహాల్లో ఆందోళన వ్యక్తమవుతోంది. ఆక్సిజన్ సిలిండర్ను తోసుకొని వెళ్తున్నాడు వార్డుబాయ్. పైవాళ్ళ నెవ్వరినీ దగ్గరగా వెళ్ళనీయటంలేదు. కొంచెం దూరంలో నిలబడి నేనూ చూసా. వయస్సు మళ్ళినాయనే ! అరవై పైనే ఉంటాయ్ !. ఒక స్త్రీ, అతని భార్య కాబోలు ! దుఃఖాన్ని మింగుకోవాలని వ్యర్థప్రయత్నం చేస్తోంది. ఆమె పక్కనే పదేళ్ళకుర్రాడు బెంబేలుపడి చూస్తున్నాడు. చినిగిపోయి, మాసిపోయిన చొక్కా, తైలసంస్కారంలేని జుత్తూ అతి దీనంగా ఉన్నాడు. వాళ్ళని చూడలేకపోయా. వెంటనే బాబాయి దగ్గర కొచ్చేసా కానీ నా దృష్టి అంతా బెడ్ నెంబరు త్రీమీదనే.

"అతను జాయిను అయి వారం రోజులు అయింది ! రిటైర్డ్ టీచరుట ! ఎనీమియా ! బాగా ముదిరిపోయింది !"

నే నడక్కుండానే చెప్పాడు బాబాయి.

"పాపం ! ఎలా ఉంటుందో ! ఆక్సిజన్ కూడా యిస్తున్నారు!" అన్నా సానుభూతిగా.

"అనూరాధనీ, పిల్లల్నీ తీసుకొని రాలేకపోయావా! చూసి చాలా రోజు లయింది !" అడిగారు.

"వచ్చే నెల్లో వస్తాం ! ముందు నన్ను వెళ్ళి మిమ్మల్ని చూసి రమ్మంది !" అన్నా ఆ బెడ్ వైపే చూస్తూ.

కొద్దినిమిషాలు మౌనంగా గడిచి పోయాయ్.

"వస్తా బాబాయ్ ! మళ్ళా రేపు వెళ్ళిపోవాలి !" అన్నా లేచి నిలబడుతూ.

"అదేవిట్రా ? రేపు ఆదివారమే కదా ?"

"అవును ! రేపుదయం మళ్ళా వస్తా ! మధ్యాహ్నం వెళ్ళిపోతా." అని చెప్పి బెడ్ నెంబరు త్రీవైపు మరోసారి చూసి బయటకు వచ్చేసా. ఉపాధ్యాయులంటే నాకు అభిమానమూ, గౌరవమూను. కారణం ఏదైనా కావచ్చు ! "ప్రతి పౌరున్నీ తీర్చిదిద్దే మొట్టమొదటి అవకాశం వారికే ఉంటుంది !" అనే కావచ్చు. తక్కువ ప్రతిఫలంతో, ఎక్కువ బాధ్యతలతో సతమతమవుతూ ఉంటారనే కావచ్చు ! ఏమైతేనేం ! రిటైర్డ్ టీచర్సు ఎవరైనా వచ్చి సహాయం అర్థిస్తే ఆనందంతో సహాయం చేస్తా. ఆ నిర్భాగ్యుడికి ఎలా ఉంటుందోనన్న బెంగ పట్టు కొంది. సాయంత్రం ఆరయింది. సినిమా కెళ్ళాలని హాలుదగ్గర క్యూలో నిలబడ్డా. మనసు బాగులేక బయటకు వచ్చేసా. బజారు కెళ్ళి నాలుగు బత్తాయి పళ్ళూ, రెండు ఆపిల్సూ, కొన్ని ద్రాక్ష పళ్ళూ కొని యింటికిపోయా. రాత్రి సరిగా నిద్రపట్టలేదు. ఆ మాష్టారి మొహమే కన్పించేది.

మర్నా డుదయమే లేచి పళ్ళను బేగ్‌లో వేసి హాస్పిటలుకు బయలుదేరా. అలాగే విశాఖపట్నం వెళ్తున్నానని పిన్నికి చెప్పా. వార్డులో అడుగు పెడుతూనే బెడ్ నెంబరు త్రీవైపు చూసా ఆతృతగా. ఆ బెడ్ చుట్టూ కర్టెన్లు కట్టి ఉన్నాయ్ ! దగ్గరగా వెళ్ళి చూసా. ఆ యిల్లాలు స్టూలుమీద కూర్చొని మాష్టారి పాదాలమీద తల ఆన్చుకొని శోకిస్తోంది. మాష్టారి శరీరం అంతా తెల్లని దుప్పటితో కప్పబడి ఉంది. కాళ్ళు వణికాయ్. చేతిలోని సంచీ చాలా బరువుగా తోచింది.

"మాష్టారూ !" అని కేక వేసా ఆవేశంగా.

ఆమె వెనక్కి తిరిగి నా వైపు చూసింది. అపరిచిత వ్యక్తులం ! అదోలా చూసుకొన్నాం.

"మాష్టారు మనల్ని వొదిలిపోయారు బాబూ !"

గట్టిగా శోకాలు తీయడం ప్రారంభించిందామె. ఆమె గొంతు బొంగురు



పోయింది. కళ్ళు లోతుకుపోయాయ్ ! చిరుగుల చీర ! దుర్భర దారిద్ర్యం అనుభవిస్తూన్నట్లు తెలుస్తోంది. ఎలా ఓదార్చాలో తెలియలేదు. నాకూ కళ్ళు చెమ్మగిల్లాయ్. ఆ ఊరిలో బంధువులున్నారో లేదో ? అసలు ఏ ఊరో ? బంధువులుంటే ఎందుకు రారు ? మరి దహనసంస్కారం ?

ఇంతలో స్టాఫ్ నర్సు వచ్చింది ఉరుకులూ, పరుగులూ వేసుకొంటూ.

"ఎలాగమ్మా ? డెడ్ బాడీని తీసెయ్యాలి ! ఛీఫ్ వచ్చేవేళయింది ! చూసారంటే కోప్పడతారు ! ఇప్పటికే చాలా ఆలస్యం అయింది !"

తొందర చేసిందామె నిర్దయగా.

నా క్కోపం వచ్చింది ఆమె ప్రవర్తనకు.

"అదేంటి సిస్టర్ ! అంత తొందర పడతారు ?" అన్నా కల్పించుకొంటూ.

"తొందరా?" అంటూ కనుబొమలు

చిట్లించి ఆమె నావైపు కోపంగా చూసింది.

"రాత్రి పదకొండుగంటలకు పోయాడాయన! ఇంతవరకూ ఉండనిచ్చాం!" అంది ఎంతో కన్సిడరేషన్ యిచ్చినట్లుగా మొహం పెడుతూ.

నే నేమీ మాట్లాడలేకపోయా. అవును వారి డ్యూటీ అది! మానవత్వం ఉన్నా చంపుకోవాలి! వారి రూల్సు వారివి!

"మీ వారెవ్వరూ రాలేదామ్మా?" అడిగింది సిస్టర్ తగ్గుస్వరంతో.

"వస్తారమ్మా వస్తారు! కూతురూ, అల్లుడూ ఈ ఊళ్ళోనే ఉన్నారు! మా అబ్బాయి వెళ్ళాడు తీసుకొని రావడానికి!" ఏడుస్తూనే చెప్పిందామె

"ఏమో! మరో అయిదు నిమిషాలు చూస్తాం! ఎవ్వరూ రాకపోతే ఐసు కొట్లో పడేస్తాం!" అనేసి నిర్లక్ష్యంగా వెళ్ళింది స్టాఫ్ నర్స్

"ఎంత నిర్భాగ్యపు చావు వచ్చిందండీ! ఆరుగుర్ని కన్నాను!" రాగాలు ప్రారంభించిందామె.

"చూడండమ్మా! మీ అల్లుడిగారి అడ్రస్సు చెప్పండి! నే వెళ్ళి తీసుకొస్తా!" అన్నా.

"ఆ వివరాలు నాకు తెలియవు బాబూ! మాది ఈ ఊరు కాదు...మా ఆఖరి కుర్రాడు గంటక్రితం వెళ్ళాడు! వస్తూనే ఉంటారు!" అంది మొహమూ, కళ్ళూ చీరచెంగుతో తుడుచుకొంటూ.

కొంతసేపు వెయిట్ చేసా. ఎవ్వరూ రాకపోవడంతో ఆత్రుతా, కంగారూ ఎక్కువయ్యాయ్! ఏమిటో అనుబంధం! మన కెందుకులే! అని సరిపెట్టుకోలేకపోయాను. సంచీని బాబాయి దగ్గరుంచి మెయిన్‌గేటు దగ్గరకు గబగబా నడిచా.

"ఆయన నీకు తెలుసు నేవిత్రా?" అన్న బాబాయి ప్రశ్నకు జవాబు చెప్పలేదు. మెయిన్‌గేటుకు అవతల వచ్చేవాళ్ళనందర్నీ పరికిస్తూ నిలబడ్డా. నిన్న చూసిన కుర్రాడికోసం నా కళ్ళు వెతుకుతున్నాయ్! మేష్టార్ని ఐసు కొట్లో పడేస్తారేమో నన్న భయం పీడిస్తోంది.

కొంతసేపటికి ఆ కుర్రాడు కన్పించాడు. చిన్నసైజు పరుగుతీస్తున్నాడు. అతనివెంట మరో ముగ్గురు గబగబా నడుస్తున్నారు...ఇరవై యేళ్ళ యువతి! కూతురై ఉంటుంది! మరొకడు అల్లుడు! మూడోవాడు? ఎవరో?

ఎదురుగా వెళ్ళి అడిగా-

"మాష్టారి తాలూకు మీరేనా?" అని.

'అవునంటూ' లోపలికిపోయారు నన్ను చూడకుండానే. నేనూ వాళ్ళని అనుసరించా. శవం బెడ్ మీదనే ఉంది. కూతుర్నీ, అల్లుణ్ణీ చూసి ఆమె మరలా ఏడుపు మొదలుపెట్టింది ... ఏమి

చేయాలో తోచక అటూ ఇటూ చూసాడు మాష్టారి అల్లుడు. వెనుక నిలబడి ఉన్న నన్ను చూసి-

"ఏం చేయాలి ?" అడిగాడు.

నన్ను నేనే పరిచయం చేసుకొన్నా. మాష్టారి శిష్యుణ్ణని చెప్పుకొన్నా.

"ముందు డెడ్‌బాడీని యిక్కడ్నుంచి తరలించాలి! బాగా ఆలస్యం అయిందని హాస్పిటలువాళ్ళు గొడవచేస్తున్నారు !" అన్నా.

నేలచూపులుచూస్తూ ఉండిపోయాడు.

"ఎలా తీసుకెళ్లడం ?" తలెత్తి అడిగాడు.

అతనికి అనుభవం లేదులా ఉంది ! కనీసం చూడనైనా లేదేమో !

"టాక్సీని మాట్లాడండి !" అన్నా.

అతను కొంచెం దూరంగా నడిచి నన్ను తన దగ్గరకు రమ్మన్నాడు, ఏదో అడగాలనే ఉద్దేశంతో. డబ్బుకోసం ఆలోచిస్తున్నట్లుగా తోచింది...దగ్గరగా వెళ్ళాక అన్నా డతను.

"టాక్సీ అయితే ఎక్కువడుగుతాడేమో !"

"ఎంత దూరం మీ యిల్లు ?"

ఏదో చెప్పాడు.

"ఊళ్ళోనేకదా ! కాకపోతే డెడ్‌బాడీ కదా అని ఎక్కువడుగుతాడు ! ఎంతయినా పాతిక రూపాయిలకన్నా ఎక్కువడగడు !" అన్నా.

"పాతిక రూపాయిలుండాలంటారా?" అన్నాడు నిస్పృహగా.

"ఆ డబ్బు నే నిచ్చుకొంటా ! ఆ విధంగానైనా మాష్టారి ఋణం కొంతయినా తీర్చుకొన్నట్లుంటుంది !" అనేసా ఆనాలోచనగా.

అతని కళ్లు కృతజ్ఞతతో మెరిసాయ్!

అవతలికిపోయి టాక్సీని బేరంచేసి తీసుకొచ్చా. శవాన్ని డిక్కీలో పడేసాం. మాష్టారి అబ్బాయీ, అల్లుడూ ముందుసీట్లో కూర్చున్నారు. భార్యా, కూతుర్ని వెనుకసీట్లో కూర్చోబెట్టాం. నా పక్కనే నిలబడ్డాడు వారితో వచ్చిన మూడో వ్యక్తి. టాక్సీకి డబ్బు చెల్లించి "మరి నే వస్తానండీ !" అన్నా.

"ఒరేయ్ భాస్కరం ! బావలకి ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాం యియ్యి !" చెప్పాడు మాష్టారి అల్లుడు నా పక్కనే నిలబడ్డ అతనితో.

"మీ సహాయానికి చాలా థాంక్స్!" అన్నాడు నన్ను చూస్తూ, టాక్సీ కదులుతూండగా...

"నే వెళ్ళి టెలిగ్రాం యిస్తా సార్!" అన్నాడు భాస్కరం—

"డబ్బుందా ?" అనుమానంగా అడిగా.

ఉన్నాయన్నట్లు తలూపుతూ జేబులో ఉన్న డబ్బంతా చేతిలోకి తీసుకొని లెక్కపెట్టాడు ... "మూడురూపాయిల

ఎనభై పైస లున్నాయ్ సార్ !" అన్నాడు.

"అర్ధనరీ టెలిగ్రాంకే చాలదు ! నేనూ వస్తానుండు !" అని చెప్పి మా బాబాయి దగ్గర కెళ్ళా.

నావైపు అదోలా చూసాడు మా బాబాయి, అతని ప్రశ్నకు జవాబు చెప్పనందుకేమో !

"ఆయన నా ఫ్రెండ్ నాన్నగారు !" అని బొంకా.

"అలాగా !" అన్నారు సంతృప్తిగా.

ఆయన దగ్గర పెట్టిన సంచీని తీసుకొని విశాఖపట్నం వెళ్ళిపోతున్నానని చెప్పి బయలుదేరా.

నేనూ, భాస్కరమూ రిక్షా ఎక్కి టెలిగ్రాఫ్ ఆఫీసుకు బయలుదేరాం ... దారిలో మాష్టారి విషయాలు అడిగి తెలుసుకొన్నా.

అతను మాష్టారి అల్లుని తమ్ముడట! నిరుద్యోగి మాష్టారు రిటైరయి అయిదు సంవత్సరాలకి పైగా అయిందిట ! నలుగురు మగపిల్లలూ, యిద్దరాడపిల్లలూ ! పెద్దపిల్ల లిద్దరికీ కాలేజీ చదువులు చెప్పించారుట. ఆడపిల్ల లిద్దరికీ పెళ్ళిళ్ళు చేసారుట! పెద్దబ్బాయి లిద్దరూ ఉద్యోగాలు చేస్తున్నారుట ! పెద్దవాడికి విశాఖపట్నంలో ఉద్యోగమట ! పెద్ద ఉద్యోగమే అయినా కానీ పంపట్ట ! రెండోవాడు అత్తవారి ఊరికి బదలీ చేయించుకొని వారిలో కల్సిపోయాట్ట ! అతను ఉత్తరాలే రాయట్ట! రిటైరయిన తర్వాత నాలుగు సంవత్సరాలదాకా ప్రయివేట్లు చెప్పుకొని కాలక్షేపం చేసార్ట ! ఒక సంవత్సరంనుంచీ జబ్బు ప్రవేశించిందిట ! పాతిక రూపాయలు పెన్షన్ వస్తుందిట ! మాష్టారి భార్య ఆ ఊరి కరణం గారింట్లో పనిచేసి నెలకు పాతిక రూపాయిలు తెస్తుందిట ! అదే వారి ఆదాయం. అల్లుడికి గుంటూరులో చిన్న ఉద్యోగం ! సహాయం చేయలేని స్థితి ! నానా పస్తులూ పడి దుర్భర దారిద్ర్యం అనుభవించారుట ఆఖరి దశలో – ఇదీ అతను దారిలో చెప్పిన విషయాల సారాంశం.

"చాలా జబ్బుగా ఉందనీ బతకడం కష్టం అనీ అందరికీ యిదివరకే ఉత్తరాలు రాయకపోయారా ?" అడిగా అంతా విన్నాక.

"నాలుగురోజులక్రితం రెండోసారి ఉత్తరం రాసాం సార్ ! నిన్న అందరికీ టెలిగ్రాములు కూడా యిచ్చాం !"

చెప్పాడు భాస్కరం.

ఇహ అతణ్ణి అడగాల్సిన విషయాలేవీ లేవు ! టెలిగ్రాఫ్ ఆఫీసు వచ్చింది. గబగబా కౌంటరు దగ్గరకెళ్ళి రెండు ఫారాలు తీసుకొని మేటరు రాసా.

"యువర్ ఫాదర్ ఎక్స్‌పయిర్డ్ స్టాప్ ఇమీడియట్లీ"–భాస్కరం.

పెద్దబ్బాయిల యిద్దరి ఎడ్రస్సూ చెప్పమన్నా.

మొట్టమొదట మాష్టారి పెద్దబ్బాయి ఎడ్రస్సు చెప్పాడు. నాలోని నవ నాడులూ కృంగిపోయాయ్ ! పక్క నే ఉన్న కుర్చీలో కూలిపోయా ! మాట రాలేదు ! అతనూ నా ప్రక్కనే కూర్చొన్నాడు మౌనంగా. కొంత సేపటికి తేరుకొని అడ్రస్సులు రాసి బుక్ చేయించి బయటకు వచ్చేసాం ! రశీదులు అతని చేతిలో పెట్టి.

"మీ రెళ్లండి !" అన్నా. అతను కళ్ళతోనే థాంక్స్ చెప్పి వెళ్ళిపోయాడు.

సంచీపట్టుకొని బరువుగా నడక సాగించా. ఎలాగో నానా తిప్పలూ పడి నాలాగే బరువుగా వాల్తేరు స్టేషనుకు జేర్చింది ఎక్స్ప్రెస్. మాష్టారికోసం కొన్న పళ్ళు సంచీతోసహా ట్రైన్‌లోనే వదలేసా ! అవి మాష్టారికోసం కొన్నవి. నేను చూస్తూండగా మరొకరు తింటూంటే సహించలేను. ఇల్లు చేరేసరికి బాగా రాత్రి అయింది. గేటులో అడుగు పెడుతూనే రఘురాంగారి వాటాలోకి చూసా. లైట్లు వెలిగి ఉన్నాయ్ ! మా యింటి తలుపులు తట్టగానే అనూరాధ తలుపులు తీసింది.

"రఘురాంగారు ఎక్కడికీ వెళ్ళ లేదా ?" అడిగా అడుగు వెనక్కు వేస్తూ, ఆమె నన్ను తాకుతుందనే భయంతో.

"ఎలా ఉందండీ మామయ్యగారికి?" అడిగిందామె. నా ప్రవర్తనకి కీడు శంకిస్తూ.

"ఆయన బాగానే ఉన్నారు ! రేపో యెల్లుండో డిస్చార్జి చేస్తారు ! రఘురాం గారు ఇంట్లోనే ఉన్నారా ?" మరలా అడిగా.

"ఆఁ ! ఎక్కడికో తెల్లవారు ఝామునే వెళ్ళి ఇప్పుడే తగులడ్డారు !" అంది ఆమె ధోరణిలో.

ప్రయాణికపు బడలికగా ఉందనీ వేడినీళ్ళు పెట్టమనీ చెప్పి రఘురాం గారింట్లోకి వెళ్ళా.

"రండి మాష్టారూ !" సాదరంగా ఆహ్వానించారు రఘురాంగారు. రమణి రేడియో వింటూ నన్ను గమనించనే లేదు. పైన సీలింగు ఫేను గిరగిరా తిరుగుతోంది. వారిలో ఏ విధమైన ఆందోళనా కనబడలేదు ! టెలిగ్రాం అందలేదేమో అనుకొంటూ కుర్చీలో కూర్చున్నా.

"మీ కేమీ టెలిగ్రాం అందలేదా ?" అడిగా.

నా మాటలు విన్న రమణి కుర్చీ లోంచి లేచినిలబడింది. నాకు సమాధానం చెప్పకుండా భార్యవైపు చూసారు రఘురాంగారు.

"అవునండీ ! నిన్న ఉదయం వచ్చింది ! మన అరకు ప్రోగ్రాం




మధురాంతకం రాజారాం

శంకరమంటే నాకు ఒళ్ళుమంట. అతణ్ణి నేను ఎగతాళి పట్టించాలనుకున్నాను. ఎద్దేవా చేయాలనుకున్నాను. పదిమంది లోను అతని నిష్ప్రయోజకత్వాన్ని బయటపెట్టి, లోకులందరూ అతణ్ణి చూచి నవ్వుతుంటే వాళ్ళతోబాటు గొంత

ఇలాతలంపైన ఆ టిఫిన్ బాక్స్‌లో ఏముంటుందో తెలిసిన వాళ్ళు ముగ్గురంటే ముగ్గురు. ఒకరేమో ఆఖాద్య పదార్థాన్ని తయారుచేసిన ఇల్లాలు రెండో వ్యక్తి ఎవరి కోసమైతే ఆ పదార్థం తయారు చేయబడిందో ఆ శంకరం. మూడోవాడు సర్వాంతర్యామి అయిన భగవంతుడు!

ప్రతి నెలకూ శుక్లపక్షమనీ, కృష్ణ పక్షమనీ వున్నట్టుగా శంకరానికి ప్రతి పక్షంలోను ఊదావారమనీ, బూడిద వారమనీ రెండు వారాలు. మరేంలేదు. అతడు ధరించే పాంటు రంగునుబట్టి యిలా పేర్లు పెట్టుకోవడం జరిగింది. శంకరం మా ఆఫీసులో ఉద్యోగం చేసిన కాలం నాలుగేళ్ళు. ఈ నాలుగేళ్ల కాలంలో ఏ సమయంలోనైనా అతనికి ముచ్చటగా మూడు పాంట్లున్నట్టు నాకు గుర్తులేదు. ఉన్న రెండింటిలో ఒకటి చిరుగులు పడిపోయి, పూర్తిగా ఉపయోగార్హత కోల్పోయినప్పుడు మాత్రమే అతడు కొత్త పాంటు కుట్టించుకునేవాడు.

"అకౌంటుపైన బట్టలు అప్పుగా యిచ్చే అంగళ్ళు గూడా వున్నాయి శంకరం ! ఒకసారిగా నాలుగు పాంట్లు కుట్టించుకోరాదూ ?" అంటూ సలహా యిచ్చి చూశాను.

నా అమాయకత్వానికి జాలిపడుతున్నట్టుగా నవ్వేసాడు శంకరం. "ఎందుకు లెండి శేఖరంగారూ ! ఇదే హాయిగా వుంది. నాకిప్పుడు చాకలివాళ్ళతో బెడద లేదు. లేదంటే ప్రతి ఆదివారమూ యిందుకోసమని కొంత కాలం వినియోగించాలి. ఓ పాంటు, షర్టూ ఉతికి ఆరవేసుకుంటానేమో, ఇందువల్ల ఇస్త్రీ చేసి పెట్టెలో పెట్టుకుంటానేమో! ఇందువల్ల ఎల్లప్పుడూ నా పెట్టెలో ఒక జత బట్టలు స్టాకుండిపోతాయన్నమాట ! అంతకంటే ఏం కావాలి చెప్పండి !"

లోభత్వాన్ని కూడా అదొక వైభోగంలా చెప్పుకోడానికి వీలుంటుందని నా కప్పుడే మొదటిసారిగా తెలిసింది.

అయినా ఆమాత్రంతో నేను ఆశ వదులుకోలేదు. శంకరాన్ని మెల్లగా మా దారిలోకి మళ్ళించుకోడానికి ఎన్ని ప్రయత్నాలైతే చేయవచ్చో అన్నింటినీ చేసి చూసాను. మహర్షులకు తపోభంగం కలిగించటానికి ఇంద్రుడు కూడా అన్ని పాట్లు పడివుండడు. సిగరెట్లు ఆఫర్ చేశాను తేనీటి సేవనం మప్పాలనుకున్నాను. ఆఫీసు కాంటీనుకు అలవాటు చేద్దామని ప్రయత్నించాను. ఆఖరుకు 'ప్రపంచమనే ఎడారిలో ఒయాసిస్సుల్లాంటి సినిమా థియేటర్లున్నాయి శంకరం ! రెండు రూపాయలు మనవి కావనుకుంటే మూడు గంటలసేపు వినోద కాలక్షేపం' అంటూ సదుపదేశం చేశాను. మహానుభావుడు శంకరం చెక్కు చెదిరేటట్టులేడు !

"మన్నించండి శేఖరంగారూ ! మీ కిష్టమైన వ్యాసంగాలే నాకూ యిష్టం

కావాలని ఎక్కడుంది ? నా కానందం కలిగించేవి వేరే వున్నాయిలేండి !" అనేవాడు.

ఈ మాట కాస్తా మా ఆనందరావు చెవిలో వేశానేమో, అతడు విరగబడి నవ్వేశాడు— "వాడి కానందమైన వ్యాసంగా లేమిటో నేను చెప్పనా శేఖరం ! ఒకటి, జీవచ్ఛవంలా బ్రతకడం. రెండోది, నడపీనుగులా మసలుకోడం ! ఇంతకూ వాడు తాను బ్రతుకుతున్నది గూడా ఒక బ్రతుకేనని అనుకుంటున్నాడా శేఖరం ! ఎంత ఆశ్చర్యం, ఎంత ఆశ్చర్యం!" అంటూ విస్తుపోయాడు.

తా నీ ఊరికి వచ్చి ఉద్యోగంలో చేరిన క్రొత్తలో ఒకనాటి సాయంకాలం శంకరం నాకొక మారుమూల వీధిలో ఎదురయ్యాడు. ఆఫీసులో ఎప్పుడైనా ముక్తసరిగా పలకరించుకోడమే గానీ నా కప్పటివరకూ శంకరంతో పెద్దగా పరిచయంలేదు. ఇలా తిరుగుతున్నావేమయ్యా శంకరం ! ఇక్కడెవరైనా తెలిసినవాళ్ళున్నారా?" అని ప్రశ్నించాను.

"ఆబ్బె, అదేం లేదండీ ! కాపురం తెచ్చుకోవాలి గదా ! అద్దె యింటి కోసం వెదుకుతున్నాను," అన్నాడు శంకరం.

నా చితిని నేనే పేర్చుకున్నాను— అన్నాడట మహానుభావు డెవడో ! ఆ క్షణాన శంకరాన్ని చూస్తుంటే నాకు ఆమాటే జ్ఞప్తికి వచ్చింది.

"కాదయ్యా శంకరం ! ఈ వూరి లోనే పుట్టి పెరిగి, యిక్కడే ఉద్యోగం చేస్తున్న నాబోటి వాళ్ళం ఆఫీసులో వున్నాము గదా ! మాలో ఎవరికి చెప్పినా ఈ పాటికి నీకో అద్దెయిల్లు చూపెట్టి వుండమా ? ఆ సులభోపాయం వదిలిపెట్టి నీ అంతట నువ్వే కాళ్ళరిగి పోయేటట్టు తిరుగుతానంటావా ? చోద్యం గానే వుందిలేవయ్యా . నీ వాలకం" అంటూ ఓ దులుపు దులిపేశాను.

"అయ్యో, మీరు చూపెట్టరని కాదండీ !" నొచ్చుకున్నట్టుగా సంజాయిషీ ప్రారంభించాడు శంకరం. "ఎలాంటి పరిసరాల్లో, ఏ మాత్రం అద్దెరేటుతో నా కిల్లు కావల్సివచ్చేది మీకేం తెలుసు చెప్పండి ! కొంచెం ఆలస్యమైనా నాకు తగిన యిల్లు నేనే వెదుక్కోడం మంచిది కాదంటారా ?"

బహుశా నేను తెల్లబోయివుంటాను. ఇతగా డిప్పుడిప్పుడే మనకు అర్థమయ్యే ఘటంలా లేడనికూడా నాకు అనిపించి వుండొచ్చు. అయినా పోనీ లెమ్మని నా ఎరుకలో వున్న వర్తమానాన్ని బయటపెట్టేశాను.

"చూడు శంకరం ! మన ఆఫీసులో భానుమూర్తి లేడూ, ఈ మధ్య అతనికి యిల్లు కావలసివచ్చి వాకబు చేస్తుండగా తెలిసింది. మా వీధిలోనే రెండిళ్ళు ఖాళీగా వున్నాయి. ఒకటేమో పెంకుటిల్లు. అది మా యింటికి నాలుగో యిల్లే. వీధి

వైపున వసారా, వెనుక రెండో మూడో గదులూ, చేదబావీ, పెరడూ సదుపాయా లన్నీ వున్నాయి. ఇంకొకటి— అబ్బే, దాన్ని యిల్లనుకోడానికి వీల్లేదు. ఓ పెద్ద యింట్లో పెరటివైపున అవుట్‌హవుస్ లాంటి వాటా. ఆ యింట్లో ఖాళీ జాగా కన్నా గోడలే ఎక్కువ స్థలం ఆక్రమించా యేమోనని నా అనుమానం. ముద్దుగా దాన్ని అగ్గిపెట్టెల మేడ అంటుంటాం. ఎవరో చిన్న తరహా ఉద్యోగులు తమ పెళ్ళాం బిడ్డలతో ఆ గదులనిండా క్రిక్కిరిసి వున్నారు. ఏది నీ కిష్టమైతే దాన్నే సెలక్ట్ చేసుకోవచ్చు. అవసర మైతే వచ్చి చూసుకో బాబూ !" అని. నా పాటుకు నేను నా పనిపైన వెళ్ళి పోయాను.

రెండు రోజుల తర్వాత మూడోనాటి ఉదయం శంకరం ఆఫీసులోనే నన్ను సంధించి కృతజ్ఞత చెప్పుకున్నాడు

ఇల్లు కుదిర్చిపెట్టడంలో సైతం నా సహాయం ఆపేక్షించని అతడి ధోరణికి ఆశ్చర్యపడిపోతూ "ఏ యిల్లు ?" అన్నాను.

"అదేనండీ ! అగ్గిపెట్టెల మేడలో వెనకవైపు వాటా."

"అయ్యో శంకరం ! అంతకంటే నీ కాపురాన్ని తీసుకెళ్ళి కూరగాయల మార్కెట్లో పెట్టలేకపోయావా?" అంటూ చీదరించుకున్నాను.

"ఫరవాలేదు లెండి ! వీధిలోనుండి వేరే సందుదారి వుంది. ఆ యింటితో మనకేమీ సంబంధం వుండదు."

ఉండకపోవచ్చు. ఎందుకంటే నాలుగు వరుసలలో దాదాపు నలభై మంది గుమాస్తాలు కూర్చుని పనిచేసుకునే హాల్లోనే అతడు ఇంకొకరితో సంబంధం లేకుండా వ్యవహరింప గలుగుతున్నాడు. అగ్గిపెట్టెల మేడలోనైనా సర్దుకోకపోడు.

కానీ అతడుఎంతగా లోకంతో అంటీ ముట్టకుండా వ్యవహరింప జూచినా ఈ మనుషులు మాత్రం అతణ్ణి సులభంగా వదిలిపెట్టేటట్టు లేరు. ఎక్కడిదాకానో ఎందుకూ, ఆ ప్రయత్నం మా ఇంట్లోనే ప్రారంభమైంది.

"ఏమండీ ! మీ తోటి గుమస్తా ఎవరో మన వీధిలోనే చేరాడన్నారు గదూ! వాళ్ళావిడ నొకసారి తీసుకొచ్చి నాతో పరిచయం చేసిపెట్టగూడదూ ?" అంటూ ప్రాకంభించింది రాజేశ్వరి.

"బాగానే వుందిలే రాజేశ్వరీ ! మేమింకా ఒక పాత్రను అర్థంచేసుకో డమే పూర్తికాలేదు. అంతలో యింకొక పాత్ర గూడానా ?" అన్నాను.

అప్పటికైతే ఫుల్‌స్టాప్ పెట్టేశాను గానీ ఆ ప్రసక్తి మళ్ళీ పొడసూపే అవకాశం లేకపోలేదని నేను కొద్దిరోజు ల్లోనే గ్రహించాను. మా పాప పుట్టిన రోజు పండుగ 'సెలబ్రేట్' ఏర్పాట్లను గురించి చర్చించుకుంటూ వుండగా వున్నట్టుండి మా ఆవిడ ఆ ప్రస్తావన తీసుకొచ్చేసింది.

"ఏ వూరో, ఏ పల్లో, ఏ తల్లి కన్న బిడ్డో ఆవిడకు మాత్రం ఎలా ప్రొద్దు పోతుందండీ ? ఎక్కడికైనా వెళ్ళాలనీ, ఎవరితోనైనా పరిచయాలు పెట్టుకోవాలనీ వుండదూ ? ఆ దిక్కుమాలిన శంకరం మాటకేంలెండీ తాను రాకపోతే మానె, భార్యనైనా పంపించమనండి.."

ఆ మరునాడంతా నాకు ఆఫీసులో తోడి గుమాస్తాలను ఆహ్వానించడంతోనే సరిపోయింది. కానీ అదెందుకో శంకరం దగ్గరికి వచ్చేసరికి ఏదో పొరపాటు చేస్తున్నట్టు ఫీలవుతూ, ఎప్పటి కప్పుడు అతణ్ణి పిలవడం వాయిదా వేసుకుంటూ వచ్చాను. గంట అయిదు కొట్టగానే అతడు లేచి వెళ్ళిపోతుండడం గమనించి వసారాదాకా వెన్నంటి వెళ్ళి "మిస్టర్ శంకరం ! మాట..." అన్నాను.

"ఏమిటండీ ?" తిరిగి చూస్తూ నింపాదిగా అడిగాడు శంకరం.

"మా యింట్లో రేపొక చిన్న విశేషం పాపాయి పుట్టినరోజు పండుగ చేసుకుంటున్నాం. ప్రధానంగా అది ఆడవాళ్ల ముచ్చట. అందరూ వచ్చినా సరే ! ఆలా కుదరకపోతే మీ ఆవిడనైనా తప్పక పంపించాలి..."

ఏదైనా కుంటిసాకుతో అతడు తప్పించుకో జూస్తాడేమోనన్న అనుమానము నాకు లేకపోలేదు. అందుకని చెప్పి ముగించడమే తరవాయిగా వెనుదిరిగి వడివడిగా ఆఫీసులోకి వెళ్ళిపోయాను.

మరునాడు నేను ఆఫీసుకు సెలవు పెట్టి యింటిపట్టునే వుండిపోయాను.

బిడ్డకు హారతెత్తి, ఉపాహారాలు సేవించి, ముత్తయిదువు లందరూ వెళ్ళిపోయాక మా ఆవిడ ఫిర్యాదు మొదలెట్టింది—

"ఏమండీ, చూసారా ! పిలిచిన వాళ్ళందరూ వచ్చారు గానీ, ఆ శంకరం గారి పెళ్ళాం మట్టుకు రానేలేదు..."

"వస్తే ఎంత, రాకపోతే ఎంత ! తానొక ఒంటి కాకిలా బ్రతుకుతున్నాడా, మరింక పెళ్ళాన్ని ఘోషాలో వుంచే శాడేమో !"—నాకు శంకరంపైన పీకల దాకా కోపమొచ్చింది.

ఎట్టి పరిస్థితులలోనూ శంకరానికి సంజాయిషీ చెప్పుకునే అవకాశం దక్కకుండా చేయాలన్నది నా ఉద్దేశం. సూటిగా నా ఉద్దేశంపైన దెబ్బతీస్తూ అతడు నేరుగా నా బల్లదగ్గరికి వచ్చి ఎట్టయెదుట నిటారుగా నిలబడిపోయారు. కొద్ది క్షణాలపాటు వేచి చూచిన తర్వాత మెల్లగా గొంతు సవరించుకుంటూ "మన్నించండి శేఖరంగారూ! మొన్నటి సాయంకాలమే మీతో చెప్పాలనుకున్నాను... దయచేసి వేరు విధంగా భావించవద్దు......" అంటూ గింజుకున్నాడు.

నే నతడి ఉనికినైనా గమనించిన పాపాన పోకపోయేసరికి ఒకటి రెండు నిమిషాలదాకా ఆలాగే నిల్చుని "సర్లెండి!

మీరేదో తొందర పనిమీద వున్నట్టు న్నారు. మళ్ళీ ఎప్పుడైనా చెబుతాను లెండి..." అంటూ తన సీటువైపు సాగిపోయాడు

తనతో ముఖమిచ్చి మాట్లాడానికైనా నాకు మనస్కరించడంలేదన్న విషయం శంకరానికి అవగతమయ్యే వుంటుంది. నేనేగాదు, తోడి గుమస్తాలందరూ అతని నొక క్షుద్ర కీటకంగా లెక్కకడుతున్నా రన్న విషయాన్ని కూడా గుర్తించే వుంటాడు. అయినా లోకులతో మన కెందుకు లెమ్మన్న అతని ఉదాసీన భావాన్ని గమనిస్తూ నేను కుతకుతలాడి పోయేవాణ్ణి. ఇతని నెలాగైనా రచ్చ కీడ్వాలి, అవమానించాలి, అపహాస్యానికి గురిచెయ్యాలి. ఎలాగబ్బా ? అందు కేది దారి ? నకిలీ ట్రాన్స్ఫర్ ఆర్డ రొకటి టైప్‌చేయించి పోస్టులో వేయిస్తే? జవానుతో చెప్పి కాలిజోళ్ళలో ఒకటి మటుమాయం చేయిస్తే ? 'మదర్ సీరియస్' అంటూ ఒక టెలిగ్రాం యిప్పిస్తే ?—

శంకరంపైన యిలా కార్టూన్లు గీసు కోడమూ, బఫూన్‌లా చిత్రించుకోడమూ కూడా నా మానసిక ప్రపంచంలో నిరా ఘాటంగా జరిగిపోతున్న సమయంలో, హఠాత్తుగా అతణ్ణి గురించి పునరాలో చించుకోవలసిన ఆగత్యం ఏర్పడింది. ఇందుకు కారకు లెవరో గాదు— మా ఆవిడ రాజేశ్వరి !

దళవాయి వీధిలోవున్న మా బంధు వుల యింటికి వెళ్ళి తిరిగొస్తూ వున్న రాజేశ్వరికి దారిలో అగ్గిపెట్టెల మేడ దగ్గిర కొచ్చేసరికి శంకరం యింటికి వెళ్ళి, అతని భార్య ఎలా ఉంటుందో చూసిరావా లనిపించిందట ! మగవాడి దౌష్ట్యానికి గురైన ఆడవాళ్ళమీద రాజేశ్వరికున్న సానుభూతి అపారమని చెబితే అది నా భార్యను నేను పొగుడు కున్నట్టు గాదు, యదార్థాన్ని ఒప్పు కున్నట్టు మాత్రమే !

సరే, రాజేశ్వరి శంకరం యింటికి వెళ్ళింది. అతడి భార్యను చూసింది. అందాకా బాగానే వుంది. చూసిన తర్వాత ఆమెను పోల్చుకోడం దగ్గిరనుంచే ఈ కథ నా పైన అక్షరాలా తిరుగుబాటుకు పూనుకోడం ప్రారంభమైంది.

"ఏమండోయ్, బోలెడన్ని కొత్త వర్తమానాలు పట్టుకొచ్చేశాను. వినగలిగే గుండె దిటవు మీకుండాలే గానీ, చెప్ప డానికి నేను తయారు...." అంటూ ఉపక్రమించింది రాజేశ్వరి.

"అబ్బో, ఏమిటోగదా ఆ సాహస గాథ ! అంత థ్రిల్లింగ్‌గా వుంటుందా రాజేశ్వరీ ?" అన్నాను అమాయకంగా!

"తల్లిదండ్రులు కట్టిపెట్టిన యింట్లో వుంటూ, పల్లెలోనుంచీ వచ్చే గింజలు తింటూ, జీతంలో ఎక్కువ భాగం జల్సా ఖర్చులకే వాడుకునే మీబోటి వాళ్ళ కింతకు మించిన థ్రిల్లింగ్ యింకొక

టుండదు. అన్నట్టు శంకరం భార్యను నేను పోల్చుకున్నానని చెప్పాను గదండీ! ఆవిడ ఎవరోనని అడగరే ?"

— చెప్పింది రాజేశ్వరి.

రాజేశ్వరి తండ్రి పోస్టుమాష్టరుగా పనిచేశాడు. పిల్లి తన కూనల్ని నోట కరచుకుని పదిళ్ళు తిరిగినట్టుగా ఆయన తన ఉద్యోగ జీవితంలో పిల్లలకు పదింటికి మించిన ఊళ్ళే చూపించాడు. ఆయన పలమనేరులో వుండగా పోస్టాఫీసు కెదురుగా ఓ శిరస్తాదా రుండే వాడు. ఆ శిరస్తాదారుగారి మూడో అమ్మాయే రేవతి. రాజేశ్వరికంటే చిన్నది. ఈవిడ అయిదో తరగతిలో వుండగా, ఆమె రెండో తరగతి చదువు తుండేది.

"వట్టి అబ్బనాకారపు పిల్లలెండి ! వెర్రిబాగుల్ది గూడా ! చిన్నప్పటినుంచీ అంతే ! తాయిలం యిస్తానంటే అయిదు గుంజీలు తీసేది. మా యింట్లో మేము మా నాన్నగారిని పిలుస్తుంటే, తాను గూడా 'నాన్నా, నాన్నా' అంటూ సిద్ధమయ్యేది ఒకసారి 'ఏమయిందను కున్నారు..." గొల్లున నవ్వేస్తూ కొన సాగించింది రాజేశ్వరి. "వాళ్ళ నాన్న గారి గడ్డానికి సబ్బు పూసి మంగలి కత్తి చేతికి తీసుకున్నాడో లేదో, ఈ పిల్ల పెంకు లెగిరిపోయేటట్టుగా ఏడుస్తూ వీధి లోకి పారిపోయింది."

ఓ క్షణం ఆగి అడిగింది—"ఏమండీ ! చిత్రంగా లేదూ ?"

"ఏమిటి ? ఆ పిల్ల వీధిలోకి పారి పోవడమా?" అన్నాను.

"కాదండీ, యిన్నాళ్ళ కిన్నాళ్ళకు మేమిలా కలుసుకోడం ! తనవైపు తేరి పారజూస్తూ నేనేమో గుమ్మంలో నిల్చు న్నాను. చేటలో బియ్యం పోసుకుని రాళ్ళేరుతూ కూర్చుందేమో, అలికిడి వినిపించేసరికి తల పైకెత్తి నా వైపు చూస్తూ ఆ అమ్మాయి బొమ్మలా వుండి పోయింది. మొట్టమొదట నేనే తమా యించుకుని 'నువ్వు... నువ్వు...' అని మాత్రం అనగలిగాను. 'రాజేశ్వ రక్కయ్యవి గదూ...' అంటూ ఆ పిల్ల గాలిలా వచ్చి బిగ్గరగా నన్ను వాటేసు కుంది. 'ఎంత కాలానికి కనిపించావు రాజేశ్వరక్కయ్యా ! మీ రిక్కడేనా వుండడం ! మీ రున్నారని తెలిస్తే రెక్కలు గట్టుకొచ్చి వాలిపోయే దాన్ని...' అంటూ వుక్కిరి బిక్కిరై పోయింది."

"ఎలాగైతేనేం, బాల్య స్నేహితు రాళ్ళు కలుసుకున్నారు. ఏ పాటి సత్కారం లభించిందో చెప్పు..."

"ఏమండీ !" ఉల్లాస లక్షణాల నన్నింటినీ త్రోసిరాజని రాజేశ్వరి ముఖంలో తీవ్రమైన భావమేదో తొంగి చూసింది. "మీరు సినిమాల్ని ఎగతాళి చేస్తారు. రాజకీయాల్ని ఎగతాళి చేస్తారు. కవుల్ని కూడా ఎగతాళి చేస్తారు. అంతెందుకు, సాక్షాత్తు దేవుడు కూడా



మీ ఎగతాళినుంచీ తప్పించుకోడంలేదు. కానీ మనిషిగా పిలవబడే ప్రతి వ్యక్తి గుండెలు నీరైపోయేటట్టుగా కృంగి పోవలసింది దేన్ని చూసి? దరిద్రాన్ని చూచి. ఆ దరిద్రాన్ని మాత్రం ఎగతాళి చెయ్యనని మాట యిస్తేగానీ నేను చెప్పలేను. ఆ యింట్లో కాఫీ పెట్టి యివ్వడానికి గుక్కెడు పాలుగానీ, అందులో కలపడానికి చిటికెడు చక్కెర గానీ లేదంటే మీరు నమ్ముతారా?"

"అర్థమయిందిలే రాజేశ్వరీ! పెళ్ళాన్ని ఘోషాలో పెట్టడమే గాదు, ఇంటో నిప్పచ్చరంకూడా నెలకొల్పి వుంటాడు, నాకు తెలుసు. వాడాపాటి నిర్వాకం చేయగలవాడే!''

"ఏమండీ! నాకు తెలియక అడుగు తాను, డబ్బు దుబారా కాగల చెడు అలవాట్లేవైనా శంకరానికి కున్నాయా?"

ఈ సారి గొల్లున నవ్వే వంతు నాకు వచ్చింది. నవ్వి నవ్వి "అంత మంచి

ముఖానికి అర్ధశేరు కుంకుమ గూడానా రాజేశ్వరీ! వాడికిపోయి చెడు అలవాట్లా? ఆ మాత్రం ప్రయోజకత్వం గూడా ఏడ్చిందా మనిషిలో! అదేం లేదు వాడు తాంబూలం నమలడమైనా నేను చూడలేదనుకో!"

"మరైతే చేతికొచ్చే డబ్బంతా ఏమవుతుందంటారు?"

"ప్రపంచంలో సేవింగు స్కీమ్‌లెన్ని లేవు! పోస్టాఫీసులో వేస్తాడు. బ్యాంకులో కడతాడు. నిలవ చేసిన మొత్తాన్ని అంకెల రూపంలో చూచుకుంటూ ఆనందపరవశుడౌతాడు..."

"ఏమండీ! ఇదంతా మీ కెవరు చెప్పారు?"– క్రాసుపరీక్షలో పాయింటు దొరికిన న్యాయవాదిలా విరుచుకపడింది రాజేశ్వరి.

నేను గూడా వులిక్కిపడి, వీలయినంతలో జాగరూకుణ్ణిగా వుండటానికి ప్రయత్నిస్తూ, "ఇంకొక రెవరో వచ్చి చెబితేగానీ తెలియదా? నా కామాత్రం ఊహాశక్తి లేదేమిటి?" అన్నాను.

"ఒక గాడివెంట ఆలోచించుకోడానికి అలవాటు పడిపోయి యింకొక రకంగా ఊహించలేకపోవడం దగ్గరేనండీ చిక్కు వచ్చేది! నిలవ చెయ్యొచ్చు. దుబారా చెయ్యొచ్చు. ఈ రెండింటినీ మినహాయించి డబ్బును వినియోగించడానికింకొక మార్గమే లేదంటారా?"

నేను తెల్లబోయాను. ఈ కథ ఎక్కడ ప్రారంభమైదో నాకు తెలుసు. కానీ ఎక్కడికి వెళ్ళి తేలుతుందో నాకు అంతుపట్టడంలేదు. అంతకంతకూ దీన్నొక 'పజుల్'గా రూపొందించి మా ఆవిడ నన్ను ఆటపట్టిస్తున్న తీరు చూస్తుంటే నాకు చిరాకు ముంచుకొచ్చింది.

"ఫరవా లేదు. ఆలోచించుకునే చెప్పండి. వంటపను లన్నీ ముగించుకుని వచ్చేదాకా గడువిస్తున్నాను." అంటూ లోపలికి వెళ్ళిపోయింది.

సవాలు విసిరినట్టుగా మా ఆవిడ నన్నే ఆలోచించుకోమనడం నాకు మెత్తటి అవమానంలా తోచింది. అందుకని ఆ పనికిమాలిన విషయాన్ని గురించి బొత్తిగా ఆలోచించబోవడమే లేదని భీష్మించుకున్నాను. భోజన కార్యాన్ని కూడా మౌనంగానే పూర్తి కానిచ్చి, మళ్ళీ హాల్లోకి వెళ్ళి ఏదో వారపత్రిక చదువుకోసాగాను

అరగంటసేపటి తర్వాత "మాష్టరు గారికి కోపం వచ్చినట్టుంది" అని బిగ్గరగానే స్వగతం పలుక్కుంటూ హాల్లోకి వచ్చింది రాజేశ్వరి.

"నాకు కోపమా! ఎందుకూ?" ఆమె వైపు బిక్కరించి చుసాను.

"అదేనండీ శంకరం కథ! డబ్బు ఖర్చవుతున్న వైనం, దుబారానా, పొదుపా? లేక వేరే కారణమా? వగైరా వగైరా... మరచిపోయారా?"

"రాజేశ్వరీ! అది నువ్వే తయారు చేసిన పొడుపు కథ. చేతనైతే నువ్వే విప్పు. లేకపోతే వూరుకో! నేను చదువుకోవాలి..." పత్రిక తెరవబోయాను.

తాంబూలం డబ్బా నా చేత బెట్టి పత్రికను మెల్లగా తన చేతిలోకి లాక్కుంటూ అంది రాజేశ్వరి— "డాక్టరీ చదువుకుంటున్న తమ్ముడికి ప్రతి నెలా రెండు వందల దాకా పంపించుకోవలసి వస్తుందట! ఆ మధ్య ఎప్పుడో చెల్లెలి పెళ్ళికోసం ప్రావిడెంటుఫండు నుంచి తీసుకున్న అప్పుకోసం జీతంలో యాభై రూపాయలు పట్టుకుంటారట - ఏమండీ, వింటున్నారా ?"

ఈ వర్తమానం తాకిడికి నేను దంగైపోతానని ఎదురుచూసిందేమో రాజేశ్వరి, అదేం జరగలేదు సరిగదా— నాలో ఎంతో కొంత ఆగ్రహమే పరవళ్ళు త్రొక్కింది.

"నీకు తెలియదా రాజేశ్వరీ! దీని పేరే 'త్యాగం'. సినిమాల్లోనూ, పుస్తకాల్లోనూ దీన్ని గురించి బోలెడంత ఇన్ఫర్మేషన్ దొరుకుతుంది," అన్నాను

"అంతేగానీ నిత్యజీవితంలో దీనికి చోటు లేదంటారు, అవునా ?"

"నీ సెంటిమెంట్సును తీసుకొచ్చి నా తలపైన పులమొద్దు రాజేశ్వరీ! ఎందు కొచ్చిన త్యాగం? మురికి కొంపలో కాపురమాయె! తాను వేసుకోడానికి మూడోజత బట్టలు లేకపోయె! అతిథి యింటికొస్తే కాఫీచేసి యివ్వడానికైనా దారి దొరక్కపోయె! అంతెందుకు, తన కెన్ని చీరలున్నాయో నువ్వే నీ స్నేహితురాల్ని అడిగివుండవల్సింది..."

"అడిగాను లెండి! కట్టు విడుపు చీరలు రెండో మూడో వున్నాయట! ఏ ఆషాడానికో, అమావాస్యకో సినిమాకు వెళ్ళే అవకాశం దొరికితే పెళ్ళినాటి ముహూర్తం చీర కట్టుకుని వెళ్తుందట!"

"పోనీ ఆ చీరే కట్టుకుని మనింట్లో పేరంటాని కొచ్చి వుండొచ్చుగా! ఎందుకు రాలేదో అడిగావా ?"

"చెప్పింది. వాళ్ళ నాన్నగారు రేవతికి వేసిన ఆరు తులాల గొలుసును శంకరం తన చెల్లెలి కిచ్చేశాడట! ఆ నగ పెడితేగానీ చెల్లెలికి పెళ్ళయ్యేటట్టు లేదు! ఏం చేస్తాడు?... పాపం, ఆ అమ్మాయి జోసిమెడతో సాటి ఆడవాళ్ల లోకి ఎలా వస్తుందండీ?"

"నా మాట గూడా కాస్త వింటావా రాజేశ్వరీ! తనకు మించిన ధర్మాల జోలికి వెళ్లనే గూడదు. వెళ్ళావో, అందువల్ల ఎదురయ్యే కష్టనష్టాల్ని నువ్వే భరించాలి. అంతేగాని, నిన్ను కట్టుకున్న నేరానికి నీ పెళ్ళాన్ని జీవచ్ఛవంలా బ్రతకమనే అధికారం నీ కెవడిచ్చాడు చెప్పు!"

"ఇంత ఘాటుగా కాకపోయినా నేనూ అదే మాట చెప్పాను. రేవతి

ఏమందో తెలుసా ? 'పోనీరే అక్కయ్యా! నగలు ముఖ్యమా, బాధ్యతలు ముఖ్యమా ? మంచి రోజులొస్తే మా నగలు మేమే చేయించుకుంటాం?' అంటూ ఆ పిల్ల నన్నే ఓదార్చబోయింది..."

"వరుసగా రాసిపెట్టుకుంటే ఆ మాటలు సినిమాలో డైలాగులుగా వాడు కోడానికి పనికొస్తాయి." అంటూ ఆ ప్రసంగాన్ని నే నంతటితో త్రుంచి పారేశాను.

మరునాటి ఉదయం ఆఫీసుకు వెళ్లినా పది గంటలకు సరిగ్గా లోపలికి వస్తూ శంకరం కనిపించాడు. నా ప్రయత్నాని కతీతంగా శంకరపట్ల నాలోని నిరసన భావం తగ్గి వుంటే అందుకు నేనేం చేయ గలను ? అతడు దగ్గరి కొచ్చేసరికి 'ఏమోయ్ శంకరం! ఏమిటి విశేషాలు!' అని పలకరించి, అంతపనీ జరిగి పోయి నందుకు నాకో నేనే ఆశ్చర్యపడి పోయాను.

శంకరం కూడా కాస్త తొట్రుపాటు తోనే నా బల్లదగ్గర ఆగి, 'విశేషాలే మున్నాయండీ ! అంతా మామూలే !' అని, అంతలో అసలు విషయం జ్ఞప్తికి వచినట్లయి 'అన్నట్టు వదినగారు నిన్న మా యింటి కొచ్చారట కదూ ! చిన్న ప్పుడు వీళ్ళు ఎదురెదురు ఇళ్ళలోనే వుండేవారట ! మా రేవతి ఆనందానికి పట్టపగ్గా ల్లేవనుకోండి !" అన్నాడు.

ఎలాగైతేనేం, వరుసలు కలిశాయి. రాకపోకలు కూడా ప్రారంభమయ్యే టట్టున్నాయి. శంకరం ఈ మాత్రంగా నైనా ఒక్కింత సంఘజీవిగామారాడంటే, యిదంతా రాజేశ్వరి చలవ ! ఆమెకు అభినందనలు చెప్పదలుచుకున్నాను.—

సాయంకాలం యింటికి వెళ్ళేసరికి రేవతి చంటిబిడ్డ నెత్తుకుని మా యింటికి వచ్చి వెళ్ళిన విషయం రాజేశ్వరి నా చెవిలో వేసింది.

ఒక వస్తువుపట్ల గానివ్వు, మనిషి పట్ల గానివ్వు మన దృక్పథంలో మార్పంటూ వచ్చిన తర్వాత, ఆ మారిన దృక్పథానికి అనుగుణ్యంగా మన ప్రవర్తన గూడా తనంత టదే మారిపోతుంది కాబోలు ననిపిస్తుంది. హేళనకు బదులుగా శంకరంపట్ల నాలో జాలిలాంటి భావమేదో చోటు చేసుకుంటున్నదేమోనని నేను ఆత్మ పరిశీలన చేసుకున్నాను. అంతరంగం మాట ఏమిటోగానీ, బాహ్యప్రవర్తనకు సంబంధించి నేను శంకరాన్ని ఎగతాళి పట్టించడం మట్టుకు మానుకున్నట్టే ఉన్నాను. ఎవరైనా అతణ్ణి గురించి తేలికగా మాట్లాడుతుంటే దూరంగా గూడా వెళ్ళిపోతున్నాను.

మొత్తానికి యితడు మన అంచనాకు సరిపడివచ్చే మానవుడు కాదని తెలిసి పోవడంతో ఆఫీసుకుమాత్రమే పరిమిత మైన మా సహజీవనంలో శంకరాని కివ్వదగినంత గౌరవం అతడి కిచ్చి,

నేను పుచ్చుకోవలసినంత గౌరవం నేను పుచ్చుకోడానికి అలవాటుపడ్డాను.

నెలలూ, సంవత్సరాలూ గడచి పోతున్నాయి

"ఇంకొక సంవత్సరంలో మా తమ్ముడి కోర్సు పూర్తయిపోతుం దండీ !" అన్నాడు శంకరం.

ఆ సంవత్సరం గడిచేలోగానే శంకరానికి మా ఊరినుంచి ట్రాన్స్ఫరు వచ్చింది.

చెప్పడం మరిచాను. ట్రాన్స్ఫర్ కావడానికి మూడు మాసాల క్రితం ఒకనాటి సాయంకాలం ఏడుగంట లప్పుడు శంకరం నాకు బజారులో తారసిల్లాడు. మామూలుగానే పలకరించ బోయి, అతణ్ణి వెన్నంటి ఉన్న యింకొక వ్యక్తిని చూసి, నేను యించుమించు నిర్ఘాంతపడిపోయాను. శంకరం ఎంత ఎత్తున్నాడో అతడున్నూ అంతే ఎత్తున్నాడు. నడిచే పద్ధతిలో, నడుస్తుండగా చేతులు కదిలే తీరులో, ముఖకవళికల్లో అన్నింటా అచ్చుగుద్ది నట్టుగా అతడిలో శంకరం పోలికలే కానవస్తున్నాయి. భేదమంటే పదిహేను రోజులపాటు శంకరం జబ్బుపడి లేస్తే ఎలా ఉంటాడో అలా కొంచెం బక్క పలచగా, నీరసంగా ఉన్నాడు. మరొక ముఖ్యమైన తేడా, అతడి క్రాపింగు బాగా పలచబడి, తెల్లబారిపోయి ఉండడం! షర్తుంగా ముఖం గీక్కుని ఉండడంవల్ల తెలియడంలేదు గానీ, బహుశా అతడి మీసాలు గూడా నెరిసి పోయే ఉండొచ్చు...

కొత్తవ్యక్తి సముఖంలో ఉండగానే 'ఇత డెవరు ?' అని శంకరాన్ని అడగ డానికి నా సంస్కారం నాకు అడ్డు పడింది. ఇలాంటి సందర్భాల్లో కొత్త మనిషిని పాతస్నేహితుడు పరిచయం చేసిపెట్టడం సహజమైన లోకవ్యవ హారం. కానీ శంకరానికి ఆపాటి యింగిత జ్ఞానం లేనట్టే తేలిపోయింది. ముక్త సరిగా ఒకటి రెండు మాటలు మాట్లాడి అతడు జనసమూహంలో కలిసిపోయాడు.

మరునాడు ఆఫీసులో అడిగితే చెప్పాడు శంకరం— "మీరు భలేవారండీ శేఖరంగారూ! ఆయ నెవరో గాదు మా నాన్నగారు !"

ఆశ్చర్యాతిరేకంలో నేను విభ్రమ బిగుసుకపోయాను. శంకరంలాంటి నడితరం యువకులకు తల్లిదండ్రు లుండడంలో అబ్బురమేమీలేదు కానీ యిన్నాళ్ళుగా శంకరం తండ్రి సజీవుడుగా ఉన్నాడని నాకు తెలియక పోవడమే విచిత్రం. 'లేదు' అని శంకరం చెప్పలేదనుకోండి! కానీ ఉన్నట్టుగా రవంత ప్రస్తావన అయినా ఎందుకు రాకపోవాలి ? పెద్దన్నయ్యే తండ్రితో సమానమంటారు. కానీ అదెప్పుడు ? తండ్రి లేనప్పుడు తండ్రి

బ్రతికుండగా కొడుకు తనొక్కడే నిస్సహాయంగా కుటుంబభారమంతా మోయవలసి రాదుగదా !

నా మాటల్లో నేను చూచాయగా యిదే భావాన్ని వెల్లడించానేమో, ఇలాంటి సందేహాన్ని మొదటిసారిగా వింటున్నట్టు శంకరం అయోమయంగా నావైపు చూసాడు.

"మా అమ్మ పోయి పదిహేనేళ్ళయింది గదండీ శేఖరంగారూ, ఆ తరువాత ఏడెనిమిదేళ్ళకే మా నాన్నగారు రిటైరయిపోయారు. ఆయన చేసింది సమితిలో ఆర్. యం. పి ఉద్యోగం. ఆయన సంపాదన అప్పటి కప్పుడే సరిపోతూ వచ్చింది. తాను గూడా ఓ అదనపు భారంగా ఉండడ మెందుకని ఆయన రిటైరయ్యాక గూడా పల్లెలోనే ఉండిపోయారు. కొద్దిగా ఓ మోస్తరు ప్రాక్టీసుగూడా జరుగుతోందట లెండి..."

ఈ సరికొత్త వర్తమానం విని రాజేశ్వరి గూడా నోరు తెరిచేసింది. "అయినా వీళ్లేం మనుషులండీ బాబూ ! ఆ రేవతి గూడా తన మామగారిని గురించి ఒక్క మాటయినా చెప్పింది కాదే !" అంటూ విస్తుపోయింది.

"అంతేలే ! గడన ఉడిగిన తర్వాత అయినవాళ్లు గూడా మనిషిని మనిషి క్రింద లెక్కగట్టరు ..." అంటూ చటుక్కున రాజేశ్వరి ముఖంలోకి చూసి వెంటనే నాలుక కొరుక్కున్నాను. ఆమె నా మాటల్లో ఏదో పొరబాటును శంకిస్తున్నట్టు తోచింది.

శంకరానికి వచ్చిన బదిలీ వట్టి బదిలీగా గాకుండా ఒక మెట్టు ప్రమోషనుగా గూడా వచ్చింది. సర్వీసులో సీనియారిటీ కలిగినవాళ్ళెందరో ఉండగా శంకరానికి ప్రమోషన్ రావడం గురించి సహోద్యోగుల మధ్య తర్జన భర్జన చాలా జరిగింది. తేలిన విషయాన్ని బట్టి చూస్తే అతనికి ప్రమోషన్ రావడంలో విడ్డూరమని చెప్పుకోదగ్గదేదీ కనిపించింది గాదు. అత డెప్పుడో అయిదారేళ్ళ క్రిందటే డిపార్ట్‌మెంటల్ పరీక్షలన్నీ పాసై ఉన్నాడు

ఆఫీసులో శంకరానికి చిన్న టీ పార్టీతో వీడ్కోలు ముగిసింది. అతణ్ణి గురించి వరుసగా నాలుగు మంచి మాటలు స్ఫురించకపోవడంవల్లనైతేనేమి స్ఫురించినా వాటిని వల్లించే ఓపరికం లేకపోవడంవల్లనైతేనేమి, ఆ సందర్భాల్లో ప్రసంగాల కార్యక్రమం ఆపివేయబడింది. సాగనంపడానికి నేనూ, రాజేశ్వరి మాత్రం స్టేషనుకు వెళ్ళాము. "రాజేశ్వరక్కయ్యా ! మమ్మల్ని మరిచిపోవుగదూ ?" అంటూ రేవతి మావైపు దీనంగా చూసింది. ఈ వెర్రిబాగుల అమ్మాయి ఈ లోకంలో ఎలా బ్రతుకుతుందోగదా అనిపించి నా కళ్లు చెమ్మగిల్లిపోయాయి.



రాజేశ్వరి తన స్నేహితురాలి చెయ్యి గట్టిగా నొక్కిపట్టి, ఆ స్పర్శతోనే ఆత్మవిశ్వాసాన్ని సరఫరా చేసినట్టుగా, "నీకేం భయంలేదులేవే రేవతీ ! ఇంకా నువ్వే మమ్మల్ని మరిచిపోతావేమో ! భగవంతుడనే వాడుంటే గింటేమనిషి లోని మంచితనంలోనే ఉన్నాడు." అంది.

ఒకదాని కొకటి సంబంధం లేకుండా రాజేశ్వరి చెప్పిన మూడు వాక్యాలనే మననం చేసుకుంటూ ఉండగా రైలు కదిలింది.

శంకరం బదిలీఅయిపోయిన తర్వాత మూడు మాసాల కొకనాడు ఆఫీసు జవాను జకరయ్య నా దగ్గరికొచ్చి "బాబుగారూ ! శంకరం జాబు వ్రాశాడండీ ! బియ్యే ప్యాసయ్యాడట ! శేఖరంగారికి చెప్పవలసిందని వ్రాశాడు" అన్నాడు.

"పోనీలే ! శుభవార్త నీకైనా

తెలిపాడు. సంతోషం" అని, అంతలోనే పరధ్యానంనుంచి తేరుకుంటూ "అన్నట్టు జకరయ్యా! శంకరం బియ్యేకి కట్టడమూ, చదవడమూ, పాసుకావడమూ గూడా అయిపోయిందా? నాకా వివరాలేవీ తెలియదే!" అన్నాను.

"పరీక్ష ఫీజు కట్టాలంటే నూటికి రెండురూపాయల రేటుతో రెండువందల రూపాయలు అప్పు యిప్పించాను. ఆ డబ్బు తిప్పిపంపుతూ కూపనులో నాలుగు మాటలు వ్రాశాడు. పరీక్షకు డబ్బు కట్టడంతో ఏమయింది గానీండి, ఆ మానవుడికి చదువుకోడం దగ్గరే పెద్ద ఇబ్బంది వచ్చింది. అగ్గిపెట్టెల మేడలో తొమ్మిదింటికి తర్వాత లైటు వేసుకోనివ్వరు. శంకరం పార్కులో కూచుని చదువుకునేవాడు..."

శంకరాన్ని గురించి నా కెన్నో విషయాలు తెలిసినట్టే ఉండేవి అయితే సరిక్రొత్తగా ఒక విషయం తెలిసొచ్చేటప్పటికి పాత అభిప్రాయాలను మార్చుకోవలసి వచ్చేది. లేదా సవరించుకోవలసి వచ్చేది.

అయితే శంకరం బియ్యే పరీక్ష కోసం పార్కు దీపం క్రింద చదువుకున్నాడా?

* * *

శంకరం మా ఊరినుండి వెళ్ళిపోయి పదిహేనేళ్ళయింది. సేవ, త్యాగం, ఆదర్శం మొదలైన భావాలు క్రమ్ముకున్నప్పు డెప్పుడైనా అతడు మనసులో మెదలడం కద్దు. కానీ కొన్ని కొన్ని మంచి పదాల అంతరార్థం కాలక్రమాన మారిపోతూ రావడం గమనిస్తే ఆశ్చర్యంగానే ఉంటుంది. 'ఓహో, అతనా! చాలా పెద్దమనిషి లెండి!' అని ఎవరైనా అంటే, మనం వెంటనే ఆతణ్ణి దగుల్బాజీ అనుకుంటాము. ఆ యీ కారణంవల్ల శంకరాన్ని గొప్ప చేసి చెప్పుకోడానికి నేను వెనుకాడే వాణ్ణి. శంకరాన్ని నేను బుద్ధుణ్ణిగా చిత్రించాను. నిరోగ్యగిగా ప్రచారం చేశాను. అందుకు విభిన్నంగా అతణ్ణి గురించి మరొక విధంగా చెప్పుకోవాలంటే మాత్రం నా గొంతుకలో వెలక్కాయపడ్డట్టే ఉండేది...

మసిబారిన అద్దంలో ప్రతిబింబం సజావుగా కనిపించకపోతే అది వస్తువు యొక్క దోషం ఎలాగవుతుంది? ఒక వ్యక్తిని గురించి మనమేమనుకుంటామో, ఎలా చిత్రించడానికి ప్రయత్నిస్తామో వాటి మూలంగా మన వ్యక్తిత్వం మాత్రమే విశదమవుతుంది. అందువల్ల గడచిన పదిహేనేళ్ళలో శంకరాన్ని గురించి నాకు తెలిసొచ్చిన ఒకటి రెండు విషయాలను మాత్రమే ఉటంకించి అంతటితో ఈ కథ ముగిస్తాను

తండ్రి తానే వృత్తిలోనైతే

ఉన్నాడో అదే వృత్తిలో కుమారుణ్ణి గూడా ప్రవేశపెట్టాలనుకోడం మన దేశంలో రివాజు. ఆ సాంప్రదాయం మేరకు మా బావమరిది గూడా తన తండ్రిగారిలాగే పోస్టలుడిపార్టుమెంటులో ప్రవేశించాడు. ఎక్కడెక్కడో దూర ప్రాంతాల్లో ఉద్యోగం చేస్తూ ఉండి అతడు కురబలకోటకు వచ్చి పోస్ట్ మాష్టరుగా ఛార్జీ తీసుకున్న క్రొత్తలో నే నొకసారి ఆ ఊరికి వెళ్ళడం తటస్థించింది. వెళ్ళిననాటి సాయంకాలకి మా బావమరిదితో కలిసి నేను ఊరిబయటికి వెళ్ళి తిరిగొస్తుండగా మసక చీకటివేళ బజారులో మరొకవ్యక్తి ఎదురయ్యాడు. అతణ్ణి చూచిన క్షణంలో నేను 'ఏమిట్రా యిది? శంకరం యిక్కడున్నాడా ?' అనుకుంటూ తెల్లబోయాను. మరుక్షణంలో 'అబ్బే, శంకరం యింత ముసలివాడు గావడం ఎలా సంభవ'మని నాలో నేనే వితర్కించుకున్నాను. తరువాత కొద్ది క్షణాలకు అతడు శంకరం నాన్నగారని చటుక్కున స్ఫురించింది

మా బావమరిది ద్వారా అతణ్ణి గురించి కొంచెం భోగట్టా లభించింది గూడా !

"ఎవడు బావా ? డొక్కు డబ్బాలాంటి ఆ ముసలాయన్ను గురించేనా నువ్వడిగేది ? ఈ ఊరికి నేను కొత్తయినా అతడేమో నాకు పాత కాతే, ఆఫీసుకు తరచుగా వస్తుంటాడు గనుక! పేరు సత్తిరాజు. అయితే యిక్కడి జనం అతడికి పెట్టిన ముద్దుపేరేమిటో తెలుసా? అరవై యేళ్ళ బాలాకుమారుడు ? ముసలి శరీరంలో పడుచు బుద్ధులు కనిపిస్తుంటే, అలా వ్యవహరించా లనిపించడం న్యాయమేగదూ ! కాకపోతే రిటైరు కావడానికి ఏడెనిమిదేళ్లు మాత్రమే ఉందనగా ఇతడు తగుదునమ్మా అని పెళ్ళికి సిద్ధమౌతాడా ! ఏం మనిషోలే బాబూ, యితని కిప్పుడు ఎలిమెంటరీ స్కూలుకు వెళ్లే పసివాడి దగ్గరనుంచీ పాలు త్రాగే చంటిపాపదాకా నలుగురు బిడ్డలున్నారు..."

నాకు నవ్వొచ్చింది. మా బావమరిది ఒకరిని గురించి చెప్పబోయి, ఇంకొకరిని గురించి చెబుతున్నాడేమో ననిపించింది. "చాల్లేవోయ్! ముసలాయన్ను పట్టుకుని బాగానే వసంతా లాడుతున్నావులే ! నాకు తెలియదనుకుంటున్నావేమో ! ఈ ఈ సత్తిరాజు కొడుకు శంకరం నాలుగైదేళ్ళపాటు నాతో కలిసి మా ఆఫీసులో పనిచేశాడు. ఈయన భార్య ఏనాడో చనిపోయింది" అన్నాను.

"అయ్యా ! భార్య చనిపోయి ఉండొచ్చు. ఆ చనిపోయిన భార్యకు నలుగురైదుగురు బిడ్డలు గూడా ఉండొచ్చు. అంతమాత్రాన మొదటి భార్య పోయాక సత్తిరాజు రెండో పెళ్ళి

చేసుకున్నాడన్న నా స్టేట్‌మెంట్ తప్పెలా అవుతుంది ? నీకు తెలిసింది సగం నిజంమాత్రమే ! మిగిలిన సగం నే నిప్పుడు చెప్పింది. నువ్వు పూర్తి నిజాన్ని గుర్తించడానికి నిరాకరిస్తే నేనేం చెయ్యగలను ?" అన్నాడు మా బావమరిది.

ఒంటిలో బలమూ, చేతిలో డబ్బూ వుండితీరాలన్న పట్టింపు కూడా లేదు— మగవాడు ఎన్ని పెళ్ళిళ్లయినా చేసుకో డానికి మన సమాజం అంగీకరిస్తుంది. అందులోనూ మొదటిభార్య చనిపోయింది కనుక సత్తిరాజు రెండో పెళ్ళి చేసు కున్నందుకు అభ్యంతరపెట్టే హక్కు మనకు లేదు. అయితే తన మొదటి సంబంధం బిడ్డల జీవితం సాఫీగా గడచిపోవడానికని అతడు వాళ్ల కేదైనా చూపించినాడా లేదా అన్నది వేరే విషయం. ఎవళ్ళ రాతకొద్దీ వాళ్ళు పోతారని భావించి వుండొచ్చు. పుట్టించిన వాడు 'పూరి' వేయకపోడని ఆశించి వుండొచ్చు. కొందరికి తమ అవసరాలు తీరడమే ముఖ్యం. దుస్తులన్నీ వూడదీసి అవతలికి గిరవాటుపెట్టి, బహిరంగ స్థలాల్లో నిద్రపోయే హిప్పీలకు మల్లే వాళ్లు తమ బాధ్యతల్ని గాలికి వదిలెయ్య గలరు !

సత్తిరాజుపట్ల నాలో ఆగ్రహం పరవళ్ళు దొక్కింది. నేనే గనుక శంకరం స్థానంలో వున్నట్టయితే 'నాకు తండ్రి లేనేలేడు. ఏనాడో చనిపోయా' డని చెప్పుకోడానికి వెనుదీసి వుండను.

పై సంఘటన జరిగిన తర్వాత తొమ్మిదేళ్లకుగానీ నేను శంకరాన్ని కలుసుకోలేకపోయాను. ఆఫీసు పనిపైన హైదరాబాదు వెళ్లవలసి వచ్చింది. 'ఏమోయ్ శంకరం ! బాగున్నావా ?' అంటూ యిప్పుడతని భుజంపైన చెయ్యి వేయడానికి వీలుండదని నాకు తెలుసు. నాపేరు వ్రాసిన చీటీని జవాను చేతికిచ్చి దాన్ని డిప్యూటీ డైరెక్టరుగారికి అంద జేయమన్నాను. చీటీ అందుకోడమే తడవుగా శంకరం వెయిటింగు రూంలోకి పరుగెత్తుకొచ్చేశాడు. "ఎంత కాలాని కండీ శేఖరంగారూ ! బాగున్నారా ? వదినగారు కులాసానా ? సకుటుంబంగా రాలేకపోయారా?" అంటూ ప్రారంభించి ముందుగా ఏ ప్రశ్నకు జవాబు చెప్పుకో వాలో తోచకుండా నన్ను వుక్కిరి బిక్కిరి చేసేశాడు. కుశలప్రశ్న లన్నీ సాంగోపాంగంగా పూర్తయ్యాక నేను ఆఫీసు వ్యవహారం ప్రస్తావించబోయే సరికి, "అబ్బే, అదంతా నిదానంగా చూసుకుందాం లెండి శేఖరంగారూ ! మీరు యింటి కెళ్లండి. స్నానం కానిచ్చి భోజనంచేసి 'రెస్ట్' తీసుకోండి !' అంటూ నన్ను బలవంతంగా తీసుకొచ్చి టాక్సీలో కూర్చోబెట్టాడు. టాక్సీ కదల బోతుండగా "డ్రయివరు నాకు తెలిసిన వాడే లెండీ శేఖరంగారూ ? మీరు

దబ్బిచ్చినా పుచ్చుకోడు" అంటూ హెచ్చరించాడు,

ఎండల కడ్డంపడి దూసుకుంటూ, విసవిసలాడుతున్న వడగాడ్పుల్ని తోసుకుంటూ టాక్సీ వెళ్ళి వెళ్ళి పచ్చిక జొంపాలతో, పూల మొక్కలతో, పొద రిళ్ళతో పరివేష్టిత మైవున్న ఓ చిన్న మేడ ముంగిట నిలిచింది.

మండు టెండలలోనుంచీ చల్లటి నీడ పట్టులోకి వచ్చేసరికి ప్రాణాలకు హాయని పించింది. అయితే ఆ చల్లదనంకూడా యింటి యిల్లాలి ఆదరణముందు వెల వెల పోవచ్చునని నేననుకోలేదు.

"బావగారూ! మీరా! అక్కయ్యేదీ?"

"రాలేదమ్మా! నే నొక్కణ్ణే వచ్చా" నన్నాను.

"అతేలెండి ! మీకు మే మెవరిమి ? నే నైతే మిమ్మల్ని తలుచుకోని రోజు లేదు. 'ఏమండీ ! వెళ్ళి అక్కయ్యా వాళ్లని చూసొద్దామండీ అని నేనంటే, ఏవో పను లున్నాయంటూ' ఈయన నా మాట వినిపించుకోరు. మీరైనా అంతే! లేకపోతే రాకరాక యింత కాలానికొస్తూ అక్కయ్యని తీసుకరాకుండా వస్తారా ?"

"పొరబాటయి పో యిం ద మ్మా ! ఇంకొకసారి వచ్చినప్పుడు తప్పకుండా మీ అక్కయ్యని తీసుకొస్తా"నని చెప్పు కోడం తప్పితే గత్యంతరం లేక పోయింది.

బాయిలర్ నిండుకు కాగిన నీళ్లను పెద్దఅండాలోకి తోడింది రేవతి. బడలిక తీరా స్నానంచేసి, సుష్టుగా భోజనం చేసేసరికి గాఢంగా నిద్రపట్టింది.

నేను నిద్రపోతుండగానే ఆఫీసు నుంచీ వచ్చిన శంకరం టిఫిన్ చెయ్య మని భార్యకు పురమాయించి, ఆ పనిలో ఆమెకు సాయపడుతూ వంట గదిలోనే కూర్చున్నాడు. ఉపాహారం తీసుకున్నాక "అలా బయటికి వెళ్ళొద్దా మటండీ శేఖరంగారూ !" అన్నాడు. ఆ వీధీ, ఈ వీధీ తిప్పి ఆఖరు కతడొక సినిమా థియేటరువైపు దారి తీసేసరికి నేను టిక్కమొఖం పెట్టేశాను. "మరైతే మీకు సినిమాలంటే యిష్టం గదండీ శేఖరంగారూ ! నేనూరికే మీకు కంపెనీ వుండడంకోసం వస్తున్నాను" అన్నాడు.

మరునాడు నే నెందుకోసమైతే హైదరాబాదు వెళ్ళానో ఆ ఆఫీసు పని పూర్తయింది.

మూడోనాటి సాయంకాలం అయిదు గంటల బస్సులో శంకరం నాకు సీటు రిజర్వు చేయించాడు. బస్సుస్టాండుకు వచ్చి సాగనంపేవాడే. డైరెక్టరుగారి వెంట మంత్రిగారి కాన్ఫరెన్సుకు వెళ్ల వలసి రావటంతో అందుకు వీల్లేక పోయింది.

మధ్యాహ్నం భోజనమైన తర్వాత వసారాలో వేసిన వాలుకుర్చీలో కూర్చున్నాను.

కాసేపు పడుకుని లేవమని చెప్పింది

రేవతి. అసలే నాది మొద్దునిద్ర. సకాలంలో బస్‌స్టాండుకు చేరుకునే ఉద్దేశంతో నిద్రాకార్యక్రమం రద్దు చేసుకున్నాను.

గడిచిన రెండు రోజులనుంచీ ఒక ప్రశ్న నా గొంతుకలో కొట్టుమిట్టాడి పోతోంది. దాన్ని బయటపెట్టడానికి యింతకంటే తగిన సమయం వుండదని పించింది.

హాల్లోకి చూస్తూ "మీ మామగారు బాగున్నారటమ్మా ?" అన్నాను.

"అయ్యో, ఆయన పోయి అయిదేళ్ల యింది గదండీ..."

అనుబంధంగా యింకొక ప్రశ్న ఏదో అడగదలుచుకుని వెనుదిరిగి చూసే సరికి ఆమె హాల్లో లేదు.

గంట మూడున్నర కావస్తోంది.

ఇంక లేచి, ముఖం కడుక్కుని. ఆటో తెప్పించుకుని, దారిలో పళ్ళూ, బిస్కట్లు లాంటి వేమైనా కొనుక్కుని...

కిర్రుమంటూ గేటు తెరుచుకుంది. పోస్ట్‌మేన్ లోపలికి వచ్చి సాయంకాలపు టపా నా చేతి కిచ్చి పోయాడు.

ఇతరుల ఉత్తరాలను చదివేపాటి కుసంస్కారం నాకు లేదు. అయినా ఉత్తరాల మధ్య కానఃచ్చిన ఓ కాగితం ముక్క నా దృష్టిని ఆకర్షించింది. అది డబ్బు ముట్టినందుకు గుర్తుగా తిరిగి వచ్చే యం ఓ. రసీదు.

పంపిన మొత్తమెంతో చూసాను. ఇంత మొత్తం ఎవరికి పంపినట్టా అని వితర్కించుకుంటూ వుండగా, క్రింది భాగాన తెలుగక్షరాలతో 'సరసమ్మ' అన్న సంతకం కనిపించింది. ఎవరీ సరసమ్మ ? చిరునామాలో వివరణ లభించింది. 'సరసమ్మ — లేట్ సత్తిరాజు గారి భార్య.'

చివురించే అనుభవం ఎలా వుంటుందో మోడుకు తెలియకపోవచ్చు.

కరిగి నీరై పారే అనుభవం ఎలా వుంటుందో రాతికి తెలియకపోవచ్చు.

నేను మనిషిని గనుక ఊహిస్తు న్నాను. మోడునై వుంటే ఆ క్షణాన చిగురించి వుండేవాణ్ణి. రాయినై వుంటే ఆ క్షణాన కరిగి నీరై ప్రవహించి వుండేవాణ్ణి.

ఎల్ల లెరుగని మంచితనం కూడా ఒక బలహీనత కావచ్చు. కానీ దాని ఎదుట తలవంచి మొక్కడం మినహాగా మరొక్క భావన కల్గడానికి ఆస్కారం లేదనిపిస్తుంది.

భగవంతుణ్ణి ఎవరు చూసారు ?





# విచక్షణ

ముద్దంశెట్టి హనుమంతరావు

వెంకట్రామయ్య వాలుకుర్చీలో చేరబడి, చుట్ట కాలుస్తున్నాడు. అతని మెదడులో చీకటి ఆలోచన లేవో సాగుతున్నాయని, నుదురు, కనుబొమలు ముడుచుకుపోయిన తీరు చూస్తేనే తెలిసిపోతుంది.

వెంకట్రామయ్యకి యెదురుగా నిల్చున్న గంగులు, బిగుతుగా పంచె

కట్టి, లాండోబనియన్‌తో వస్తాదులా అగుపిస్తున్నాడు. అతడి మొహంలోనూ, కళ్ళల్లోనూ, కాస్తంత క్రూరత్వం కనిపిస్తుంది. అందుకేనేమో, గంగుల్ని తనకి ఆంతరంగిక వ్యక్తిగా పెట్టుకున్నాడు, వెంకట్రామయ్య.

"గంగులూ ... '' గంభీరంగా అన్నాడు, వెంకట్రామయ్య.

"బాబూ..." సవినయంగా చేతులు కట్టుకుని అన్నాడు, గంగులు

"మా రామ్మూర్తి యేంజేశాడో తెల్సుకదూ నీకు ?"

"తెలవకేం బాబూ ? ఇన్నేళ్ళు తవఁరి దగ్గిర పెరిగి పెద్దోరై, ఇప్పుడు యిడిగా యెల్లిపోడం, యేం సబబుగా నేదు బాబూ !"

వెంకట్రామయ్య గంగులుకేసిచూసి, ఆదోలాంటి నవ్వు నవ్వేడు.

"ఔనా మరి ? నీకున్నపాటి జ్ఞానం, వాడికి లేకపోయిందిరా; వాళ్ళనాన్నగారి ఆస్తిని నేను కాజేశానని అంటున్నాడు బడుద్దాయి. వాళ్ళ నాన్నా, అమ్మా పోయాక, వాణ్ణి చేరదీసి, యిన్నేళ్ళు పెంచి, పెద్దచేసిన నా మంచితనాన్ని, నా విశాలహృదయాన్ని మర్చిపోయి, యిప్పుడు నన్నే నిందిస్తున్నాడు. అటువంటి కృతఘ్నుణ్ణి యేంజేస్తే పాపం చెప్పు ?"

"ఆ బాబుగారు అలా అనడం నేయంగా నేదండీ ! ఎంతయినా సిన్నాన్నగోరు తవఁరు. తవఁరుమాత్రం ఆ బాబుగారి బాగోగులు సూడ్రాయేటి ? ... ఆ బాబుగారి తెలివితక్కువ తనంగాని..."

"వాడది అర్థంచేసుకోలేదురా ! పైగా, నామీద కత్తిగట్టాడు. నన్ను రచ్చకీడ్చి, అవమానపరుస్తాడట ... వాడి కెంత పొగరో చూడు. వాడికి చేసిన సహాయంలో పదోవంతు నీలాంటి వాడికి చేసి ఉంటే, జన్మజన్మలకి మర్చిపోయేవాడివి కాదు..."

"ఇప్పుడైనా తవఁర్ని మర్సిపోతానేటి బాబూ ?" సవినయంగా చేతులు నులుము కుంటూ అన్నాడు, గంగులు.

"ఔననుకో. అందుకే, యిప్పు డను కుంటున్నాన్రా ... ఇంకెవరికయినా సహాయం చేసేముందు, నిన్ను బాగు పర్చాలని; నీకో అంతస్తు తీసుకు రావాలని."

వెంకట్రామయ్య మాటలకి, మురిసి పోయాడు గంగులు.

"తవఁరి దయుంటే సాలు బాబూ ! తవఁరి పాదాలదగ్గర బతుకుతునోణ్ణి." కృతజ్ఞతాపూర్వకంగా అన్నాడు.

"నీకున్నపాటి ఆప్యాయత, నాయం దుండే గౌరవమూ, మా రామ్మూర్తికి లేకపోయిందిరా ! అందుకే, వాడిమీద కసి పెరిగిపోతుంది. అటువంటి కృతఘ్నుడి పొగరు అణచా లనిపిస్తుంది."

"తవఁరికే గాదు. ఎవరికైనా అట్టాగే అనిపిస్తది బాబూ !"

"వాడి పొగరు అణచాలని, యీ వెంకట్రామయ్య అంటే యేమిటో చూపెట్టాలనుందిరా. అది, నీ చేతిలో ఉంది ..." గంగులు మొహంలోకి చూస్తూ అన్నాడు వెంకట్రామయ్య.

గంగులు గతుక్కుమన్నాడు. తన చేతిలో ఉండటమేవిఁటా అన్న సందేహం కలిగింది వాడికి.

"నా సేతిలోనా బాబూ?" అన్నాడు.

"ఔన్రా !"

"సెప్పండి బాబూ ! మీరేం సెప్తే అదే సేత్తాను. మీ పాదాల దగ్గిర పడునోణ్ణి..."

వెంకట్రామయ్య, నిండుగా ఓ నవ్వు నవ్వేడు. కాలుస్తున్న చుట్ట పారేసి, జేబులోంచి కొత్త చుట్ట తీసి వెలిగించాడు. మరో చుట్ట తీసి, గంగులుకి అందించాడు. "నువ్వూ కాల్చరా..." అంటూ.

గంగులు నివ్వెరపోయాడు. యజమాని స్వయంగా చుట్ట అందించడం, అదే మొదటిసారి.

"కాల్చరా..."

"తర్వాత కాలుస్తాలెండి బాబూ :" అంటూ మొల్లో దోపుకున్నాడు.

"ఒరేయ్ గంగులూ ! నువ్వు రామ్మూర్తిని మరో లోకానికి పంపాల్రా !" అంటూ మెల్లగా చెప్తూ, పీక తీసెయ్యాలన్నట్టు సౌంజ్ఞచేశాడు.

గంగులు షాక్ తిన్నట్టుగా అదిరిపోయాడు. వాడి మొహంలో రంగు మారింది.

"బాబూ ... " అని యేదో చెప్పబోయాడు వాడు.

"నువ్వు మరేం అనకు. వాడి ఆస్తి మళ్ళీ నా ఆస్తిలోనే కలవాలి. అందులో నీకు కొంతభాగం ఉంటుంది. నీ స్థాయి పెరగాలని నేననుకుంటున్నట్టు చెప్పాను కదరా ! ఈ విషయం మూడో వ్యక్తికి తెలీకూడదు."

"మరి ... " మళ్ళీ యేదో అనబోయాడు, గంగులు.

"మరేం లేదు. వాడు యీ రాత్రి పట్నంనుంచి తిరిగి వస్తున్నాడు. తోటలో వాణ్ణి అంతంచెయ్యి. దొంగలెవరో ఆ పనిచేశారని ప్రచారం చేద్దాం. మిగతా విషయాలు నేను చూసుకుంటాను. కత్తిమాత్రం కాలువలోకి విసిరేయ్... అది నీ దగ్గరుండటం మంచిదికాదు." అంటూ సలహా యిచ్చాడు.

యజమాని చూపిన యెరకి లొంగిపోయిన గంగులు, కాదనలేకపోయాడు.

"మరేం పెమాదం నేదంటారా ?" వాడి గొంతు, కాస్తంత కంపించింది.

"నేనుండగా నీకు ప్రమాదమేమిట్రా ! నారాయుడు యెలా చచ్చిపోయిందీ, యింతవరకూ యెవరికయినా

తెలిసిందా ? అలాగే ! గతాన్ని గుర్తు చేశాడోసారి.

గంగులు మరేం మాట్లాడలేక పోయాడు.

"సరే బాబూ !"

"భేష్ అలా ఉండాలిరా స్వామి భక్తి అంటేను. అందుకే నిన్నో మనిషిని చేద్దామనుకుంటున్నాను ... " చిన్నగా నవ్వుతూ అన్నాడు, వెంకట్రామయ్య.

"తమ(రి దయ..."

"వెళ్ళింక... ఇదిగో, యీ అయిదు రూపాయలు తీసుకెళ్ళి, కాస్త చుక్కేసు కుని మరీ వెళ్ళు. లేకపోతే, ఆ ఫోర్సు రాదు." అంటూ అయిదు రూపాయిలు తీసి అందించాడు, వెంకట్రామయ్య.

గంగులు హుషారుగా ఆ నోటు అందుకుని, నిష్క్రమించాడు.

వెంకట్రామయ్య సగర్వంగా లోలోన నవ్వుకున్నాడు.

* * *

రాత్రి యెనిమిది కావస్తోంది, గంగులు రెండు గ్లాసుల సారా యెక్కిం చేసి, కత్తి పట్టుకుపోడానికి, యింటికేసి నడిచాడు.

ఇల్లు చేరేకునేసరికి, గంగులు భార్య రంగి యేడుస్తోంది. ఆమె చుట్టూ నలుగురైదుగురు ఆడవాళ్ళు కూచున్నారు. గంగులుకి అర్థంకాలేదు.

"ఏటయ్యిందే రంగి?" ఆత్రుతగానే అడిగాడు.

"వచ్చినావా! సిన్నోడికి వల్లమాలిన జొరం వచ్చేసినాది. కళ్లు తెరవడం నేదు. నాకేందో భయంగా ఉంది," అంటూ భోరుమంది.

గంగులుకి, ఉన్న కాస్త మత్తూ వదిలిపోయింది. కొడుకుని తాకాడు. సలసల కాగుతోంది.

"డాకటేరు దగ్గిరికి తీసుకెళ్దాం పదే !" అంటూ కొడుకుని భుజమ్మీ దేసుకుని బయల్దేరాడు. వాడికి మరో ఆలోచన లేదు. వాడివెంట రంగి కూడా వెళ్ళింది.

డాక్టరు, ఆ చంటివాణ్ణి తనిఖీచేసి, ఓ ఇంజక్షను యిచ్చాడు. రాత్రిదాటితే, ఫరవా లేదన్నాడు.

ఆ రాత్రంతా గంగులు, రంగి చంటాడి దగ్గరే కూచున్నారు.

గంగులు అక్కడ చంటాడి దగ్గర కూచున్నాడేగాని, వాడి ఆలోచనలు రామ్మూర్తిమీదే ఉన్నయ్. వెంకట్రా మయ్య చెప్పిన మాటలు, వాడి చెవుల్లో గింగురుపెట్టాయి. తాను ఒక స్థాయికి రావాలంటే, డబ్బు గడించాలంటే, రామ్మూర్తిని చంపాలి, కాని...కాని... తర్వాత తను పట్టుబడితే ... ? ... జైలు కెళ్ళాలి. ఉరిశిక్ష పడినా పడు తుంది. అప్పుడీ వెంకట్రామయ్య అడ్డు పడతాడా ? తప్పుకుంటాడు. తన



పెళ్ళాం, పిల్లలు ముష్టెత్తుకు తిరుగుతారు ... అయినా తన స్వార్థంకోసం, తన మంచికోసం రామ్మూర్తిలాంటి మంచి మనిషిని చంపడమా ? వెంకట్రామయ్య, తనచేత ఆ పని చేయించి, తరువాత మొండిచెయ్యి చూపిస్తే ... ?

... రామ్మూర్తి బాబుకి అన్యాయం తలపెట్టడంవల్లనే గామోసు, తన కొడుక్కి అంత బాగులేకపోయింది ! ఇదంతా దేవుడి మాయా ?... యిలా ఆలోచనలు సాగినయ్ గంగులు మెదడులో.

వాడి మొహం చెమటతో నిండిపోయింది. చూపుల్లో ఆరాటం అగుపించింది. ఇదంతా గమనిస్తున్న రంగి, కంగారు పడింది.

"ఏటయ్యింది మావా ? ఎందుకలా అయిపోతన్నావు ? మొహం నిండా ఆ సెవటేటి ?" ప్రశ్నలవర్షం కురిపించింది, రంగి.

గంగులు, మొదట్లో చెప్పకూడ

దనుకున్నాడు. కాని, చెప్పడమే మంచి దనుకున్నాడు. భారంగా ఓ నిట్టూర్పు విడిచి, అంతా చెప్పాడు.

రంగి, గుండెలు బాదుకుంది.

"ఎంత గోరం జరిగి పోను! సిన్నోడికి ముంచుకు రాపోతే, అన్నేయంగా రామ్మూర్తి బాబుగోరి పేణాలు పోనుగదా! అయినా పెద్ద బాబు సోర్దంతో సెప్పారే అనుకో... నువ్వ సేసీడవేనాయేటి? ఆ తర్వాత మా గతేంగాను! ఇదంతా దేవుడి మాయలాగుంది మావా! అంత మంచి బాబుకి అన్నేయం సెయ్యడానికి నువ్వ తలపెట్టినావు గాబట్టే, దేవుడు మనకి అన్నేయం తలపెట్టినాడు. ఇట్టాంటి అన్నేయాలు సెయ్యడానికేనా నువ్వ పెద్దబాబు దగ్గిర పనిచేస్తంది? వొద్దు మావా... ఇంక అక్కడ పనొద్దు. కూలిసేసుకుని నేయంగా బతుకుదాం." యేడుపు స్వరంతో అంది, రంగి.

గంగులు ఆలోచించాడు. అతడిలోని విచక్షణా జ్ఞానం, వొళ్ళు విరుచుకుని లేచింది రంగి చెప్పింది సబబుగానే తోచింది వాడికి. రామ్మూర్తిబాబుని దేముడే కాపాడినట్టనిపించింది వాడికి.

"ఔనే రంగీ, శానా గోరం జరిగి పోను. దేముడే తప్పించినాడనుకో, ఇంకెప్పుడూ యిటువంటి పనులు సెయ్యడానికి ఒప్పుకోన్లే. నీ మీ దొట్టు..."

రంగి తృప్తిగా నవ్వుకుంది. అప్పుడే చంటాడు కళ్ళు తెరిచాడు.

"సూసినావా దేవుడి మాయ..." మురిసిపోతూ అంది, రంగి.

గంగులు మొహంలో కొత్త వెలు గొచ్చింది. రెండు చేతులూ జోడించి, కనిపించని దేవుడికి దండంపెట్టాడు.

* * *

మర్నాడు, వెంకట్రామయ్య గంగుల్ని ఛెడా మడా తిట్టాడు. అంతా సహనంతో విన్నాడు, గంగులు. "ఏటి బాబుగోరూ అలా నోరు పారేసు కుంటారు? నే నీ అన్నేయప్పనికి ఒప్పుకున్నాను గాబట్టే, నా బిడ్డ రాత్రి సావు బతుకుల్లో ఉన్నాడు. రాత్రంతా ఆడిదగ్గిరే కళ్ళల్లో ఒత్తులు పెట్టుకుని కూసున్నాం నానూ, రంగీను. అదృట్టం బావుండి ఆడు బతికినాడు బాబూ. నా నింకెప్పుడూ అటువంటి అన్నేయానికి పూనుకోను. నా బిడ్డలు సుకంగా ఉండాలని నాకూ వుంటది బాబూ! రాత్రి జరిగిందంతా దేముడి మాయలా కనిపిస్తంది..." అంటూ చెప్పుకు పోయాడు, గంగులు.

వెంకట్రామయ్య విస్తుపోయాడు. గంగులు అలా మారిపోవడం, అతని కిష్టంలేదు.

"ఏవిట్రా అలా మాట్లాడు తున్నావు? మీ అబ్బాయికి బాగులేక




పోడానికి, నువ్వు చేసేపనికీ సంబంధం యేముందని ? దేని కదే !"

"మీ రెన్ని సెప్పండి బాబూ ! నాను మాత్రం యింకెప్పుడూ అటువంటి పనులు సెయ్యనంటే సెయ్యను. ఆ పైన మీ యిట్టం ..." ఖచ్చితంగా చెప్పేశాడు, గంగులు.

వెంకట్రామయ్యకి వొళ్ళు మండి పోయింది. కళ్ళు చింతనిప్పలల్లే ఎర్రగా మెరుస్తున్నయ్. రామ్మూర్తిని చంపేశాక, వాడిలో మార్పు వచ్చినా బాగుండేది. కాని, వాడిప్పుడే మారి పోయాడు. అనుకుని మళ్ళీ ఓ ప్రయత్నం చేశాడు.

"అంతే అంటావా ?" కోపంగానే అడిగాడు.

"అంతే బాబూ ! మీ దగ్గిర పని మానేయమంటే మానేత్తాగాని, అన్నేయాలింక సెయ్యను బాబూ."

వెంకట్రామయ్యకి యేంచెయ్యాలో పాలుపోలేదు. కోపంతో వాణ్ణి పన్లో నుంచి తీస్తే, వాడు తిన్నగా పోయి రామ్మూర్తి దగ్గర చేరిపోతాడు. అంతే కాదు ... తన గుట్టులన్నీ వాడికి తెలుసు...వాటిని ప్రచారం చేస్తాడు... అంచేత, తన కోపం తనకే ముప్పు తెస్తుంది ... అనుకున్నాడు. ఏవీఁ జరగనట్టు ఓ చిన్న మందహాసం చేశాడు.

"సరేలేరా ! నిన్నే విషయం లోనూ బఃవంతం చెయ్యనుగా ! ఈ సంగతంతా మర్చిపో..." అన్నాడు.

"అది, తవఁరు సెప్పాలా బాబూ!" నవ్వుతూ అనేశాడు, గంగులు.

ఆ రోజునుంచీ, వెంకట్రామయ్యలో చాలా మార్పు వచ్చేసిందంటే, అతిశయోక్తికాదు.




నిండు చూలాలు చంచల.

మూడేళ్ళ గోపిగాడు ఒళ్ళో కూర్చొని ఆమె చెబుతున్న కథ వింటున్నాడు. "అప్పు డేమయ్యిందంటే ఆ సూది చెయి జారి నూతిలో పడింది."

"ఊఁ."

"ఊ అంటే వస్తుందా ?"

"రామ."

"రాదంటే వస్తుందా ?"

"పోమ్మా."

"పోమ్మా అంటే వస్తుందా ?"

"అస్సలు రాదులే పో."

"శభాష్, శభాష్ చంచలా మొత్తానికి ఆ కథను ఎవరు రాశారోగాని దానికి




ఇమ్మోర్టల్ వేల్యూ ఉందోయ్" అన్నాడు భార్గవ.

"పిల్లల కథలన్నీ శాశ్వత విలువ గలవే," అన్నది చంచల.

"ఎటొచ్చీ పెద్దల కథకే ఆ విలువ లేదంటావ్ ?"

"ఆ మాట నే ననలేదు. ఇంతకీ నా కథ బాగులేదని వ్యంగ్యమా ?"

"నేనో పెద్ద విమర్శకుణ్ణి కాదుగాని, ఆ రాజారావుని అంతలా బలహీనుడిగా చిత్రించడం నచ్చలేదు."

"ఓహో."

"కథ అలా ముగించడంవల్ల పాత కథే అనిపించింది "

"ఇంకెలా ముగిస్తే బాగుండేదో !?"

"ఆ సరస్వతమ్మను తెచ్చి ఇంట్లోనే ఉంచేసుకున్నాడంటే బాగుండేదేమో !"

"ఆమట్న కాంతమ్మ పళ్ళు రాలగొట్టిందని కూడా ఓ ముక్క రాస్తే బాగుంటుందా ?"

"ఎందుకు బాగుంటుంది ? రాజారావు చేసిన తప్పేవిటని, కాంతమ్మకు అంత ఉక్రోషం ?"

"అయ్యో మొద్దు బాబుగారూ ! కథంతా చదివి కూడా తమ రలా అడ్డం తిరుగుతున్నారంటే; అర్థంకాక కాదు లెండి."

"అర్థం కాకపోవడమేవిటి ? పని మనిషి సరస్వతమ్మను అభిమానించాడు రాజారావు. అది కాంతమ్మకు నచ్చ లేదు. కాలక్రమేణా కొంగట్టుకు తిరుగు తున్నాడా – అనుకొంది. ఆ తరువాత

రాజారావు ఓ కొంప అద్దెకు తీసి అందులో ఆ సరస్వతిని ఉంచాడని తెలిసి భారంగా నిట్టూర్చింది. ఇందులో అర్థం గాకపోవడాని కేముంది ?"

"అయితే రాజారావు చేసిన పని సమర్థనీయమైన దంటారు ?"

"అలాగని అనడంలేదు. చేసిన తప్పేవి టంటాను ?"

"తప్పా; తప్పున్నరా ? మీ పురుష లంతా ఒకటే గనుక అలా వెనకేసు కొస్తున్నారుగాని, ఎర్రగా బుర్రగా ఉన్నంత మాత్రాన, తనకంటే పది పదిహేనేళ్ళు పెద్దదే ఆ సరస్వతి; బంగారంలాంటి భార్యను కాదని అలాంటిదాని వెంటబడి వెళ్ళిపోవడమే !? పైగా ఇంట్లోకి కూడా తెచ్చి పెట్టు కుంటాడట ! అదట సబబు !" ఉడుక్కుంది చంచల.

"నీవు కనీసం స్త్రీవై యుండి చేసిం దేమిటి ? సరస్వతిని గురించి కథలో ఏమైనా చెప్పావా ? ఎర్రగా బుర్రగా ఉండి ఎరచూపించే ఒక నీచురాలన్నావే గాని ఆమె గురించి పూర్వాపరాలు ఏమైనా చెప్పావా ?"

"అది పూర్వం ఓ పదిమందితో తిరిగిందనీ ముందుకి రాజారావుని కాదని మరో . నలుగుర్ని ఆదుకొంటుందని కించపరచ లేదంటారు."

"అలాగని అనను. వయసున భర్త కంటే పది పదిహేనేళ్ళు పెద్దదైనా భర్తను వలలో వేసుకోగలిగిన ఆమెలోని ఆకర్షణ, వయసులో ఉన్నప్పుడు ఎంతమందిని ఆకర్షించి ఉంటుందో కనీసం కాంతమ్మ ఊహాగానమైనా చేసుండాలి."

"కాంతానికి పని దండుగ. నాకు పేజీలు దండుగ."

"అలా గనుకునే కథను పాడు జేశావు. నేనొక మాటంటాను. సరస్వతి వయసులో ఉన్నప్పుడు రంభ ! దీపం చుట్టూ పురుగుల్లా అనేకమంది ఆమెను చుట్టుముట్టారు. ఓ పురుగు తటాలున జ్వాలమీద పడింది. జ్వాల ఆరి పోయింది. ఆ పురుగు రెక్కలు దులుపు కొని వెళ్ళిపోయింది. ఆ దీపాన్ని తిరిగి వెలిగించినవారు లేరు - అని కొంచెమైనా సరస్వతి గురించి ఉపోద్ఘాతం చెబితే బాగుండేది."

"ఏ రాయైతే, పళ్ళూడగొట్టుకోవ డానికి ? చివరి కది ఆరిపోయిన దీపమేగా ? ఇప్పుడు కొంపలార్పడమే దాని పని అంటే చాలు."

"కాంతమ్మకు బుద్ధి లేదు."

"ఏం కాంతమ్మేం జేసింది ?"

"మానవుల మనస్తత్వాన్ని ప్రతి బింబింప జేయవలసిన రచయిత్రి అయి ఉండి స్వార్థం అడ్డొచ్చేసరికి సామాన్య మానవురాలిగా వ్యవహరించింది."

"కాంతమ్మ రచయిత్రి అని నేను రాయలేదే ?"

"కడుపుతో ఉందని కూడా రాయలేదు."

"అయితే అసలు విషయం గ్రహించేనా ఇన్ని కబుర్లు ?"

"తెలుసు, నీ కథలో రాజారావును నేనని. సరస్వతి అన్నపూర్ణనీ తెలుసు."

"అయితే మీరు దాన్ని ఇంట్లోకే తెచ్చి పెట్టాలనుకుంటున్నారన్నమాట!"

"నీవు పప్పులో కాలేసినట్టు-అంతే."

"తెగించినవాడికి తెడ్డే లింగం."

"అలాగని కాదు. కడుపుతో ఉన్నావుగా ? నీకు చేదోడువాదోడుగా ఉంటుంది. గోపిగాణ్ణి ఆడిస్తుంది. నా ఆలనా పాలనా చూసుకుంటుంది."

"ఏమండీ ! ఆపండి." పొలికేక పెట్టింది చంచల.

"చంచలా; అన్నపూర్ణకీ నాకూ ఉన్న సంబంధం ఈనాటిది కాదు, చిన్ననాటిది. నీవనుకున్నట్టు ఆమెకూ నాకూ ఉన్న వయసు వ్యత్యాసం ఎక్కువే. అందుకనే ఆమె నన్ను పసివాడుగా ఎత్తుకొని ఆడించింది. ఆమె నన్ను ఏడేళ్లదాకా పెంచింది. ఆమె అందమే ఆమెను బలిగొన్నది. ఎవణ్నో నమ్మింది. ఎటో పోయింది. మోసపోయింది. అభిమాని. తిరిగి రాలేదు. పంచలంట ఉంటూ ఇంటింటా చాకిరీ చేస్తూ బ్రతుకుతోంది. పనిమనిషికోసం వెతుకుతుంటే తటస్థపడింది. ఆమె మెడ మీద పుట్టుమచ్చ ఉంది చూశావూ ? అది గుర్తుచేసింది - అన్నపూర్ణ ! నీ అక్కయ్ !! - అని."

"ఏమండీ !?"

"ఏమండీ అంటే ఆమె నీ అక్క కాదా ?"

"నిజం చెప్పండి."

"నిజం చెప్పండి అంటే, ఆమె నీ అక్క కాదా ?"

"అబ్బ, విసిగించకండి."

"అబ్బ విసిగించకండి అంటే ఆమె నీ అక్క కాదా ?"

"ఎందుక్కాదు ? ఆమెను వెంటనే ఇంటికి రమ్మని ఆహ్వానించండి."

"రేఁ గోపీ ! సూది బయటికొచ్చిందొరేయ్ !" అని గోపీని ఎత్తి ముద్దాడాడు భార్గవ.






వెలుగుతున్న మంగళహారతి కర్పూర హారతి పళ్ళెం చేతపట్టుకొని పూజారి కాంతిలో గర్భగుడిలోని మూం వెలుపలి వచ్చాడు. ఆడవా శ్లాకవైపు, విగ్రహం స్పష్టంగా క౯పిస్తోంది. మగవా శ్లాకవైపు వరుసగా నిలిచి

"పాపులమైన మేము నీ దర్శనం చేసుకొన్నందుకు క్షమించు స్వామీ !" అన్నట్లుగా లెంపలు వేసుకొని దణ్ణం పెడుతున్నారు.

పళ్లెంలో చిల్లర ఉంచి హారతిని కళ్ళకు అద్దుకున్నాడు దివాకర్. అతని చూపు ఎదుటి వరుసలో ఉన్న సుజాత మీద పడింది. దేవుడంటే నమ్మకంలేని సుజాతలో కలిగిన మార్పును గమనించి తృప్తిగా లోలోపలే నవ్వుకున్నాడు. దేవుడు లేడని కొద్ది రోజుల్రకితమే తనతో వాదించిన సుజాత నేడు గుడిలో అర్చన చేయిస్తోంది. ఆమె కట్టూ, బొట్టూ పూర్తిగా మారిపోయాయి. వారం వారం ఉపవాసం ఉంటోంది. అలవాట్ల స్వేచ్ఛతో నిర్లక్ష్యం చేయబడుతూ వచ్చిన ఆమె వయసు పొంగులు ఈనాడు మారిన సంస్కారపు తెరల చాటునుండి కవ్విస్తూ తొంగి చూస్తున్నాయి.

సుజాత దృష్టి దివాకర్‌పైన ప్రసరించింది. హారతిని కళ్ళ కద్దుకుంటూ తన గుండెలో దైవంగా వెలిసిన దివాకర్‌కు జోహారు లర్పిస్తున్నట్లు అతనివైపు క్రీగంట చూసింది. నిజంగా దివాకర్‌లాంటి ఆదర్శ యువకుడు ఊరి కొక్కడుంటే ఇక ఎవ్వరికీ ఎలాంటి కష్టాలు రావేమో ! ఎదుటి మనిషిలో మండుతున్న సమస్యల వేడిమికి అతని మనసులోని వెన్న ఇట్టే కరిగిపోతుంది. దారి, తెన్నూ కనబడక చిక్కు సమస్యల చీకట్లలో - గుడ్డివారై తడబడేవారికి అండగా నిలిచి ఆదుకుంటాడు. తన తండ్రికి ఒక్కగా నొక్క కొడుకు కావటంచేతనూ, తండ్రి ధనవంతుడు కావడంవల్లనూ, తన కొడుకు దర్జాగా ఉండాలని ఆయన అనుకోవడంవల్లనూ అడిగిన వెంటనే తండ్రివద్దనుండి తంతి మనియార్డర్‌ద్వారా డబ్బు వస్తుంది. కాని అలా వచ్చిన డబ్బును నలుగురికీ సాయపడేలా ఖర్చుచేసేవాడు దివాకర్. ఎక్కడైనాసరే అన్యాయం జరుగుతుంటే సహించక ఎంతకైనా తెగించి న్యాయాన్ని కాపాడేవాడు. అతన్ని ఎవరైనా మంచివాడని పొగిడితే అంత కన్నా మంచితనం ప్రదర్శించడానికి ప్రయత్నించేవాడు దివాకర్.

దివాకర్, సుజాతల పరిచయం నెల క్రిందట జరిగింది. ఒకరోజు సుజాత అన్న వెంకట్రావు తనతో ఆమెను తీసుకొచ్చి దివాకర్‌కు పరిచయం చేశాడు. అప్పుడామె అందవిహీనంగా చింపిరి బట్టలలో ఉంది. జరుగుబాటు లేకపోవడంతో సుజాతను పడుపు వృత్తిలో పెట్టాల్సివచ్చిందనీ, ఒకసారి పట్టుబడడంవల్ల నానా యిబ్బందులు ఎదుర్కొని చివరికి ఊరు విడిచి వెళ్ళడమే సబబుగా తోచి సుజాతను తాను తీసుకొచ్చాననీ వెంకట్రా వన్నాడు. ఆ కథ విన్న దివాకర్

జాలిపడి వాళ్ళ నాదుకున్నాడు. దైవాన్ని నమ్ముకుంటే బాధ లుండ వన్నాడు. సుజాతకు దేవుడంటే విశ్వాసం లేదు. ఆ విషయంలో సుజాత, దివాకర్లు తరచు వాదించుకొనేవారు. సుజాత కేదైనా చిన్న ఉద్యోగం దొరికే దాక తానే నెల కింత ఇస్తూ వస్తానని చెప్పి వెంకట్రావును వెనక్కి పంపేశాడు. విడిగా సుజాతకు ఒక గది యిప్పించి తానే పోషిస్తున్నాడు.

ప్రక్కకు వెళ్ళి ఒకచోట కూర్చొని ప్రసాదం కళ్ళ కద్దుకొని నోట్లో వేసుకున్నాడు దివాకర్. ఇంతలో మంగళ వాయిద్యాల సందడితో ఒక పెళ్ళి గుంపు గుడిలోకి వచ్చింది. పెళ్ళి కూతురువైపు చూశాడు. ఆమె వయస్సు సుమారు పదిహేనే ళ్ళుంటాయ్. పెళ్ళి కొడుకు ఇంకెంత ముచ్చటగా ఉంటాడో నని గమనించిన దివాకర్ కళ్ళెర్ర బడ్డాయి. అమాంతం లేచి నిల్చున్నాడు.

"పదిహేను ఏళ్ళ పిల్లకి, అరవై ఏళ్ళ తాతకీ వివాహమా ? నాన్సెన్స్ !" అంటూ గబగబా వెళ్ళి ఆ పెళ్ళి పెద్దని పట్టుకున్నాడు.

"ఏమండీ, మీ రసలు మనుషులేనా? లోకం తెలియని ఈ పిల్లకు, ఏ క్షణమో రాలిపోనున్న ఈ తాతకీ పెళ్ళి చేస్తున్నారా !" అని గద్దించాడు దివాకర్.

ఆ పెళ్ళిపెద్ద ఒక్క క్షణం అదిరి పడ్డాడు. కాని వెంటనే తమాయించు కొని, "ఆ సంగతి నీ కెందుకోయ్ ? మహా మొనగాడిలా ముందుకొచ్చావ్ ! అసలు మా వ్యక్తిగత విషయాలలో జోక్యం చేసుకోడానికి నీ వెవరు ?" అన్నాడు.

అక్కడున్న పెద్దవాళ్ళలో ఇంకో కాయన ముందుకు వచ్చారు. "శుభమా అని మేము పెళ్ళి చేస్తుంటే మధ్య నీ వెవడవోయ్ ?" అని కేకపెట్టి చుట్టూ ఉన్న జనాన్ని చూశాడు, వాళ్ళు తన పరాక్రమాన్ని ఎలా అభినందిస్తున్నారో చూడాలని. కాని వాళ్ళందరూ దివాకర్ వైపే చూస్తున్నారు.

"ఈ అమ్మాయికి పెళ్ళి చేయవలసిన అవసరం ఏమొచ్చింది ? ఒక్కసారి ఆమె కళ్ళలోకి చూడండి. అన్నెం పున్నెం తెలియని ఆ పిల్ల ఎలా కాపురం చేస్తుంది ?" గదమాయించాడు దివాకర్.

"జరగబోతున్న వివాహాన్ని ఆప కూడదు నాయనా, అది పాపం !" అంటూ పూజారి అక్కడికి వచ్చి దివాకర్‌కు సర్దిచెప్పాడు.

"నా దృష్టిలో ఈ పెళ్ళి జరగడమే మహాపాపం !" విసురుగా జవాబిచ్చాడు దివాకర్.

అసలు విషయం వివరిస్తే కాని లాభంలేదని గ్రహించిన పెళ్ళిపెద్ద యిలా అన్నాడు-

"చూడు బాబూ, అదిగో ఆ మూల వణుకుతూ కూర్చున్న ముసలావిడ మా అమ్మ. తన జీవితంలో ఆఖరు దశలో ఉంది. ఇంకా కొన్ని క్షణాలలోనే కన్ను మూయవచ్చు. ఆ లోపుగానే తన మనమరాలి పెళ్ళి చూడాలని ఆమె చివరి కోరిక. అది తీర్చడం నా ధర్మం బాబూ !"

"హుం, ఏ నిముషమో కన్ను మూయనున్న ఆ ముసలామె కొన్ని క్షణాల ఆనందం గురించి ఆలోచించారే కానీ పది కాలాలపాటు పచ్చగా ఉండాల్సిన ఆ పిల్ల భవిష్యత్తును గూర్చి ఆలోచించారా ?" అని ప్రశ్నించాడు దివాకర్.

ఆ పెళ్ళిపెద్ద ఏదో తలుచుకొంటూ కంట తడిపెట్టాడు. "నీ వన్నమాట నిజమే బాబూ ! కాని నాలాంటి దౌర్భాగ్యుడి కిది తప్పదు."

"ఎందుకని ?"

"కట్నాలు, కానుకలు ఇచ్చుకోలేని నాబోటి అభాగ్యుల కింతకన్నా మార్గం లేదు."

"అలా అయితే నాతో రండి. ఎంత డబ్బు కావాలంటే అంత యిస్తాను. ఈ బోసినోటి పెళ్ళి కొడుకును వెళ్ళి పొమ్మనండి. ఈ పెళ్ళి ఆపేయండి." అంటూ వెళ్ళిపోయాడు దివాకర్. ఎవరికో ఇవ్వాలని ఆ రోజే చెక్ కాష్ చేసి తెచ్చిన మూడువేల రూపాయలు అతని పర్సులో ఉన్నాయి.

"అవున్లేవోయ్ ! నీకు డబ్బుంది కనుకనే ఇష్టం వచ్చినట్లు అరుస్తున్నావ్. నీ సంగతి ఎవరికి తెలియదనుకున్నావ్? బజారులో పరువు అమ్ముకునేదాన్ని చేరదీసి మేపుతున్నావ్. నీ స్వార్థబుద్ధి ఎవ్వరూ గ్రహించలేరనుకున్నావా ?" అంటూ ఒకాయన అరిచాడు. ఆ మాటలు విన్న సుజాత వెంటనే తల వంచుకొని అక్కణ్ణుంచి వెళ్లిపోయింది. అప్పటికే 'ఈ గోల యిక చా'లన్నట్లు పెళ్ళి గుంపు విడిపోయి దైవదర్శనం చేసుకుని వెళ్ళిపోయారు. పెళ్ళి ఆగిపోయింది.

దివాకర్ తన గదిలోకి వచ్చి లైట్ ఆన్ చేశాడు. గుడిలో ఆ పెద్దమనిషి చివరగా అరచిన మాటలు అతని చెవిలో మారుమోగుతున్నాయి. 'బజారులో పరువు అమ్ముకునే అమ్మాయి' ఎవరు ? సుజాత అనే కదా ఆ పెద్దమనిషి అభిప్రాయం ? ఒక అనాధ స్త్రీని చేరదీస్తే అందులో దురుద్దేశం తప్ప ఇంకేమీ ఉండదా ? కడుపుకోసం పడుపు వృత్తిచేసే ఆడ వారిపట్ల సానుభూతి చూపలేని సంఘానికి వారిని విమర్శించే అర్హత అసలు ఉందా ? ఒకసారి కాలుజారిన స్త్రీ జీవితాంతం తలవంచుకొని ఉండవల సిందేనా? ఆమెకు మాత్రం పశ్చాత్తాపం

ఉండదా ? మంచి దారికి మళ్ళీ, మళ్ళీ గౌరవంగా బ్రతికే అధికారం ఆమెకు లేదా ? ఇలా తనలో తానే ప్రశ్నించు కొంటూ గది తలుపు గొళ్ళెం వేసి వచ్చి మంచంమీద కూర్చున్నాడు.

ఎవరో గది తలుపు తట్టారు. వెళ్ళి తలుపు తీశాడు. సూట్‌కేసు, బెడ్డింగులతో సుజాత నిలబడి ఉంది.

"మీరా !" అంటూ సుజాతను చూసి, సూట్‌కేసు, బెడ్డింగులవైపు చూపు మళ్ళించాడు, దివాకర్. "లోపలికి రండి. ఎక్కడికో అకస్మాత్తుగా ప్రయాణమౌతున్నట్లున్నారు ?"

సుజాత లోపలికి వచ్చి సూట్‌కేసు, బెడ్డింగులు బల్లమీద ఉంచింది. తానొక కుర్చీలో కూర్చొని, మరో కుర్చీని చూపుతూ, "కూర్చోండి" అన్నాడు దివాకర్. ఆమె కూర్చుంది.

"మీరు నాకు చేసిన మేలు ఎప్పటికీ మర్చిపోను. నా మూలంగా మీరు మాటలు పడటం నాకిష్టంలేదు. అందుకే ఈ ఊరు వదిలి వెళ్తున్నాను," అన్నది సుజాత.

ఆమె భావాన్ని దివాకర్ గ్రహించాడు. "ఎవరో ఏమో అన్నారంటూ మన భవిష్యత్తును పాడుచేసుకుంటామా ? ఆ పెద్దమనిషి అన్న మాటలు లెక్కచేయకండి. ప్రయాణం మానేసి హాయిగా వెళ్ళి మీ గదిలో పడుకొని నిద్రపొండి" అన్నాడు.

"నన్ను గురించి ఎవరెన్ని మాటలన్నా ఫరవాలేదు. కాని దైవంలాంటి మీరు అనవసరంగా పదిమందిలో మాటలు పడడం నేను సహించలేను. అందుకే వెళ్ళిపోతున్నాను. మీ మాట కాదన్నందుకు నన్ను క్షమించండి."

"సుజాతగారూ! మళ్ళీ చెప్తున్నాను. మనం నడిచే దారి తిన్నగా ఉన్నంత వరకు ఎవరేమన్నా పట్టించుకో నక్కర లేదు. నన్ను గురించి మీరు బాధ పడకండి, ప్లీజ్ !"

"నన్ను సుజాతా అని పిలవండి చాలు. మీరు నా కింత గౌరవ మిస్తున్నారు. అందుకు నే నర్హురాలిని కానేమో ననిపిస్తుంది. దయచేసి నన్ను వెళ్ళనివ్వండి" అని సుజాత లేచి నిలబడింది.

"సరే, ఎక్కడికి వెళ్తారు ? మళ్ళీ మీ ఊళ్లో ఆ కుళ్ళుపరిసరాల్లో బూజు పట్టిన మోజు తీరిన ముసలి సంఘం బోసినోటి గావుకేకల వాతావరణంలో నలిగిపోతారు. అంతేగా ! మీ యిష్టం. కాని సుజాతగారూ, ఆఖరుసారిగా నా మాట—"

"నన్ను సుజాతా అనమన్నాను" అంటూ సుజాత మెల్లగా దివాకర్‌ని సమీపించింది. అప్రయత్నంగా అతని భుజాలపై చేతులువేసి తన తలను అతని ఛాతీపై వాల్చింది.

దివాకర్ ఇలాంటి సన్నివేశాలు



సినిమాల్లో చూశాడె కాని స్వయంగా ఎప్పుడూ అనుభవించలేదు కనుక ఒక్క-క్షణం నిశ్చేష్టుడయ్యాడు. కాని, పట్టాలపై పడిన రైలుబండి గమ్యం తెలియకపోయినా పట్టాల ననుసరించి నట్లు గాడిలో పడిన దివాకర్ ఆమెను కౌగిలించుకొని, "సుజాతా !" అంటూ పారవశ్యం పొందాడు.

'కట్ ?' అన్నట్లుగా గడియారం అలారం కొట్టింది. ఇద్దరూ ఉలిక్కి-పడి విడిపోయారు. జారిపోయిన పైట సర్దుకుంటూ సుజాత దూరంగా నిలబడింది. దివాకర్ వెళ్ళి అలారం ఆపుచేశాడు

"సారీ దివాకర్ !" అన్నది సుజాత, అంతకంటే ఏమనాలో తెలియక. మళ్ళీ వెంటనే మాట మార్చేసింది. "అదేంటండీ, రాత్రి పదకొండు గంటలకి అలారం పెట్టుకున్నారు ?"

"రోజూ అప్పుడే పడుకుంటాను. అందాకా ఏవో పుస్తకాలు చదువు

తుంటాను" అన్నాడు దివాకర్, ఆవులిస్తూ.

"పాపం, మీరు పడుకునే టైమైంది. నే నిక వెళ్తానండి. నాకు మీరు చేసిన సహాయం ఎప్పుడూ మరిచిపోలేను. మీ మాట కాదని వెళ్ళిపోతున్నందుకు నన్ను క్షమించండి," అంటూ సుజాత పోవడానికి సిద్ధపడింది.

"సరే, అంతగా మీరు పట్టుబట్టితే ఏం చేయగలను ? ఒక్క నిముషం ఉండండి," అని పర్స్ తీశాడు. అందులోని కొన్ని వంద రూపాయిల నోట్లలోనుంచి రెండు వందలు తీసి, ఆగి, ఇంకో వంద తీశాడు.

"మీ దగ్గర రైలు చార్జీలకు, పై ఖర్చులకు ఉన్నాయో లేవో – ఇవి ఉంచండి" అంటూ ఆమెకు అందివ్వబోయాడు.

సుజాత కళ్ళలో నీళ్ళు తిరిగాయి. "వద్దండీ, ప్లీజ్ ! మీ సహృదయత చూస్తూంటే ఎలా కృతజ్ఞత తెలుపుకోవాలో అర్థంకావటంలేదు," అన్నది.

దివాకర్ గది తలుపుదాకా వెళ్ళి బయటికి చూశాడు. కొండను ఢీకొంటున్న పొట్టేలులా అమావాస్య కారుచీకట్లను చీల్చుకుంటూ స్ట్రీట్ లైట్స్ మిణుకు మిణుకు మంటున్నాయి. జనసంచారం బొత్తిగా లేదు.

"చాలా లేటయింది. నా మాట విని ఈ రాత్రి యిక్కడే ఉండి ఉదయం రైలుకు వెళ్ళండి. అయిదు గంటలకు నేనే మిమ్మల్ని లేపుతాను," అంటూ గది తలుపులు వేసి వచ్చి, అలారం సెట్ చేశాడు.

"కనీసం అందుకైనా ఒప్పుకోనంత మొండిఘటాన్ని కాదులెండి. రేపే వెళ్తాను, మీ యిష్టం," అని సుజాత గదిలో ఓ మూల చాప వేసుకుంది.

"థాంక్స్, గుడ్‌నైట్," అంటూ దివాకర్ లైట్ ఆర్పేసి మంచంమీద పడుకున్నాడు. తీయతీయని ఊహాలోకాలకు దారితీస్తూ నిద్రపోయాడు.

గడియారం అలారం కొట్టడంతో దివాకర్ లేచి కూర్చున్నాడు. వెనక్కి వాలి, తడుముకుంటూ లైట్ ఆన్ చేశాడు. సుజాత పడుకున్న చాపవైపు చూసి బిత్తరపోయాడు. గబాలున లేచి నిల్చొని "సుజాతా!" అని కేకవేశాడు.

గదిలో సుజాత లేదు. గది తలుపు వైపు వెళ్ళాడు. తలుపులు దగ్గరికి వేసి ఉన్నాయ్. మసకచీకట్లో కళ్ళు పొడుచుకుని రోడ్డువైపు చూశాడు, సుజాత జాడలేదు.

గదినంతా దివాకర్ కలయజూశాడు. ఆమె లగేజి కనిపించలేదు. టేబుల్‌మీద తన గోల్డు చెయిన్ రిస్టువాచీ లేదు. తన సూట్‌కేసు తీసి ఉంది. ఖరీదైన వస్తువులన్నీ మాయమైనాయ్. కంగారుగా పర్సు తీసి చూశాడు. అతనికి ముచ్చెమటలు పోశాయి. పర్సులోని మూడువేల రూపాయిలు కూడా దౌడు తీశాయి ! టేబుల్‌మీద ఒక చీటీ కనబడింది. అందులో రెండే ముక్కలు వ్రాయబడి ఉన్నాయి – 'మిమ్మల్ని మరవలేను.'

---




"వసూ !

ఎన్నాళ్ళకే నీ దగ్గరనుంచి ఉత్తరం! నీ 'అనూ'ని యింత త్వరలోనే మర్చిపోయావా? నా పెళ్ళి శుభలేఖ అందిందో లేదోనని మధనపడ్డా. అందే నువ్వు రాలేదని యిప్పుడే తెలిసింది. కనీసం జాబేనా రాశావ్. థాంక్స్! నువ్వు కాకినాడ వెళ్ళాక రాసిన ఒకే ఒక ఉత్తరమిది. నేను రాసిన రెండు లెటర్స్‌కి 'రిప్లై' ఇవ్వలేదు. నాతో స్నేహానికి స్వస్తి చెప్పావే అనుకున్నా. ఆ టైములో నువ్వు 'కౌలాలంపూర్' వెళ్ళినట్లు తెలిసింది.

నీ ఉత్తరం చూశాక, నీలో చిలిపి

తనం యింకా పోలేదనిపించింది. విశాఖ పట్నంలో మెడికల్ కాలేజీలో మనం గడిపిన మధుర క్షణాలు యింకా గుర్తొస్తూనే వుంటాయి. ఎన్నో విషయాల గురించి తర్కించే వాళ్లం కదూ ! నా చదువూ, నా అందం కాక నన్ను నన్నుగా చూసి యిష్టపడేవాడిని, ప్రేమ వివాహమైనాసరే, చేసుకుంటా ననే దాన్ని కదూ. నా మాట నిలబెట్టుకున్నా, ఫలితమే సుధాకర్‌తో నా పెళ్ళి.

ఇక పోతే నా తొలిరాత్రి అనుభవాలు రాయమని మరీ మరీ అడిగావ్ కదూ. తినబోతూ రుచెందుకే? సినిమాల్లో గర్భాదానం సీనుల్లా, చవకబారు సాహిత్యంలో శృంగారంలా నిజంగా థ్రిల్లింగ్‌గా వుంటుందా లేదా అని తెలుసు కోవాలని వుందా ? ప్రాణసఖివి నీ దగ్గర దాపరికం ఎందుకు. పూస గుచ్చినట్లు చెప్తా. ఓపిగ్గా విను మరీ.

'ఆన్సర్ టు ది పాయింట్ !' అనే నీ మాటలు మర్చిపోలేదు. అందుకే సరాసరి నీ పాయింట్‌కే వస్తున్నా.

ఆ రోజు రాత్రి తొమ్మిది గంటలకు పెట్టారు ముహూర్తం. ఆ క్షణంలో నా జీవితం మరో మలుపు తిరుగుతోంది. భయం, దిగులు, ఆనందం, ఆందోళన అన్నీ మిళితమై నన్ను చేష్టలుడిగిన దానిగా చేశాయ్. పాతకాలం చాదస్తం తో ఫంక్షన్ చెయ్యొద్దని అమ్మకి ముందే చెప్పా. నవ్వి వూరుకుంది అమ్మ. సాయంత్రం తలంటి స్నానం చేయిం చారు. మా మేనత్త మల్లెలతో జడ కుట్టింది. మా అక్క లిద్దరూ మా ఇంట్లో దక్షిణం గదిని సర్దడంతో సత మతమైపోసాగారు. బయట సుధాకర్ ఎవరితోనో మాట్లాడటం వినిపి చ సాగింది.

ముహూర్తం వేళ దగ్గిరవుతోందని తొందర చేశారు. నాకు, సుధాకర్‌కి తెల్ల బట్టలు యిచ్చి దీవించారు నాన్న గారు. పాలగ్లాసు చేతిలోపెట్టి గదిలోకి నెట్టి తలుపు వేసింది వదిన. సిగ్గు దొంతరలనుంచి తేరుకుంటూ గది అంతా కలియచూసా. ఎంతో నీటుగా సర్ది వుంది గది అంతా అగరువత్తుల పొగతో నిండి వుంది. మబ్బుల్లో చంద్రుడులా సుధాకర్ మంచంపై కూర్చొన్నాడు.

పాలగ్లాసు అందించా. గ్లాసు పక్కన పెట్టి తనపైకి లాక్కున్నాడు సుధాకర్. వసూ !

అంతరాయం కల్గించినందుకు క్షమించు. తర్వాత జరిగిన సంగతులు తెల్సుకునే ముందు, నా సొద కూడా వినక తప్పదు. అందులో కొంత నా స్వార్థంకూడా వుంది. నీ 'యింట్రెస్ట్'తో నా 'యింట్రెస్ట్' జతచేసి వ్రాయడమే ఈ లెటర్ ఉద్దేశ్యం. మధ్యలో సెన్సార్ వాళ్ళు కత్తెరిలా యిదేమి టనుకున్నా లాభంలేదు.

ఈ సుధాకర్ ఎవరు? ఇది 'అరేంజిడ్ మేరేజా' లేక 'లవ్ మేరేజా?' అతనేం చేస్తాడు? ఎలా నచ్చాడు! అనే సంగతు లేవీ నువ్వు అడగలేదు. అయినా చెప్తా విను.

హవుస్ సర్జెన్సీ చెయ్యడానికి నువ్వు కాకినాడ వెళ్ళావ్. నేనది కాస్తా కె. జి హెచ్. లోనే పూర్తిచేశా. ఆ రోజుల్లో సంగతి యిది.

మెడికల్ వార్డ్‌లో 'పోస్ట్' అయినప్పుడు తొలిసారిగా సుధాకర్‌తో పరిచయమయింది. అతను స్పెషల్ వార్డ్‌లో ఎడ్మిట్ అయ్యాడు. అతని కేసు నేనే చూశా.

తెల్లగా, సన్నగా వుండే సుధాకర్ అందగాడేనని చెప్పాలి. ఉంగరాలు తిరిగిన జుట్టు, అమాయకంగా కన్పించే అతని కళ్ళు, అతనిలో హైలైట్స్. మళ్ళీ మళ్ళీ చూడాలనిపించే ముఖాలలో సుధాది ఒకటి.

'గుడ్‌మార్నింగ్ డాక్టర్!' అంటూ విష్ చేసేవాడు రోజూ. అతనిలో హుందాతనమేగాని, వెకిలితనం ఎప్పుడూ కన్పటలేదు నాకు.

రక్త పరీక్ష చెయ్యడానికి అతని వేలు 'ప్రిక్' చేశా.

'మీకేమీ అనిపించదా, డాక్టర్?' అన్నాడు అమాయకంగా. అతని చెయ్యి పట్టుకున్నందుకా. లేక సూది గుచ్చినందుకా అన్న సందేహం వచ్చింది నాకు. అతని మొహంలో ఏ రకమైన భావాలు లేకపోయేసరికి, 'డ్యూటీ ఈజ్ డ్యూటీ, దట్సాల్' అన్నా.

ఇంటికి వెళ్ళాక కూడా ఎంత మర్చిపోదామన్నా సుధాకర్ గుర్తుకొస్తూనే వున్నాడు.

ఇకపోతే యింగ్లీషు నవల్లంటే నేను చెవికోసుకుంటానని నీకు తెల్సుగా. సుధాకర్ కూడా 'వొరోసియస్ రీడర్.' అతని బెడ్ ప్రక్కన ప్రతి రోజూ ఒక కొత్త నవల కనిపించేది. ఒక్కొక్క ఆథర్ గురించి అనర్గళంగా మాట్లాడేవాడు. అన్ని పనులు మానేసి అతని మాటలు వింటూ వుండాలనిపించేది.

డిస్చార్జ్ అయి వెళ్ళిపోయేటప్పుడు నాకు టాల్‌స్టాయ్ రచించిన 'అనాకర్ణినా' నవలని ప్రజెంట్ చేశాడు.

'మీ కభ్యంతరం లేకపోతే అప్పుడప్పుడు కలుసుకుంటా, ఐ లైక్ యువర్ కంపెనీ' అన్నాడు

అట్లాగే అన్నా అనాలోచితంగా.

అట్లాగని చీటికిమాటికి కుంటిసాకులతో నన్ను చూడ్డానికి రాలేదు. రోజులు గడుస్తున్న కొద్దీ నాకే అతన్ని ఒక్కసారి చూడాలనిపించేది.

ఒకరోజు సాయంత్రం సుధాకర్ వచ్చాడు. నేను పోగొట్టుకున్న విలువైన వస్తువు తిరిగి పొందిన ట్లనిపించింది. తనకి పరీక్షల మూలంగా రాలేకపోయానన్నాడు.

'ఏంచదువుతున్నా'రన్న కేజువల్‌గా.

'యూనివర్సిటీలో యమ్. ఏ. సైకాలజీ చేస్తున్నా. అదృష్టం వక్రించింది కాని లేకపోతే నేనూ మీ ప్రొఫెషన్‌లో చేరేవాడిని' అన్నాడు.

'చేరకపోవటమే మంచిదయ్యింది' అన్నా అనాలోచితంగా.

ఆ తర్వాత చాలాసార్లు సుధాకర్ కలుసుకున్నాడు. అతని భావాలు, ఆలోచనలు చాలా సెన్సిటివ్‌గా కన్పడేవి. అతని ప్రవర్తనలో వెకిలితనం ఎప్పుడూ బయటపడలేదు. అందుకే అతనితో షాపింగ్‌కి కాని, పిక్చర్స్‌కి కాని వెళ్ళడానికి సందేహించలేదు.

ఒకసారి యూనివర్సిటీలో డిన్నర్, వెరైటీ ఎంటర్‌టైన్‌మెంట్ ప్రోగ్రాం వున్నాయని నన్ను యిన్‌వైట్ చేశాడు. డిన్నర్ అయేటప్పటికి రాత్రి ఏడు గంటలు దాటింది. ఆలస్యమైపోయిందంటూ నన్ను నా హాస్టల్ దగ్గర దింపాడు. నేను లేటయిందని అభ్యంతరం చెప్పందే ఎందుకో ఈ మనిషికింత 'డెలికెసీ' అనుకున్నా. అతని తత్వం నాకు బోధపడలేదు. 'లోతైన మనిషి' అనుకున్నా.

ఇది యిట్లా వుండగా మన కాలేజీ 'వోల్డ్ స్టూడెంట్స్ డే' వచ్చింది. కాలేజీ సెక్రటరీ వచ్చి ప్రోగ్రామ్ యివ్వమని పట్టుబట్టాడు. నేను 'ఫ్రెషర్స్ డే' రోజున యిచ్చిన 'కుష్ఠిరోగి' ప్రదర్శన చాలా బాగుందిట. మళ్ళీ యిప్పుడు అది వెయ్యమని పట్టుబట్టాడు. ఇప్పుడది నేను వేస్తే, సిల్లీగా వుంటుందని నేనెంత మొత్తుకున్నా వినకుండా పేరు తీసుకొనిపోయాడు. తప్పనిసరైంది నాకు.

ఫంక్షన్‌కి సుధాకర్‌నికూడా యిన్‌వైట్ చేశా. ఆరేళ్ళ తర్వాత ఆ మోనో ఏక్షన్ వెయ్యాలంటే ఏమిటోలా అనిపించింది. ఎట్లాగో పూర్తి చేశా. అనుకున్న దానికంటే ఎక్కువే 'ఎప్లాజ్' వచ్చింది జనంనుంచి.

'నిజంగా కుష్ఠిరోగికన్నా అద్భుతంగా నటించారు' అన్నాడు సుధాకర్.

'నిజం కుష్ఠిరోగి నటించడు. బాధపడతాడు. వేషం వేసిన వాళ్ళే నటిస్తారు' అన్నా నేను.

మర్నాడు క్వాలిటీ రెస్టరెంట్‌లో ఐస్‌క్రీం తిని చీకటిపడుతుండగా బీచ్ వైపు నడిచాం. నిర్మానుష్యంగా వున్న చోట కూలబడ్డాం. సుధాకర్ ఏదో తటపటాయిస్తున్నట్లనిపించింది. నేను ఎదుర్కోవలసిన విషమయ ఘడియలు దగ్గరవుతోందేమో ననుకున్నా. బహుశా ఈ రోజు సుధాకర్ పెళ్ళికి ప్రపోజ్ చెయ్యొచ్చు అనిపించింది.

'నిన్న మీ ప్రదర్శన బాగుంది. కానీ అందమైన మీ మొహంమీద



ఆసహ్యమైన మేకప్ బొడిపలు ఏమిటోలా అనిపించాయ్' అన్నాడు.

'నిజంగా అందంగా వుంటానా ?' అన్నా.

'మాట లెందుకు. నాకే అదృష్టం వుంటే మీ అందాన్ని సొంతం చేసుకోనూ' అన్నాడు. తర్వాత ఏదో ఫీలవుతున్నట్లు కనిపించాడు.

నా గుండె వేగంగా కొట్టుకోసాగింది. సంభాషణ నే నూహించిన వైపే సాగుతోంది. నిమిషాలమీద ఆలోచించా. సుధాకర్‌ని జీవితభాగస్వామిగా చేసుకో టానికి తనకేమీ అభ్యంతరంలేదు. కానీ తనని యితను వాంఛిస్తున్నది కేవలం తన అందం చూసేనా ? నన్ను నన్నుగా చూసి ప్రేమించే వ్యక్తి కావాలి నాకు. ఇంతలో ఆలోచన తళుక్కుమని బుర్రలో మెరిసింది. తల వొంచుకుని యిలా అన్నా.

'మీరు యిప్పుడు ఏదైతే అదృష్టంగా భావిస్తున్నారో అదే మీ సొంతమయ్యాక దురదృష్టంగా పరిణమిస్తే సహించ గలరా ?'

అర్థంకానట్లు చూసాడు.

'నాలో మైల్డ్ వెరైటీ ఆఫ్ లెప్రసీ వున్నట్లు డయగ్నోసిస్ చేశారు. అందంగా ఆకర్షణీయంగా వున్న యిప్పటి నా మొహం కొంతకాలానికి స్టేజిమీద మేకప్‌లోలాగా వికృతంగా మారితే మీరు సహించగలరా?' అన్నా. నా అయిడియాకు నాకే మతిపోయింది.

నేను చెప్పిన సంగతి విని 'షాక్' తిన్నట్లయిపోయాడు సుధాకర్. పది నిమిషాలు మా యిద్దరి మధ్యా మౌనం తాండవించింది.

సుధాకర్ భయపడి వెనుకంజ వేసినట్లు తెలియగానే నేను నీరుగారి పోయా. నన్నుగా ప్రేమించే వ్యక్తి సుధాకర్‌లో లేదని తేలిపోయింది.

నేను సిటీబస్సు ఎక్కా. గుడ్‌నైట్ అంటూ చెయ్యి వూపాడు సుధాకర్. గుడ్ బై అన్నా అతనివైపు చూడకుండా ఎటో చూస్తూ.

రెండు రోజులు బాధపడ్డా, సుధాకర్ గురించి గొప్పగావూహించుకున్నందుకు. తాను పెట్టిన పరీక్షలో సుధాకర్ ఫెయిలయ్యాడు. బాహ్యసౌందర్యానికే విలువ యిచ్చే వ్యక్తిని తాను జన్మలో పెళ్ళిచేసుకోలేదు.

నాల్గురోజులు పోయాక మళ్ళీ కన్పడ్డాడు సుధాకర్. అతని గడ్డం మాసివుంది. ఈ నాల్గురోజులు నిద్ర పోయినట్లు లేదు.

'ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి, బీచ్‌కి వస్తారా?' అన్నాడు.

అయిష్టంగా వున్నా కుతూహలంకొద్దీ సరే నన్నా. బీచ్‌లో కొంతసేపు మౌనంగా కూర్చొన్నాక సుధాకర్ మాట్లాడాడు.

'నేను పెళ్ళి చేసుకోటానికి నిశ్చయించుకున్నా.'

'సంతోషం' అన్నా ముక్తసరిగా.

తడబడ్డాడు సుధాకర్. 'జీవితంలో మొట్టమొదటిసారి పెళ్ళి చేసుకోడానికి నిశ్చయించుకున్నా. అదికూడా ఎవరితోనో కాదు. మీ కభ్యంతరం లేకుంటే మిమ్మల్నే' అన్నాడు.

నా చెవులని నేనే నమ్మలేకపోయా. నా అంచనాలు వమ్ము కాలేదు. సుధాకర్ నెగ్గాడు. నావా డయ్యాడు. అతని వొడిలో వాలి చేతుల్లో మొహం దాచుకున్నా.

వసూ! నేరక దీని సంగతి అడిగానని విసుక్కుంటున్నావా? ఇక నా సొద ఆపి నీ పాయింట్‌కి వస్తున్నా.

సరే. తడబడే కాళ్లతో సుధాకర్‌ని జేరి పాలగ్లాసు అందించా. పాలగ్లాసు పక్కన వుంచి తన కౌగిలిలో పొదివి పట్టుకున్నాడు పారవశ్యంలో తేలిపోయా నేను.

ప్రక్కకు జరిగి, 'నా సంగతి తెల్సి




కూడా ఎట్లా పెళ్ళాడారు ?' అని అడిగా.

సుధాకర్ నవ్వాడు.

'నువ్వు చెప్పిన సంగతి విన్నాకే నేనసలు పెళ్లంటూ చేసుకోవాలని నిశ్చయించుకున్నా' అన్నాడు.

'నేను చెప్పకపోతే ఆజన్మబ్రహ్మచారిగా వుండిపోయేవారా?' అడిగా.

తలపూపాడు సుధాకర్. 'హైద్రాబాద్‌లో ఒక మెడికల్ చెకప్ సందర్భంలో నా శరీరంపై వున్న ఒక తెల్ల మచ్చమీద మీమాంస వచ్చింది. 'బయాప్సీ' చేయగా 'యిండిటర్మినేట్ టైప్ ఆఫ్ లెప్రసీ' (ఒక రకమైన కుష్ఠురోగం) అని రిపోర్టు వచ్చింది. ఆనాడే నేను పెళ్ళి చేసుకోవాలనే తలంపుకు ఉద్వాసన చెప్పా. మీ సంగతి విన్నాక నేను నా జబ్బు గురించి తెల్సుకున్న రోజున పడినంత క్షోభ మళ్ళీ పడ్డా. ఇద్దరి జీవితాలు ఎందుకు వృధా కావాలి అనిపించింది. ఒక లెప్రసీ పేషంట్ మరొక లెప్రసీ పేషంట్‌ని చేసుకుంటే జరిగే అన్యాయం గాని, అనర్థకం కాని నాకు కన్పడలేదు. బ్రతికినంత కాలం జీవితం కులాసాగా గడపడమన్నది మన చేతుల్లో వుంది. ఇకపోతే మన మూలంగా మన సంతానం ఈ దురదృష్ట నికృష్టపు వ్యాధికి దాసులు కాకూడదు. అందుకే బాగా ఆలోచించి 'వేసక్టమీ' చేయించుకున్నా! అన్నాడు.

నా నెత్తిమీద పిడుగు పడినట్లయింది. నా పరీక్షలో సుధాకర్ నెగ్గాడు.

దేవుడి పరీక్షలో నేను వోడిపోయా.

ఒక మిగిలిన రాత్రి ఎలా గడిచిందో నువ్వే వూహించగల వనుకుంటా.

ఇట్లు
నీ ప్రియసఖి
అనూరాధ.



———




## 16

పిల్లలతోపాటు శారదకూడా బయలుదేరి వచ్చేసరికి ప్రసాద్‌కి చాలా సంతోషం కలిగింది. "నిన్ను నేనే రమ్మనమని అడగాలనుకున్నాను. ఎందుకంటే, వీళ్ళని కంట్రోలు చేయడం నా వల్లకాదు. మధ్యలో ఎక్కడైనా ఎటయినా వెళ్ళిపోయారంటే కష్టం," అన్నాడు.

అందరూ పబ్లిక్‌గార్డెన్‌కి వచ్చారు. పిల్లలు శారదతో ఒకటే మాట్లాడుతున్నారు. ప్రసాద్ వాళ్లమాటల్లో జోక్యం కలిగించుకోలేదు! అక్కడున్న చెట్టుని ఆనుకొని కూర్చున్నాడు. పెద్దపాప కళ్ళకి జేబురుమాలు కట్టారు. చేతులు చాస్తూ వెతుకుతోంది. శారద దొరికింది. మళ్ళీ శారదకి కట్టారు. శారద ఎవరినీ పట్టుకోలేకపోతోంది. వాళ్ళు విరగబడి నవ్వుతున్నారు. శారద కూడా నవ్వుతోంది.

ప్రసాద్ వాళ్ళనే చూస్తున్నాడు.

వాళ్ళు ఎంత హాయిగా నవ్వగలుగుతున్నారు!

తను నవ్వడం అంటేనే ఏమిటో మర్చిపోయాడు.

ఎంత దురదృష్టకరమైన బ్రతుకు తనది !

హత్య చేయకుండానే హంతకు డనిపించుకున్నాడు !

పిచ్చివాడు కాకుండానే, పిచ్చి వాడిగా హాస్పిటల్లో రెండు నెలలు వున్నాడు !

ప్రసాద్ ముందునుంచే యిద్దరు భార్యాభర్తల జంట, పిల్లల్ని చెరో చెత్తో నడిపించుకుంటు మెల్లగా వెళుతున్నారు.

వాళ్ళు దూరంగా, నవ్వులతో కేరింతలు కొడ్తున్న శారదని, పిల్లల్ని చూస్తూ వెళ్తున్నారు.

ఆ భార్యాభర్తలని చూడగానే ప్రసాద్ గుండెల్లోంచి నిట్టూర్పు వచ్చింది !

తన జీవితంలో అంతా వక్రమే !

అందరిలా తనూ పెళ్ళిచేసుకున్నాడు. కానీ సుఖం, నిశ్చింత ఎరిగున్నాడా ! ఆ దాంపత్యం సరిగ్గా సాగిందా ! హు ! అదొక నరకం ! జయ పోయిం తర్వాత తన ప్రాణం హాయిగా వుంది !

హాస్పిటల్‌కి వెళ్ళేవరకూ తనది ఒకరకమైన జీవితం ! అక్కడినుంచి తిరిగివచ్చిన తర్వాత మరో జీవితం అయింది !

ఆ జీవితం శిథిలమైందని, ఆ జ్ఞాపక రేఖలు చెరిగిపోయినాయని భావించాడు.

ఈ పిల్లలు మళ్ళీ యిలా రావడంతో అవన్నీకలకబారుతున్నాయి. జయకి కాస్త బుద్ధివుంటే, కాస్త మంచితనం వుంటే, తన జీవితమే పూర్తిగా వేరుగా వుండేది. తాళి కట్టిన భర్త అనే గౌరవం అయినా చూపించకుండా, గడ్డి పరకకంటే క్రూరంగా చూసింది !

తనకేం తెలుసు ? వాళ్ళు చూపించే అభిమానం అంతా నిజమే ననుకున్నాడు. కాలేజీలో చదువుతుండగా తను ఎలా ఉండేవాడు! పిక్నిక్‌లో,పార్టీలో, కాలేజీలో కలిసినప్పుడల్లా జయ తనని కవ్విస్తుంటే, అది నిజమైన ఆకర్షణ అనుకున్నాడు ! ఒక డబ్బుగల కుర్రాడికి వేసే గాలం అనుకోలేదు !

జయ తల్లిదండ్రులు ఎంత బాగా మాట్లాడేవారు ! ఎంత మర్యాద చేసే వారు ! ఛీ ! ఛీ ! అంతా నటనే ! అంతా మోసమే! కూతురుకి కాణీకట్నం లేకుండా, స్థితిమంతుడైన భర్తని తీసుకు రావాలనే పన్నాగం అది ! వొట్టి దగాకోరు మనుష్యులు ! కిరాతకులు ! వంచకులు ! విశ్వాసఘాతకులు !

జీవితపు ఘర్షణతో వుక్కిరిబిక్కిరి అవుతూ, ఏం చెయ్యాలో, ఆ సమస్యలు ఎలా తీర్చాలో తెలియక సతమతమౌతూ అంధకారంలో వెతుకులాడుతుండగా పుట్టిన పిల్లలు వీళ్ళు !

జయకీ, తనకీ మధ్య సామరస్యం వుంటేగా యీ పిల్లల్ని ప్రేమించటానికి, లాలించటానికి ! ఎప్పుడూ గొడవే ! ఎప్పుడూ అరుపులే! ఎప్పుడూ ఏడుపులే! ఆ యిల్లే ఒక పిచ్చాసుపత్రి ! నిజం

చెప్పాలంటే తనకి పిచ్చాసుపత్రిలోనే హాయి అనిపించింది !

శారద చిన్నపాప కళ్లలో ఏదో పడితే, దగ్గరకు తీసుకుని వూది తీస్తోంది !

ఒక్కనాడయినా జయ పిల్లల్ని తన దగ్గరకు తీసుకువచ్చిందా ! ఒక్కనాడయినా తామిద్దరూ, యిప్పుడు వెళ్ళిన ఆ భార్యాభర్తల్లా కలిసి హాయిగా వెళ్ళారా ?

అసలు ఎంత పెళ్ళిచేసుకోవాలని అనుకున్నా, పెళ్ళికి ముందు శారీరక సంబంధం వుండకూడదు ! దానిలో చాలా గొడవలు వున్నాయి ! మన పూర్వీకులు ఎన్నివిధాలుగానో ఆలోచించే యీ ఆంక్షలు పెట్టారు ! అది వారు చెప్పే జాగరూకత గాని, చాదస్తం కాష్లే కాదు !

అందరిలా తనుకూడా మామూలుగానే పెళ్ళిచేసుకుంటే, తనుకూడా తన స్నేహితులందరిలాగానే పెళ్ళాం బిడ్డలతో సఃక్షణంగా వుండేవాడు ! తను అలా చేయలేదు ! జయ ఆకర్షణ కోరలకి చిక్కాడు ! జయ ఎట్లా చెబితే బొమ్మలా అట్లా చేసాడు ! దానికి చివరికి ఫలితం యిది !

అయినా అదేం కుటుంబం ! పైకి చూస్తే ఎంతో సంస్కారం వుట్టిపడేట్టు నటన ! లోలోపల అసలు వుద్దేశాలు వేరు ! జయ తండ్రి వొట్టి చవట ! ఇంటికి పేరుకి మాత్రమే యజమాని ! యింటి చక్రం అంతా జయతల్లి చేతిలో వుంది.

ప్రసాద్ చెట్టు మొదట్లో కూర్చున్నాడు

ఎన్ని సంవత్సరాలయినా అవి మరుపుకి రావుకదా ! వదిలించుకోవాలన్నా ఆ జ్ఞాపకాలు వదలవు !

జయ తల్లి భాగ్యమ్మకి చదువు సంధ్యలు లేవు. ఉద్యోగం సద్యోగం లేదు. అయితేనేం ! మనుష్యుల్ని, ఊళ్ళని మింగేసే తెలివితేటలు అపారంగా వున్నాయి ! భాగ్యమ్మగారంటే ఎంతో పేరు ! ఎంతమందికో తెలుసు ! ఆవిడకి యిద్దరు కూతుళ్ళు వున్నారు. పెద్దమ్మాయి జయ, చిన్నమ్మాయి పావని.

జయ కాలేజి చదువుకి రాకుండానే, బోలెడన్ని పెళ్ళిసంబంధాలు వచ్చాయని ఆవిడ చెప్పేది !

జయ, పావని యిద్దరూ అందంగానే వుంటారు ! వాళ్లని మరింత అందంగా ఆకర్షణీయంగా తయారుచేసే విద్యలు భాగ్యమ్మగారికి బాగా తెలుసు !

ఆడపిల్ల లిద్దరికీ ఎంతో స్వతంత్రం యిచ్చేది !

ఆ పిల్లల స్నేహితులం అంటూ మగపిల్లలు వస్తే వాళ్ళని ఆదరించేది ! టిఫిన్లు పెట్టి కాఫీలు యిచ్చి ఆప్యాయత చూపేది !




కానీ... కానీ...ఆవిడ చూపేదంతా నటన అని ఎవరికి తెలుసు! మగపిల్లలకి అసలే తెలియదు! కాస్త ఆలోచిస్తే అర్థం అవుతుంది! కానీ జయ ఆకర్షణలో పడి, దీపంచుట్టూ శలభాల్లా ఆ యింటికి జయకోసం వెళ్లేవాళ్లకి యిది గమనించే ధ్యాస ఎక్కడ ? భాగ్యమ్మ గారు ఎవరికైనా ఒక కప్పు కాఫీ ఇస్తే, పది కప్పుల కాఫీ అడిగేటంత పని చేయించుకునేది ! 20 కప్పుల ఖరీదు గల వస్తువులు బ్రెడ్ అనో, కేక్ అనో, కూరలు అనో మళ్ళీ వాళ్ల దగ్గరనుంచి రాబట్టుకునేది ?

ప్రసాద్ కూర్చోలేనట్టుగా పచ్చ గడ్డిలో వెనక్కి వాలి పడుకున్నాడు ! చీకటి పడింది ! ఆకాశంలో నక్షత్రాలు కన్పిస్తున్నాయి !

అతని మనసు గత జ్ఞాపకాల కెరటాలమీద ఎగిరెగిరిపడుతూ, ఆటు పోట్లకి గురి అవుతోనే వుంది యింకా !

జయ ఇంటికి వేణుతో ఒకసారి వెళ్ళాడు తను ! అదే తన ఖర్మకాలిన రోజు !

అదేం చిత్రమోగానీ, భాగ్యమ్మగారి మాటలు మాయమంత్రంలా తనమీద పనిచేసినాయి !

తనకి యిప్పటికీ యింకా గుర్తుంది.

"ఏం చదువుతున్నావు బాబూ ?" ఎంతో ఆప్యాయంగా అడిగింది.

"బి. కామ్ సెకండియర్ అండీ."

"మీ నాన్నగారి పేరేమిటి ?"

"చలపతిరావుగారు."

"ఏంచేస్తారు ?"

"వీళ్లకి బట్టలదుకాణం వుందండీ!" వేణు చెప్పాడు.

"అలాగా."

తనకి ఆడవాళ్లతో మాట్లాడడం అంటే ఎంత సిగ్గో !

కానీ ఆవిడ ఆ సిగ్గుని వదిలించేసింది.

"నీ పేరేమిటన్నావు ?"

"భవానీప్రసాదండీ." వేణు మళ్ళీ చెప్పాడు.

"నువ్వు ఆగు వేణూ. ఆ అబ్బాయికి మాటలు రావా ! ఏది ! జయ ఎక్కడ ? జయా..." ఆవిడ పిలిచింది

"వస్తున్నా మమ్మీ !"

జయ వచ్చింది ! జుట్టు విరబోసుకుంది ! స్కర్టు, బ్లవుజు వేసుకొంది. కాళ్ళు మోకాళ్ళ పైవరకూ నగ్నంగా కన్పిస్తున్నాయి ! నున్నగా నిగనిగలాడుతూ మెరుస్తున్నాయి

"హాయ్ !" అంటూ వచ్చి కూర్చుంది.

"మా ఫ్రెండ్ భవానీప్రసాద్ జయా !" వేణు పలకరించాడు.

"జాంపండులా వున్నాడు. కొరుక్కు తినేయబుద్ధేస్తుంది." ముక్కు విరిచి నవ్వుతూ అంది. తను సిగ్గుతో ముడుచుకు పోయాడు. జయ పెదవులు కాస్త లావుగా ఉన్నాయి! జయ కూర్చోవడం, నవ్వటం, మాట్లాడటం అంతా స్టయిల్ గానే వుంది !

"రేపు సినిమాకి వెళ్దామా ?"

"బాబీ పిక్చరేనా ?"

"అవును. రిజర్వ్ చేయించాను."

"ఓ. కె." అంది జయ.

తల్లిని సంప్రదించకపోవడం ఆశ్చర్యం వేసింది తనకి.

తను, వేణు వెళ్ళటానికి లేచారు. భాగ్యమ్మగారు జయని పిలవగా వచ్చింది.

"మంచిదినాయనా ! వెళ్ళిరండి ! భవానీప్రసాద్ ! నువ్వు కూడా అప్పుడప్పుడు వస్తుండు !" అంది.

యింటికి తిరిగివస్తుండగా అన్నాడు "ఆ అమ్మాయి తల్లిని అడగకుండానే సినిమాకి వస్తానంది ! వాళ్ళమ్మ వద్దంటే?"

"అదంతా మన కెందుకు ? జయ తనే చూసుకుంటుంది !"

అన్నట్లే మర్నాడు జయ సినిమాకి వచ్చింది. నిన్నటికంటే అందంగా వుంది ! జయని ఆ బట్టల్లో చూస్తే ఎవరయినా ఏ లక్షాధికారి కూతురో అనుకుంటారు ! తన ప్రవర్తన, ఠీవి అలా వుండేవి !

ఆ రోజు ఖర్చంతా వేణుదే ! చాలా అయింది !

జయని టాక్సీలో ఇంటిదగ్గర దింపి, ఇంటికి వస్తుంటే, వేణు, ఒరేయ్ ! వున్న డబ్బంతా అయిపోయిందిరా ! ఒక 20 రూపాయలు వుంటే అప్పు యివ్వు," అన్నాడు.

తను 20 తీసి యిచ్చాడు.

ఇట్లా వేణు ముందు ఖర్చుపెట్టి, తర్వాత తనదగ్గర లాగేవాడు ! ఎప్పుడు చూసినా డబ్బు అతను ఖర్చు పెడుతున్నట్టే వుండేది! పర్స్ మాత్రం తనది ఖాళీ అయేది !

జయ పరిచయ ఆకర్షణ తనకి టైఫాయిడ్ జ్వరంలా పట్టుకుంది. రోజూ జ్వరం వచ్చినట్టుగా, రోజూ ఆ యింటికి వెళ్లాలని అనిపించేది ! ఎంత వద్దను కున్నా కాళ్లు అటే లాగేవి ! ఒంటరిగా వెళ్లాలంటే భయం ! వేణుని అడగా లంటే మొహమాటం !

ఒక్కోసారి జయే తమ రూమ్‌కి వచ్చేది !

జయని చూస్తుంటే తన ప్రాణం లేచివచ్చేది !

జయ సంకోచంలేకుండా తనతో మాట్లాడేది.

"మీరు మా యింటికి రావడంలేదే ?"

"పరీక్షలు దగ్గరకి వస్తున్నాయి."

"సాయంత్రం ఒక్క అరగంట వస్తేనే టైమ్ వృథా అవుతుందా ?"

ఆ చూపులు ఆకర్షణకి 'ఎరలు' వున్నాయి! వాటికి తను చిక్కుకున్నాడు! అవి విడిపించుకోలేని కోరలని తర్వాత తెలిసింది.

జయకోసం. జయ యింటికి వెళ్లడం కోసం, తను వేణు రూమ్‌లో చేరేవాడు! ఇంటిదగ్గర వేణుతో కలిసి చదువు కుంటున్నానని అనేవాడు ! దాని ఫలితంగా వేణు రూమ్ అద్దెలు, చాకలి ఖర్చులు, కాఫీఖర్చులు తను భరించాల్సి వచ్చేది !

ఇంట్లో చూడబోతే అక్కయ్య యిచ్చిన ప్రతి రూపాయికి లెఖ్ఖలు అడిగేది ! లెఖ్ఖల్లో ఆవిడని మోసం చేయటం చాలా కష్టం ! తండ్రిని అడిగితే అక్కయ్యని అడగమనేవాడు. అక్కయ్యని అడిగితే 'ఎందుకు నీకు డబ్బు' అని లక్ష ప్రశ్నలు వేసేది తప్ప రూపాయి కూడా యిచ్చేది కాదు.

( సశేషం )






కుండపోతగా కురుస్తున్న వర్షంలో గూడు చెదిరి దిక్కులేక గిలగిలా కొట్టుకుంటున్న పిల్లల పక్షిలా 'మూడ్రోజులుగా జ్వరతీవ్రతచే కుక్కి మంచంలో పడుకుని కన్ను తెరవని, భార్య దగ్గర అయోమయంగా కూర్చున్నాడు భద్రయ్య. భద్రయ్య చుట్టూ చేతికి అందుకురాని పిల్లలూ, మనవలూ తిండీ తిప్పలూ సరిగాలేక, కేశసంస్కారం అసలే తెలియక కొబ్బరిపీచుల్లాటి జుట్టుతో అస్థిపంజరాల్ని కూచోబెట్టినట్లు కూర్చున్నారు భద్రయ్యకి ఇంటినిండా బోలెడంతమంది జనం ఉన్నా, భార్యకేదేనావస్తే చెయ్యటానికి ఆడదక్షత మాత్రంలేదు. అందుకే భద్రయ్య అనుకుంటాడు అప్పుడప్పుడు. 'తనదీ, తన భార్యదీ ఒకే జాతకమనీ, తా మసలు కష్టాలనుభవించటానికే పుట్టామ'ని. ఆ వేదాంతంతోనే భద్రయ్య తన ఏభయ్యేళ్ళ జీవితాన్ని తిరగేసాడు.

మంచి వయసులో ఉన్నపుడు, అంటే యౌవనం ఉరకలు వేస్తున్న

పాతికేళ్ళ ప్రాయంలో ఎవరేనా 'నీ పేరేమిటి?' అని అడిగినప్పుడు 'వీర భద్రరావ్' అని గొప్పగా చెప్పుకొనేవాడు. తాసి-తండ్రి పోయి, కుటుంబ భారం తన భుజస్కంధాలమీద పడినప్పుడు, జీవితంలో తాను సుఖపడాల్సిన రోజులు చాల దూరంలో ఉన్నాయని అంచనా వేసుకునే సమయంలో బాధ్యతల బరువులకు లొంగిపోయిన భద్రయ్యని 'నీ పేరేమిటి' అని అడిగినప్పుడు 'వీర భద్రం, అని చెప్పుకునేవాడు. తరువాత్తరువాత భద్రయ్యకో ఆడదాని అవసరం కలిగి, పెళ్ళిఖర్చు భరించుకో లేక, తనకి బాగా తెల్సిన రంగమ్మని తెచ్చుకొని కాపురం చేస్తూ ఆరుగురు పిల్లల తండ్రయి, ఆ పిల్లల నోటికి సరిగా తిండిపెట్టలేక, అప్పులు చేస్తూ, అవి తీర్చుకోలేక 'ఛీ,ఛీ' అని అనిపించుకుంటున్నపుడు 'నీ పేరేమి టయ్యా?' అని అడిగితే ఒత్తుకూడా తీసేసి, మనిషి అష్టవంకర్లు తిరిగిపోతూ, 'బద్రయ్య' అని సమాధానం చెప్పటం నేర్చుకున్నాడు. ఆ తరువాత పెద్ద కూతురి సంసారం బుగ్గయిపోయి, గంపెడు పిల్లలతో యిల్లు చేరినప్పుడు, ఆ తరువాత మరికొద్దిరోజులకే లోకం విడిచి అది వెళ్ళిపోయినప్పుడు, తిండి లేక, ఆకలిబాధకి తట్టుకోలేక తన రెండో కొడుకు బ్రతుకుతెరువుకోసం సులభమైన మార్గం కనిపెట్టి కొన్నాళ్ళు జేబులు కత్తిరించి, ఆ తరువాత పట్టుబడి చావుదెబ్బలు తిని తన కళ్లముందు చేతికి బేడీలతో జైలుకి వెళ్ళినప్పుడు, తనకి తెలియకుండా కూతురు పిల్లలు ఆకల్తో ముష్టి అడుక్కుంటున్నపుడు, ఎవరైనా తెలిసినవాళ్ళు భద్రయ్యని 'నువ్వెవరు? నీ పేరేమిటి?' అనే వివరా లడిగితే దైన్యంగా, మూటగట్టిన బాధల్ని పిండుతున్నట్లు నీరసంగా 'దిక్కు-మాలోడు' అని చెప్పడానికి పూర్తిగా అలవాటుపడిపోయాడు.

భద్రయ్యకి తన జీవితాన ఏదో రోజున వెన్నెల అకస్మాత్తుగా వచ్చేస్తుం దని, తానప్పుడు ఆనందాల పల్లకిలో హాయిగా విహరిస్తాననీ, పూర్వంలా పిచ్చిగా ఆశించటం ఏనాడో మాను కున్నాడు. ఈ ఏభయ్యేళ్ల జీవితంలో భద్రయ్య ఒకటే నేర్చుకున్నాడు. ఆ పూటకి ఉంటే కడుపునిండా (కాకపో యినా) తినేయటం ... అనవసరంగా దేనికీ బాధపడిపోకుండా అన్నిటికీ ఆ భగవంతునిపైనే భారంవేసి కంటినిండా కునుకుతియ్యటం !

అందుకే-భద్రయ్య కి ప్రక్క పడుకో గానే నిద్రవచ్చేయటం మొదలు పెట్టింది. రానురాను ఈ నిద్ర ఎక్కువయి పోవటం వలన పట్టపగలు కూడా ఎక్కడేనా కూర్చుంటే కళ్ళమీదికి నిద్రాదేవత వచ్చి వ్రాలటం మొదలుపెట్టింది. అందు చేతనే భద్రయ్య వనజమ్మగారిచేత

చీవాట్లు కాయటం ... ఉద్యోగంనుంచి తొలగించేస్తానని ఆమె కేక తేయటం... భద్రయ్య బ్రతిమలాడుకోవటం పరిపాటి అయిపోయింది. కుక్కిమంచంలో పడుకున్న భార్యదగ్గర కునికిపాట్లు పడుతున్న భద్రయ్యకి. 'ఆరో గంటయే సరికి వచ్చి పట్లుదులపాలి', అని మరీ మరీ చెప్పిన వనజమ్మ కలలో కనిపించినట్లు జ్ఞాపకంవచ్చి త్రుళ్ళిపడిలేచాడు. అప్పటికే ఎనిమిదోగంట సైరన్ 'బంయ్' మని ఊదేసి పావుగంట దాటిపోయింది. ఈపాటికి వనజమ్మగారు కారాలు, మిరియాలు నూరుతుంటారు. 'ఇయ్యాల ఆయమ్మకి ఏమని సంజాయిసీ సెప్పుకోవాల? తన కట్టాల్ని ఆయమ్మకి ఎలా సెప్పుకోవాల? సెప్పుకుంటే మాత్రం ఆ యమ్మకి అర్థమయితేకదా?' అని గాభరా పడిపోతూ అక్కడినుంచి లేచిపోయాడు భద్రయ్య.

నిజమే!

వనజమ్మకి భద్రయ్య కష్టాలెలా తెలుస్తాయ్ ?

నెలలో ఏ కొద్దిరోజులు మాత్రమో తిండితింటూ, మిగతారోజులు కాళ్ళు ముడుచుకుని మంచినీళ్లతోనో, బెల్లపు నీటితోనో కడుపు నింపుకుని పడుకుని వంటినిండా రోగాలతో కుళ్ళిపోతూ, రోగంవస్తే మందులేక కుక్కిమంచం మీద పడేడుస్తూ, తన కడుపు మాడిపోతున్నా చంటిదాని కిన్ని మెతుకులైనా లేవే అని కుమిలిపోతున్న రంగమ్మలాటివాళ్లా జబ్బుతో పడుకున్న పెళ్లానికి మందిప్పించలేక, ఆకలితో ఉన్న పిల్లలకి తిండి పెట్టలేక, తను తిన్నాడో లేదో, తనకి ఆకలేస్తుందో లేదోనని కూడా మరిచిపోయి, 'యజమానురాలికి ఎలా సంజాయిషీ చెప్పటమా' అని ఆలోచించే భద్రయ్యలాటి వాళ్ళున్నారని, వనజమ్మకి మాత్రం ఎలా తెలుస్తుంది ?

వనజమ్మ చిన్నప్పటినుంచి ఎంత గారాభంగా పెరిగిందని ? వనజ చిన్నతనంలో...చాలా చిన్నప్పుడు...అంటే ఆరేళ్ళ ప్రాయంలో ఉన్నప్పుడు తనడిగిన వస్తువు వెంటనే తెచ్చిఇవ్వలేదన్న కోపంతో తన చేతిలోఉన్న చెంచా ఆయమ్మపై విసిరికొట్టినప్పుడు, దాని తలనుండి రక్తం ధారగా కారినప్పుడు చుట్టూరావున్నవాళ్ళూ, తండ్రీ, తల్లీ కూడా వనజమ్మకి 'ఆయా' కోపం తెచ్చినందుకే ఎంతో బాధపడ్డారుకాని... 'ఆయా' తల కన్నంపడి రక్తం కారినందుకు ఎవరూ వనజమ్మని కన్నెర్ర చేసి కూడా చూడలేదే ?

అలాగే మరోసారి–

'వనజ' ఇంగ్లీషు కాన్వెంట్‌లో చదువుకుంటున్నపుడు సాయంకాలం వనజని ఇంటికి తీసుకురావటానికి కొద్ది నిమిషాలు ముందుగా వెళ్ళనందుకు వనజకు చాలా కోపం వచ్చేసింది కారు

డ్రైవరుమీద కోపంతో ఇంటికొచ్చేసి కారు దిగి యింట్లో పుస్తకాలు విసిరికొట్టి "డాడీ! ముందు ఈ డ్రైవర్ని ఉద్యోగం లోంచి తీసేస్తావా ? నన్నే చదువు మానేయమంటావా" అని చాలా సీరియస్‌గా కూతురు అడుగుతున్నపుడు డ్రైవరుకు వెళ్ళవలసిన డబ్బు లెక్కగట్టి ఉద్యోగంనుండి తొలగించేసాడే కాని 'ఏం తప్పు చేసాడ'ని కూతుర్ని ప్రశ్నించలేదు వనజ తండ్రి.

అందునుంచి—

'ఆమెకు సేవకుల కష్టా లెలా తెలుస్తాయి?'

అంతేకాదు—

'వనజ ఎనిమిదో తరగతి చదువుతునప్పుడు పధ్నాలుగు రోజులు టైఫాయిడ్ జ్వరంతో మంచం ఎక్కినపుడు, గంట గంటకు ఆమె పరిస్థితెలా ఉందని తెలుసుకోవటానికి పెద్దపెద్ద డాక్టర్లు వస్తూనే ఉండేవారు. ప్రతి సాయంకాలం 'వనజ' కెలా ఉందో తెలుసుకుందామని వాళ్ళ స్కూలు టీచర్లు, పిల్లలూ వచ్చి చూసిపోతూనే ఉండేవారు. వచ్చేటప్పుడు పళ్ళూ, బిస్కట్లూ కుప్పలుగా తెచ్చి పోస్తుండేవారు. జ్వరంనుంచి కోలుకున్నాక 'వనజ' తనకి ఎంత విలువ ఉన్నదీ నిజంగా తెలుసుకుంది! జ్వరం పడి లేచిన తరువాత నిజానికి వనజ ఆ ఇంటికి మోనార్కే అయింది. అప్పట్నించే 'ఎవరు ఏ పని ఆ ఇంట్లో చెయ్యదలచుకున్నా వనజమ్మకి చెప్పి మాత్రమే చెయ్యాలి!' అనే రూలు పాసయింది ఆ ఇంట్లో.

యవ్వన వసంతంలో అడుగిడుతున్న సమయంలో ఆమె కాలేజీలో చేరింది. ఆ సమయంలో సంపదలు ఆమెకి మరింత సౌకర్యాన్ని ప్రసాదించి ఆమెను పూవుకంటె కోమలంగానూ మెరుపు తీగ కంటె అందంగానూ చేసాయి. "కాలేజ్ బ్యూటీ" అయి చాలమందిని పిచ్చి వాళ్ళని చేసేసింది. కాని- 'వనజ' వాళ్ల పిచ్చిలో పడిపోయి పిచ్చిదిమాత్రం కాలేదు.

కారణం-

తనకోసం నానా అవస్థలూ పడి పోతున్నవాళ్ళూ, తనతో తన కాలేజీలో చదువుకుంటున్నవాళ్ళూ ఎవరూ తనకి సరిపోయినవారూ ... తన ఎన్నికకు తగినవారుగానూ కనిపించలేదు వనజకి.

అందునుంచి వాళ్ళవేపు కనీసం ఓ చూపైనా విసరడానికి ఆమె మనసు ఇచ్ఛగించేది కాదు. ముందుకొచ్చి సూటిగా తమ అభిప్రాయం చెప్పటానికి కూడా వాళ్ళకి ధైర్యం చాలేదికాదు!

వనజకు ఒక్క అందం మాత్రమే కాదు...అధికారం ఉంది. అధికారమే కాదు...అహంకారం ఉంది. ఆత్మాభిమానం ఉంది. తెలివితేట లున్నాయి. ఒక విషయాన్ని నలుగురి ముందూ

సభలో కూడా ధైర్యంగా చెప్పగలిగే సామర్థ్యం కూడా ఉంది.

ఓసారి వనజ-

ఇంటర్ కాలేజస్ ఇలక్యూషన్ కాంపిటీషన్‌లో "గరీబీహఠావో" అన్న విషయంమీద చాల గమ్మత్తుగా ... అందంగా మాట్లాడింది అప్పుడే..."మానవులంతా ఒక్కటే ... అందరు పీలుస్తున్నదీ ఒక్కటే గాలి ... మానవులంతా త్రాగుతున్నది అదే నీరు...అందరిలోను అదేరక్తం ప్రవహిస్తోంది. అందరికీ కన్నూ ... ముక్కూ ... కాళ్ళూ ... చేతులూ అన్నీ సమంగానే ఇచ్చాడా భగవంతుడు.

అయితే మరి సమాజంలో ఈ ధనిక-పేద అనే వర్గాలు ఎందుకేర్పడ్డాయన్నది ఇప్పటి ప్రశ్న!

మనుషుల్లో తెలివైనవాళ్లూ...తెలివి తక్కువవాళ్లూ ఉన్నారు ... తెలివైన వాళ్ళు తమ తెలివితేటల్ని ఉపయోగించుకుని ఇంకా గొప్పవాళ్లవుతున్నారు. తెలివి తక్కువ వాళ్ళు...కష్టపడలేక...ఎలా డబ్బు సంపాదించుకోవాలో తెలియక ... చేతకాక...గొప్పవాళ్ళని చూచి...అసూయతో... ద్వేషంతో... వాళ్ల ఆస్తులు అపహరించాలనీ...వాళ్ల జేబులు కొట్టాలని...వాళ్ళ బీరువాలు కన్నం వేయాలని కుత్సితంగా ఆలోచిస్తున్నారు. అందుకే వీళ్లు మరింతగా దిగజారిపోతున్నారు. మన సమాజంలో ఒక సామెత ఉంది. "ఒక కన్నుపోయినందుకు ఏడవకు...రెండవకన్ను బాగున్నందుకు సంతోషించు" అని. అందునుంచి పేదవాళ్ళు ధనికవర్గాన్ని చూసి కళ్ళు పొడుచుకోవటంకంటె తమకన్నా తక్కువస్థితిలో ఉన్న వాళ్ళని చూసి తామంతకంటె బాగున్నందుకు తృప్తిపడటం నేర్చుకోవాలి. మనస్సంతృప్తి లేకపోతే మనిషి బ్రతకటం కష్టం." అని ఇలా వనజ ఏకధాటిగా చెప్పినప్పుడు సభలోనించి విన్పించిన చప్పట్లు పావు గంటవరకూ ఆగలేదు. అది విని సభలోన గౌరవంగా మిలట్రీ ఆఫీసరు వనజ తండ్రి తన్మయత్వం చెందిపోయాడు. జడ్జస్ 'వనజ'కే ఫస్ట్ ప్రయిజ్‌ని డిక్లేర్ చేసేసారు.

ఆ తరువాత డిగ్రీ పూర్తయ్యాక 'వనజ'కి అప్పుడే ఐ.ఏ.ఎస్. పూర్తి చేసి కొత్తగా సబ్-కలెక్టరుగా వచ్చిన కోటేశ్వరరావు ఏకైక పుత్రుడు అందాల రాసి అయిన రాఘవరావుతో మహావైభవంగా పెళ్ళి జరిగిపోయింది.

అందుచేత-

అప్పట్నించే కాకుండా, అంతకు ముందునుంచి కూడా ఆమెకు అధికారం చెలాయించటమే తెలుసుకాని, ఆదరంతో సేవక జనాన్ని అర్థంచేసుకోవటం మాత్రం తెలియదు!

ఎలా తెలుస్తుంది మరి ?

భద్రయ్య తన బాధల్ని చెప్పుకుంటే

మాత్రం ఆమె ఎలా అర్థం చేసుకో గలదు?

అర్థంకాని భద్రయ్య, అయోమయంగా, అల్లకల్లోలంగా, ఆదరబాదరగా ఆయాసపడిపోతూ చెమటలు కక్కుకుంటూ వచ్చేసరికి పార్వతీ పరమేశ్వరుల్లా కనిపించిన 'వనజా-రాఘవరావు' లని చూసి "దండాలుబాబూ!" అన్నాడు వణికిపోతూ.

"ఏం భద్రయ్యా' నీ పెళ్ళాం కెలా ఉంది? జ్వరం తగ్గిందా లేదా?" అని రాఘవరావ్ ప్రశ్నించటంతో భద్రయ్యకి ఎక్కడలేని ధైర్యం వచ్చి, తన గోడు చెప్పుకోటానికి కొంత అవకాశం దొరికినట్టయింది.

"లేదు బాబయ్యా! మూడ్రోజుల నుండి తెలివిలే దొంటిమీద. పచ్చి మంచి నీళ్ళు నోట బొయ్యటంలేదు" అని అన్నాడు.

"సర్లే నాకు తరువాత కనిపించు మందిస్తా" అని అక్కణ్ణించి రాఘవరావు కదలటంతో, అతన్ని అనుసరించింది వనజ. ఆ సమయాన భద్రయ్యలో ఆస్తికత మరికొంచెం పెరిగి భగవంతుణ్ణి చేతులెత్తి మొక్కుతున్నాడు.

* * *

వనజకి 'డాడీ' అంటే అమితమైన అభిమానం. అంతకంటె గౌరవం, భక్తి. ఒక్కరోజు అతని ముఖం చూడలేక పోతే బ్రతకలేనేమో నన్నంత భయం కూడా ఒకప్పుడుండేది. చిన్నప్పట్నించి ప్రక్కమీదనుంచి లేవగానే, కళ్ళు విప్పగానే వనజ తండ్రి 'జయరాం' ముందుగానే "వనజ"నే చూసేవాడు. లేచిన వెంటనే అభిమానంతో కూతుర్ని దగ్గరకు తీసుకునేవాడు. అలా జరగక పొరపాటున ఇంకెవరు కన్పించినా (కనీసం భార్యయినా) ఉగ్రుడైపోయేవాడు. "నా చిట్టితల్లి ముఖం లేవగానే కనిపించలేదు. యివాళ నా కేపని జరగదు. ఈ రోజల్లా ఎలా ఉంటుందో ఏమో" అని నానా గాభరాపడిపోయేవాడు. వనజ తల్లి సుగుణమ్మ కూడా తమ ఏకైక పుత్రిక కళ్ళముందు లేక పోతే బెంబేలెత్తిపోయేది. అందునుంచే-వయసు బింకంతో, శుక్లపక్ష చంద్రునిలా విరబూసిన మాధవీలతలా, అందంగా మెరిసిపోయే వనజకి అంతకన్నా అందంగా ఉన్న రాఘవరావుతో పెళ్ళిచెయ్యాలనే ఆనందం ఓ ప్రక్క కలిగినా, 'వనజని అత్తవారింటికి పంపి ఎలా బ్రతగ్గలమా?' అని పెళ్ళి చెయ్యకముందునుంచి చాలా బెంగపడిపోతూ ఉండేవారు. పెళ్ళి రోజున 'జయరాం' దంపతులు ఆనంద సాగరాల్లో తేలియాడినా, మరో ప్రక్క చేతికి అందుకు రావాల్సిన కొడుకు అందకుండా పోయినట్లు, బాధపడి పోయారు. వనజ రాఘవరావుతో తన ఇంటికి వెళ్ళిపోయినప్పుడు, ఆ తరువాతనూ రోజూ పొద్దున్న వేళ కళ్ళు

తెరచేటప్పుడు జయరాం కళ్ల చెమ్మగిల్లేవి. భోజనాలకి కూర్చున్నప్పుడు అలవాటు ప్రకారం మూడో కంచంలో వడ్డించబోయి తరువాత కూతురు లేని వెలితి తెలుసుకొని చాలా చిన్నబుచ్చుకున్న సుగుణమ్మకి చాలరోజులవరకూ తిండి కూడా సరిగా ఇష్టపడేదికాదు. 'వనజ' అత్తింటికి పోయినప్పుడు కరెంటు దీపాల మధ్య తిరిగినవాళ్ళు ఆముదపు దీపాలమధ్య తిరగవలసి వచ్చినట్లు, ఏర్‌కండిషన్ గదుల్లో మెలగవలసిన వాళ్ళు పూరిగుడిసెల్లో మెలగవలసి వచ్చినట్లు, కుషన్‌బెడ్సుమీద పడుకునే వారికి మట్టినేలమీద పడుకోవలసి వచ్చినప్పటిలాగా, చాలా దీనంగా, కళావిహీనంగా తయారయారు జయరాం దంపతులు. అది భరించలేక, కనీసం నెలకోసారైనా వచ్చి 'వనజ'ను చూసి మూడు రోజులుండి పోతుంటారు.

రాఘవరావుకి ట్రాన్స్ఫరయి కొత్త ప్రదేశంలో ఫామిలీ షిఫ్ట్ చేసాక 'వనజ' తలిదండ్రులు ఇదే తొలిసారిగా రావటం. అందునుంచి ఉదయాన్నే లేచిన దగ్గర్నుంచి వనజ చాల సంతోషంతో మెరిసిపోతోంది. రాఘవరావ్ ఉదయాన్నే లేచి ఎనిమిది గంటలకే బయల్దేరి వెళ్ళిపోతున్నప్పుడు 'వనజ' మరీ మరీ చెప్పింది "ఈ రోజు పన్నెండుకే వచ్చేయండి. 'డాడీ' వస్తున్నారు. మీరొచ్చేదాకా నేను భోజనం చెయ్యను. తెలిసిందా?" రాఘవరావ్ స్వచ్ఛంగా మెరిసిపోయే ఆమెకళ్ళలో కోసారి చూస్తూ మెత్తని ముఖమల్‌లాటి ఆమె బుగ్గలపై సున్నితంగా అధరాల్తో స్పృశించి "శ్రీమతిగారి ఆజ్ఞ! తప్పుతుందా మరి?" అని టాటా చెప్పేసి బయల్దేరిపోయాడు.

"భద్రయ్యా! డాడీ వస్తున్నారీరోజు. నువ్వే ఊరుకెళ్తే ఆ ఊర్లోనే స్థిరపడిపోవటంకాక త్వరత్వరగా పన్లు ముగించుకొని రావాలి. చాలా పన్లున్నయ్. ఇదిగో త్వరగా వచ్చి ఈ వస్తువులు పట్టుకొనిరా!" అని ఏదో చీటిని భద్రయ్య చేతికిచ్చి పర్సులోంచి అయిదు పదులను లెక్కపెట్టి ఇచ్చింది.

* * *

డైనింగ్ టేబిల్‌ముందు కూర్చుని మామగారితో అమెరికా పాలిటిక్సు గురించి, మహ్మదన్స్ హిస్టరీ గురించి రాఘవరావ్ మాట్లాడుతూ ఉండగా ఎర్రగా కందిపోయిన ముఖంతో, చింత నిప్పుల్లా మండిపోతున్న కళ్ళతో "డర్టీ రాస్కెల్..ఇడియట్...బ్రూట్.. బ్లడీఫూల్" అని ఇంకా వరుసగా తన కొచ్చిన ఇంగ్లీషు తిట్లన్నీ పేరుస్తూ రాఘవరావ్ ప్రక్కన కూర్చున్నది వనజ. జయరాం కూతురు కోపంగా ఉండటంచూసి కలవరపడిపోయారు. రాఘవరావ్ మాత్రం గాభరాపడిపోక ఏ నౌకరో ఏదో తప్పుచేసుంటాడనీ, అందుకే ఆలా కోపంగా ఉందని

సాధారణంగా ఊహించేసి "ఏమైంది వనూ?" అని ప్రశ్నించాడు అనునయంగా.

"ఏమౌతుంది? అన్నీ మీరు చేస్తున్నవే. మీదెంత స్మూత్‌హార్టయినా నౌకర్లని మరీ అంత నెత్తికెక్కించుకో కూడదు. డాడీ! చెప్పు నెక్కడుంచాలి డాడీ" అంది తండ్రిని ఉద్దేశించి అన్నారు.

"కాలి క్రిందనే ఉంచాలి!" జయరాం.

"నో.. కొన్ని చెప్పులు తలకెక్కించుకునేవి కూడా ఉన్నాయి. గాంధీగారి పాదరక్షల్ని ఇప్పటికీ మ్యూజియంలో ఉంచారు. ఇక—మన పురాణాల్లో ఉదాహరణలు తీసుకోవాలంటే భరతుడు రాముడి పాదరక్షల్నెంత పూజ్యంగా భావించాడనీ?" ఛలోక్తిగా వనజని మరికొంచెం ఏడిపించాలనే ఉద్దేశ్యంతో అన్నాడు రాఘవరావ్.

"ప్లీజ్. డోంట్ కంపేర్ దట్ పూర్ గాంధీ అండ్ డర్టీ అన్‌ట్రూత్‌ఫుల్ ఎపిక్స్. భరతుడు ... వాడొట్టి నేస్టీ ఫెలో. చెప్పులు నెత్తిన పెట్టుకోవడమేమిటి? వాడంటే నాకు అసహ్యం!" మూతి ముడుచుకుని అంది వనజ. ఆ మాటలకి రాఘవరావు, జయరాంలు ఫకాల్న నవ్వారు.

"ఆఁ...సరే ఇంతకీ ఏమయింది? ఎవరిపైన తమ ఆగ్రహం ?"

"ఎవరిపైన అయితేనేం ? ఆ భద్రయ్యని మాన్పించెయ్యమంటే మాన్పించరు వాడేం చేసాడో చూడండి. ఆ ఫ్లాస్కుని ఎందుకూ పనికిరాకుండా ఎత్తేసి ఎలా తగలెట్టాడో" అన్నది.

"సర్లే వాడి పని నే చూస్తా భద్రయ్యా!" గంభీరంగా పిలిచాడు రాఘవరావ్.

"దండాలండీ" అనుకుంటూ భయంతో వొణికిపోతూ వచ్చాడు భద్రయ్య. "నీకు చాలసార్లు చెప్పాను. వనజమ్మగారికి కోపం కలిగించే పనులు చెయ్యొద్దని. ఈ సారి నువ్వు మళ్ళీ ఆమెకి కోపం కల్గించావో నేనిక రక్షించలేను తెలుసా!" అని అతను అంటున్నప్పుడు భద్రయ్య జయరాంగార్ని కళ్ళప్పగించిచూస్తూ,

"బాబూ... తమరా? ... దండాలు బాబు..." అంటూ అయోమయంగా రెండుచేతులూ జోడించి నమస్కరించాడు. జయరాంగారు కూడా భద్రయ్యని విస్మయంగాచూసి చాలా కంగారుపడిపోయి "బావున్నావా భద్రయ్యా!" మామూలుగా అనేసారు.

"సర్లే వెళ్ళు." తనని వనజమ్మ హెచ్చరించటంతో అక్కణ్ణించి తప్పుకోవాల్సివచ్చింది భద్రయ్యకి. తల దిమ్మెక్కినట్లయింది. చెవుల్లోంచి, శరీరంలోంచి, నరనరాల్లోంచి గాడ్పులు. భద్రయ్య ఏమైపోతున్నాడో అతనికి అర్థం కావటంలేదు. పడిపోతాడేమో

నన్న భయంతో స్తంభానికి చేరబడ్డాడు ఆలోచనలతో భద్రయ్య...

చాలరోజుల క్రితం వారంలో రెండేసి రోజులు పస్తులకు అలవాటు పడుతున్నపుడు, ఆకలితో ఇద్దరు పిల్లలూ చుట్టూరా చేరి ప్రాణాలు తీస్తున్నపుడు, అడుగడుగున చిరిగిన చీరని వొంటిమీద ఎలా కప్పుకోవాలో తెలియక భార్య సతమతమౌతున్నప్పుడు, మరో చీర కొనాలని తలంపు ఉన్నా కొనలేని అశక్తతో కొట్టుమిట్టాడుతున్నపుడు, తన తండ్రిచేసిన అయిదు వందలు వడ్డీతో పన్నెండు వందలు వరకూ పెరిగి కోర్టు ద్వారా పీకమీద కత్తిలా వచ్చిపడినప్పుడు, తనకు జీవితంమీద, సంసారంమీద విరక్తి కలుగుతున్నప్పుడు తనకి పిల్లలు అనవసరం అని అనుకున్నప్పుడు మూడోసారి మరో ఆడపిల్ల పుట్టేసింది భద్రయ్యకి.

ఆ సమయంలోనే-

భద్రయ్య నౌకరిగా పనిచేస్తున్న జయరాంగారి భార్యకి సంతానంలేక. ఎన్నో తీర్థాలు సేవించి, మరెన్నో క్షేత్రాలు దర్శించి, ఇంకెన్నో వ్రతాలు చేసి ఎందరెందరో డాక్టర్లచే పరీక్షలు చేయించుకుని, విసుగెత్తి పరాయిపిల్లల్ని చూసి సంబరపడిపోతున్నప్పుడు "గొడ్డుదానికేం తెలుస్తుంది బిడ్డల సొంపు!" అని తన ఐశ్వర్యాన్ని చూసి సహించలేనివాళ్లు ప్రక్క ప్రక్కగా సూటిపోటి మాటలంటున్నప్పుడు, ఆవిడ మనసు బాధతో నలిగిపోయింది. వయసు బింకంలో ఉన్నపుడే ఆవిడకి జీవితం మీద విరక్తి కలిగిపోయింది. రోజంతా ఇల్లు కదలకుండా కృంగి కృశించి పోతున్నప్పుడు భార్యని చూసిన జయరాంగారికి కనీసం ఓ బిడ్డని పెంచుకోవటం ఎంతయినా అవసరమని పించింది.

అలాంటి సమయంలోనే-

"ఈ బిడ్డ నీ కడుపున పుట్టాల్సినది కాదు. ఏ జమీందార్ల ఇళ్ళలోనో పుట్టాల్సినది. చందమామలా మెరిసిపోయే ఈ పిల్లని ఆ పాడు భగవంతుడు నీ యింట నెలా పడేసాడో కదా!" అని లోకం అంటూంటే భద్రయ్యకీ, రంగమ్మకీ కూడా ఆ మాట నిజమేనని పించింది. సరిగ్గా అదే సమయాన-

రెండ్రోజులుగా ఏదో చెప్పాలని "భద్రయ్యా" అని పిలుస్తూ, మళ్ళీ "ఏం లేదులే" అని తనని తనే సరిపుచ్చుకుంటూ మూడో రోజున మాత్రం "నీతో కొంచెం మాటాడాలోయ్" అన్నారు.

భద్రయ్యకి ఆశ్చర్యం వేసింది. "జయరాంగారి లాటి గొప్పోళ్ళు తనతో మాటాడవల్సిన వేమున్నాయ్?" భద్రయ్య ఆలోచనల్లో పడ్డాడు.

ఆ తరువాత "భద్రయ్యా! మీ అమ్మగారు చాల ప్రమాద పరిస్థితిలో ఉన్నారు. ఆవిడకి ఓ కోరిక ఉంది.

నువ్వు తీర్చగలవ్. కాదంటే ఆవిడ ప్రాణాలు తీసినవాడివి అవుతావు", అని జయరాంగారు అంటున్నప్పుడు అయోమయంగా, నిలువెల్లా వొణికి పోయాడు.

"బాబూ... ఆ యమ్మ పానాలు నా స్తీయడమా? ...చెప్పండి బాబూ... నా పానాలైనా యిత్తాను." ఆవేశంతో, స్వామిభక్తితోనూ అన్నాడు.

ఒక్క నిమిషం..రెండు నిమిషాలు అయిదు...పది...పావుగంటసేపు తట పటాయించాక, అక్కడికి అక్కడే చాల సార్లు పచార్లుచేసి "అమ్మగారు నీ మూడో కూతురిమీద మోజుపడుతోంది...... పెంచుకోవాలని!" జయరాంగారి ఆ మాటలు రివ్వున వచ్చి గుచ్చుకున్న బాణాల్లా భద్రయ్య గుండెల్లో గుచ్చుకున్నాయి.

"బాబూ...సెమించండి...మూలాంటి దిక్కుమాలినోళ్ళ పిల్లల్ని మీరు పెంచుకుంటారు..."

"లేదు భద్రయ్యా! నీ కూతుర్ని చూసినదగ్గర్నుంచి దాన్ని పెంచుకోవా లన్న కోర్కె మీ అమ్మగారిలో ప్రబల మైంది. నువ్వు కాదంటె ఆమె ఏమవు తుందో భయంగా ఉంది. నువ్వుత్తినే ఇవ్వొద్దు. నీ కెంత కావాలంటే అంత డబ్బిస్తాను," అని అంటున్న జయరాం గారి ముఖం విషాదంతో జేవురించుకు పోయింది. అప్పటికప్పుడు వెంటనే ఏ జవాబు చెప్పాలో తెలియక "మా యాడాదాయితో ఆలోచించి సెబుతా నయ్యగోరూ!" అని అక్కణ్ణించి తప్పు కున్నాడు. ఇంటికొచ్చి భార్యకి విషయం చెప్పిన తరువాత రంగమ్మ చాలసేపు మౌనంగా ఊరుకుండిపోయింది. సగం రాత్రప్పుడు ప్రక్కన పడుకున్న భద్రయ్యనిలేపి 'ఇదిగో..ఇటుసూడుమీ.. ఇది బంగారంనాటిపిల్ల..దీన్ని చూస్తుంటె ఒగ్గనానికి మనసొప్పకంటా ఉంది. నిజమే! కాని...దీన్ని మనకాడే ఉంచు కుంటే ఇది మన్నాగే గంజినీళ్లకి కూడా నోసుకోక నానాగడ్డీ కరాల. ఇంతకన్నా అమ్మి నెవులికయినా ఇచ్చేసినా మంచిదే! ఆ బావ్‌గారికే ఇచ్చినావా...అమ్మి... రాజబోగాలనుబవిత్తాది. ఎక్కడో ఒక్కాడ ఎవులయినా సుకంగా ఉంటే అదేసాలు. ఆలోసించు. ఎల్లి ఆయమ్మకి మాట సెప్పు' అని చెప్పింది. చెప్పిందే కాని చాలసేపటివరకూ రంగమ్మ కంటికి కునుకు రాలేదు, కన్నీళ్ళు తప్ప.

ఆ తరువాత తన చేతుల్తో జయరాం గారికి తన మూడో కూతుర్నిచ్చి. రెండు వేల రూపాయలు పుచ్చుకుంటున్నపుడు, తండ్రి చేసిన బాకీ వడ్డీతో పన్నెండు వందలు తీరుస్తున్నపుడు ఓ ప్రక్క సంతోషం మరో ప్రక్క దుఃఖం పెల్లుబికివచ్చాయి. గుండెలు ఝల్లుమ న్నాయి. మరికొద్ది రోజులకే జయరాం గారు కేంపు విజయవాడకి మార్చేయ

టంతో తన కూతురు గొప్పగా బ్రతుకు తుండగా చూడడానికి అవకాశం లేకపోయింది. వెళ్ళిపోతున్న జయరాం గారు భద్రయ్యని కలెక్టరు గారింట్లో నౌకరిగా కుదిర్చేసారు. అప్పట్నించి అందరి దగ్గర మంచిగా ఉంటూ కాలక్షేపం చేయసాగాడు భద్రయ్య.

ఆ రోజులు మరోసారి స్మృతిపథంలో తిరుగగా భద్రయ్యకి 'వనజమ్మ' తన కూతురు కాదుకదా? అన్న అనుమానం వచ్చింది. వెంటనే 'వనజమ్మ' తన కూతురు కారాదు ... కాదు. అంత టీవి...ఆ అందం... ఆ సందం... ఆ వోదా .ఎంత గొప్పగా పెరిగితే మాత్రం తన కూతురి కెలా గొస్తాయ్?..కాపోతే అందంగుండొచ్చు..' అని సరిపుచ్చుకున్నాడు. అయితే... "తన కూతురేమై ఉంటుంది?" అన్న అనుమానం మాత్రం మిగిలిపోయింది. ఆ సాయంకాలం సూర్యుడు పడమటి కొండల్లో మునిగిపోయి, చుట్టూ సంధ్య చీకట్లు ముసురుకుంటున్నప్పుడు 'జయరాం'గారి ద్వారా 'వనజ' తన కూతురేనని తెలిసినప్పుడు మొదటగా పట్టరాని ఆనందాన్ని అనుభవించేసాడు. 'దిక్కూ మొక్కూ లేక, తినటానికి పట్టెడన్నానికి కూడా నోచుకోక వాళ్ళు కప్పుకోటానికి సరియైన గుడ్డలేక తన ఇంట్లోఉండి అష్టకష్టాలూ అనుభవించాల్సిన తన కూతురు ఎంత హోదాలో వెలిగిపోతోంది ? ఎంత తెలివి తేటలు వచ్చాయి' అని సంబరపడిపోయి, ఈ విషయం ఎంతవేగంగా భార్యకి చెప్పడమా? అని గాభరా అయిపోయాడు. ఆ మరుక్షణంలోనే అతడి మనస్సు తీవ్రమైన సంక్షోభానికి గురైపోయింది. 'పిల్లేమ. తన కంఠంలో ప్రాణం ఉండగా ఈ దిక్కుమాలిన రూపంతో వనజమ్మకి తండ్రిగా తెలియకూడదు' అనే భావన మనసులోకి రాగానే "దేవుడా! నువ్వే రక్షించాల. ఈ దిక్కుమాలోన్నెన్ని వనజమ్మకి తండ్రిగా తెల్నివ్వకు". అని భగవంతుడికోసారి మొక్కి, అదే మాటని జయరాంగార్తో అని అక్కణ్ణించి లేచి ఇంటికెళ్ళి పోయాడు.

సరిగ్గా అదే సమయానికి అరగంట క్రితం చీకటిగా ఉందని లైటు వేద్దామని వచ్చిన 'వనజ' తన తండ్రీ. భద్రయ్యా ఆడుకొంటున్న మాటలు విని స్థాణువులా నిల్చుండిపోయి, ఇంక ఆట్టేసేపు అక్కడ నిలువలేక వెళ్ళి మంచంమీద బోర్లా పడుకుని వెక్కివెక్కి ఏడవటం ప్రారంభించింది. పున్నమి చంద్రుడు నల్లగా మాడిపోయి, ఆకాశం దట్టమైన చీకట్లతో భయంకరమైపోయినట్లు, ప్రపంచం అంతా గాలి స్తంభించిపోయి అనేక కోట్ల జీవరాసులు శవాలుగా మారి పోయినట్లు, సముద్రాలన్నీ ఒకేసారిపొంగి పోయి విశ్వమంతా జలమయమైపోయి,



సమస్తప్రాణి సమూహం నిర్జీవమై తేలిపోతున్నట్లుగా వనజకి అనిపించింది ఆ క్షణాన.

మరికొంతసేపటికి పులినోటినుండి సగంప్రాణంతో బయటికి లాగబడిన బక్కచిక్కిన గోవులాగా కనిపించిన భద్రమ్మ, తిండిలేక కడుపు వీపుకి అంటుకుపోయి "అమ్మా ఆకలి!" అని పేగులు తెగిపోయినట్టు అరిచే గజ్జిపట్టిన జాగిలాల్లాంటి ముష్టివాళ్ళు, చింపిరి జుట్టుతో చిరిగిన చీర మధ్యనుంచి సగం సగం అవయవాలు కనిపిస్తూ దయ్యంలా భయంకరంగా ఉండే రంగమ్మా తన చుట్టూ చేరినట్లయి, త్రుళ్ళిపడి ప్రక్కకి చూసి "వీళ్ళు నా వాళ్ళు కారాదు... కాదు...కారాదు. నో...నో...వీళ్లేదు..

భగవాన్...ఏమిటిది? ఏమిటీ ఘోరం? భద్రయ్యని ... నేను 'నాన్నా' అని పిలవాలా? ... వీల్లేదు ...భగవాన్... అలా జరగకూడదు..నువ్వేరక్షించాలి!.. నో...నో..." అంటూ గట్టిగా అరిచి ప్రక్కమీదకి ఒరిగిపోయింది మళ్ళీ. అప్పుడే లోనికి వస్తోన్న జయరాంగారు అనుకోని ఘోరం జరిగిపోయిందని, గబగబా పరిగెత్తుకునివెళ్ళి, "అమ్మా... వనజా ... ఏమయిందమ్మా..." అని ఎప్పుడూ కన్నీరు కార్చని వనజ కళ్ళ నుండి జారుతున్న కన్నీటిని చూసి, హృదయం ద్రవించిపోయి, ప్రక్కలయిపోయి బావురుమన్నారు జయరాం గారు.

"డాడీ...చెప్పు డాడీ..ఆ భద్రయ్య నా తండ్రి కాడని చెప్పు డాడీ!" అనుకుంటూ తండ్రిమీద ఒరిగిపోయింది.

"అమ్మా!" అని తప్ప మరోమాట నోటినుండి రాక కూతుర్ని గుండెలకు అద్దుకున్నాడు జయరాం.

"డాడీ...నిజం చెప్పు డాడీ ...ఆ భద్రయ్య ఎవరు? అతడు నాకేమౌతాడు! చెప్పు డాడీ...అబద్ధం చెప్పకు..."అని పదేపదే ప్రశ్నించసాగింది వనజ.

"తల్లీ...చెపుతా..కాని నా కన్యాయం చెయ్యవుగా తల్లీ."

"నువ్వు నా కూతురివి కావని నేనెలా చెప్పగలను?...నిన్ను కనటం మాత్రం భద్రయ్యకి తెలుసమ్మా...నా కోరికను కాదనలేక ... బంగారపు బొమ్మలాటి నిన్ను వాళ్ళింట్లోనే ఉంచుకొని బాగు చెయ్యలేక...నా కోరికను కాదనలేక... నిన్ను నాకిచ్చాడమ్మా భద్రయ్య. అంతే. అక్కణ్ణించి అన్నీ మేమేనమ్మా." కూతురి పరిస్థితి బాగా తెల్సిన జయరాం ఉన్న విషయాన్ని దాచలేకపోయాడు అప్పుడు.

"డాడీ..నాకేం చెప్పొద్దు...నన్నింకా ఆ భగవంతు డెందుకు ప్రాణంతో ఉంచాడో చెప్పు డాడీ..." భోరుమని ఏడవటం మానలేదు

"అమ్మా !" కూతుర్ని ఓదార్చ సాగారు జయరాం.

ఆ తరువాత రెండురోజులు మంచం మీదనుంచి లేవలేకపోయింది వనజ. ఆమె ఆలోచనల్లో...స్మృతిపథంలో... చుట్టూ "భద్రయ్య...తన తండ్రి... కాదు...అవును...కాదు!" అనే ఘర్షణ. మరోసారి "భద్రయ్య..గర్భదరిద్రం.. కూతుర్ని అమ్ముకున్న దుస్థితి...తిండి పెట్టుకోలేని స్థితి..బట్టలు కొనలేని స్థితి.. ఆకలి..." ఇలా ఆలోచిస్తున్న వనజకి మరో ఆలోచన వచ్చింది.

"తను భద్రయ్య దగ్గరుంటే ఎలా గుండేదో" అని. భద్రయ్య ఇంటిలో తన రూపాన్ని ఊహించుకుంది! 'కొబ్బరి పీచులాటి జుట్టు ... లోతుకుపోయిన కళ్ళు ... ఆకలి పేగులు ... చి ని గి

అవయవాల్ని దాచని చీర..మురికిపట్టిన స్టీలు చెంబులా...కళాయిపోయిన అద్దం లాటి ముఖం..ఆశలు చావని చూపులు.. అణచుకోలేని కోర్కెలు ... పరుగులు తీసే యౌవనం..." మరి ఊహించుకో లేకపోయింది. ఆ పరిస్థితిలో భద్రయ్య మంచిపని చేసాడనిపించింది. "ఎస్. భద్రయ్యా నువ్వు మంచిపనిచేసావ్!" అనుకుంది. అలా ఆలోచిస్తుంటే భద్రయ్యపై ఆమెకి జాలి కలిగింది... అభిమానం ఏర్పడింది ... అనురాగం అధికమైంది. 'నాన్నా!' అని పిలవాలని పించింది.

దరిద్రంతో, దైన్యంగా ఉన్న భద్రయ్య కుటుంబాన్ని, తనవారిని ఆదుకోవాలనిపించింది. "తాను పెరిగిన వాతావరణం తనలో పెంచిన అహంకారం, గర్వం అధికారం అన్నీ అణుచుకుని తన డాడీని వెంట తీసుకుని కారులో కూర్చుంటూ, కారుని భద్రయ్య ఇంటికి పోనివ్వమని డ్రయివర్ని ఆజ్ఞాపించింది. డ్రయివరు ఆశ్చర్యపోతూ కారు స్టార్టు చేసాడు. కారు అందమైన రోడ్డు మలుపు తిరిగి మట్టిరోడ్డుమీద కుంటుకుంటూ పోసాగింది. పోయి పోయి మురికివాడల్లో ఆగింది. 'ఇదే భద్రయ్య ఇల్లు.' డ్రయివరన్నాడు.

కారులోంచి అడుగు క్రిందకి వేయ బోతుంటే ఏదోలా అనిపించింది వనజకి. కారు చుట్టూ కొంతమంది జనం పోగయారు. మరి కొంతమంది వాకిట్లో గొల్లుమన్నారు. మూడ్రోజుల క్రితం ఈ లోకం విడిచి వెళ్ళిపోతుందేమోనన్న భద్రయ్య భార్య, భద్రయ్య తలదగ్గర కూర్చుని లబోదిబోమంటోంది. భద్రయ్య పిల్లలూ, మనవలూ చేరి గొల్లుమన్నారు.

అదే సమయాన—

"నా కంఠంలో ప్రాణం ఉండగా ఈ దిక్కుమాలోన్నాడు తండ్రని వనజమ్మకు తెలనివ్వకు దేవుడా!"అన్న భద్రయ్య కోర్కెనూ "భగవాన్... భద్రయ్యను తాను 'నాన్నా' అని పిలవాలా...వీల్లేదు". అన్న వనజమ్మ కోర్కెను ఆ భగవంతుడు తీర్చేసాడు.



# అంతులేని అన్వేషణ

## సతీశ్‌బాబు




"సమయం ఉదయం పదిగంటలు—"

దర్శిగుంటపేటనుండి, సీతారాం పురంవైపు ఆర్. టి సి. బస్సు శరవేగంతో దూసుకుపోతూంది గాలిలో.

అప్పుడే ఎస్.ఆర్. పూర్తిచేసుకున్న కండక్టరు ఒక్కసారి వెనుకవైపు తిరిగి జనసమూహాన్ని లెక్కించి, ఎస్ ఆర్. టాలి అయిందన్న తృప్తితో గట్టిగా శ్వాసపీల్చి సిగరెట్టు ముట్టించాడు.

వాతావరణం చాల ప్రశాంతంగా

వుంది. రోడ్కు ఇరువైపుల, గగన మండలాన్ని అంటుకున్నట్లున్న పర్వత శ్రేణి, దట్టమైన వృక్షజాలంతో ఎంతో అందంగా వున్నాయి.

ఆ పర్వతాలమధ్య త్రాచుపాములా మెలికలు తిరిగివున్న ఘాట్ రోడ్కు మధ్య భాగంలో అక్కడక్కడ దట్టమైన గుట్టల సమూహం, వాటికి అతిదగ్గరలో చిన్నచిన్న పూరి గుడిసెలతో నిండివున్న ప్రజల నివాసపు పల్లెలు—

పచ్చని గడ్డితోనూ, పంటపొలాల తోనూ ఎంతో శోభాయమానంగా వున్న ఆ దృశ్యం చూపరులకు అచ్చెరువు గొల్పుతూంది.

దట్టమైన చెట్లతో మేళవించివున్న ఆ ప్రాంతంనుండి రోడ్డు వైపునకు వచ్చు చల్లనైనగాలికి, పొందే అనుభూతిలో ఒకరి నొకరు మైమరచి ఒడలు మరచి వున్నారు ప్రయాణీకులు.

ఆ పరిస్థితిలో—బస్సు ఉన్నపాటున ఒక్కసారి ఆగిపోయింది, డ్రైవరు వేసిన సడన్ బ్రేక్కు. బస్సులోని ప్రయాణికులతోపాటు, ఎక్కడో ఊహా ప్రపంచంలోవున్న కండక్టర్ మనస్సు స్వాధీనంలోకి రాకతప్పలేదు దాంతో—

యాంత్రికంగా పరికించిన కండక్టర్ వెంటనే తలుపు తెరిచాడు.

తలుపుకు అతి దగ్గరలో ఒక వయస్సులోవున్న స్త్రీ ఒక పాపతో నిలువబడివుంది.

ప్రపంచంలోని అందాన్ని ఒక్కసారి మేళవించి ఒక మూసలోపోసి ఆ అపరంజిబొమ్మను తయారుచేసినట్లుందా సృష్టికర్త.

అంతటి అపూర్వసుందరి ఒంటరిగా ఇక్కడెందుకుందోనన్న సందేహంతో తొంగిచూసే లోపల కండక్టరును నఖశిఖ పర్యంతం పరికించి తలదించుకుంది—

ఆమె ముఖంలోని భావం అర్థంకాలేదు కాని, కనుదోయినుండి మాత్రం జాలుగా గారే కన్నీరు అక్కడివారిని ఆశ్చర్య చకితులతోపాటు బాధామయులను జేసాయి—

"బస్సు ఎందుకాపావు?" అన్నాడు డ్రైవరును చూస్తూ కండక్టరు.

"ఆమె చేయి ఎత్తింది!" అన్నాడు డ్రైవరు.

"బస్సు ఎక్కనిదానివి, ఎందుకాపి నట్లు?—" అన్నాడు కండక్టరు ఆమె వైపు తిరిగి.

కాని ఆమెనుండి ఎలాంటి సమాధానం రాలేదు. పైగా బస్సును వెళ్ళిపొమ్మ న్నట్లు చేత్తో సైగజేసింది—

ఒక్కసారిగా డ్రైవరువైపు చూసాడు కండక్టరు. డ్రైవరు అర్థంగాక తల గోక్కున్నాడు.

"రైట్"అన్నాడు కండక్టరు. బస్సు బయలుదేరింది.

కాని అందరి దృష్టిలోనూ ఆ స్త్రీ

రూపం మూర్తీభవించిపోయింది కొన్ని క్షణాలు—

అయినా ఆమె కన్నీటికి ఆలవాలమైన వెనుకటిగాథ, ఎవ్వరికి తెలుసు ?!—

ఎలా తెలుసు ?!

కొన్ని రోజులకు ముందు ఒకరోజు-సాయంత్రం నాలుగుగంటల సమయంలో సీతారాంపురంనుండి తిరిగివస్తూవున్న ఆర్.టి.సి. బస్సు ప్యాగ్‌బెల్టు తెగిపోయి ఒకవిధమైన ధ్వనితో వున్నపాటున ఆగిపోయింది.

బస్సులో ప్రశాంతంగావున్న ప్రయాణికులలో మెల్లగా కలకలం బయలు దేరింది.

డ్రైవరు క్రిందికిదిగి బస్సునుపరీక్షించి "ప్యాగ్‌బెల్టు తెగిపోయింది బస్సు నడవదు" అన్నాడు.

అంతే. పెద్ద కలకల ధ్వనులతో బస్సులోని వారందరు క్రిందకు దిగారు కంగారుగా—

"ఇప్పుడేం చెయ్యడం?—"అన్నాడు కండక్టరు.

"రిలీఫ్ కోరడమే—"అన్నాడు డ్రైవరు. "అయితే ఈ ప్రయాణికుల సంగతి ఎలా?" మన బస్సులేవైనా వున్న వోలేవో ?! అన్నట్లు ఆలోచనలో పడ్డాడు కండక్టర్.

దూరంగా ఎదురుగావచ్చే లారీనిచూస్తూ "నేను ఈ లారీని పట్టుకొని డిపోకు పోయి రిలీఫ్ కోరతాను—నువ్వు ఏ విధంగా నైన మన బళ్ళలో వారిని ఎక్కించు" అంటూ తనను సమీపించిన లారీని పట్టుకొని వెళ్ళిపోయాడు డ్రైవరు.

"ఏమిటి కండక్టరుగారూ మా పరిస్థితి?"అని ఒకరు, ఇప్పుడెలా మేము యిల్లు జేరడం?—అని మరొకరు-అయితే మా డబ్బు తిరిగి యివ్వండి?! – అని ఇంకొకరు. ఎప్పుడైనా ఆర్. టి. సి. వాళ్ళు తిరిగి డబ్బు యిచ్చారా ఇప్పుడు యివ్వటానికి ? అని వారిలో యింకొకరు –యిలా ఎవ్వరికి వారు వారి వారి యొక్క అభిప్రాయాలు ఏకరువు పెడుతున్నారు.

అనేక కంఠాల బారినుండి అనేక విధాల మాట్లాడే వారియొక్క మాటల మధ్య నుండి వారిని క్రాసుజేస్తూ పోయే ఆర్.టి.సి. బస్సులను రెంటిని ఆపి ఎక్కించి పంపేసరికి సరిగ్గా సాయంత్రం ౬-౩0 గంటలైంది.

కండక్టరు ఒక్కసారిగా చేతి గడియారం చూసుకొని విస్తుపోతూ సిగరెట్టు ముట్టించాడు ఆ పరిసరాలను పరికిస్తూ.

అప్పుడప్పుడే మసగచీకట్లో కంటికి మసకగా కనుపించే కొంత దూరంలో వున్న పల్లె,దానిచుట్టూ అలము కొనివున్న పర్వతశ్రేణితో చిత్రపటంలా మెరిసింది కండక్టరు మనస్సులో.

సంతృప్తిగా ఆ దృశ్యాన్ని తిలకించిన

కండక్టరు మరొక సిగరెట్టు కాల్చి మెల్లగా బస్సులో కూర్చున్నాడు.

ఓ అరగంట దాటాక 'బా బూ!' అన్న పిలుపుతోపాటు ఓ ముసలాయన బస్సు తలుపుదీస్తూ అన్యమనస్కంగా వున్న కండక్టరు మ న స్సు క ల త పెట్టాడు—

"ఆఁ! ఏంటితాతా?!–" అన్నాడు కండక్టరు. "బాబుగారూ బస్సు చెడి పోయిందా?"–అన్నాడు ముసలాయన.

"అవును".

"బాగా చీకటి పడిపోయింది. ఇంత రాత్రిలో ఇక్కడెక్కడ ఒక్కడివే వుండగలవు ?!"—

"తప్పేదేముంది. మా ఉద్యోగ ధర్మం ?"

"బాబూ భోంచేసి ఏవేళైందో"– మా యింటికి రా బాబూ నాలుగు మెతు కులు ఎంగిలి పడుదువుగాని.

"ఎందుకులే తాతా ?!"

మీరు తినేది పెట్టలేకపోయినా,— మా యింటిలో వున్న దేదో పెట్టగలం బాబూ–అనుమానించకుండా రా బాబూ" అన్నాడు ముసలాయన.

కండక్టరుకు ఆకలిగానే వుంది. పైగా ఆ పరిసరాలలో తిండి దొరికే అవకాశం లేదు–అందువల్లే "సరే తాతా! "అంటూ ట్రే బాక్స్ తీసుకొని ముసలాయనతో పాటు నడకలో లీనమయ్యాడు.

ముసలాయన ఓ యింటి దగ్గర ఆగాడు. యిల్లు మాత్రం పూరిల్లు. అయినా చక్కగా అధునాతనంగా వుంది. యింటిముందు మాత్రం మంచం వాల్చి వుంది.

బయట గుమ్మం దగ్గర ఒక బకెట్ చెంబు, నీళ్ళతో వున్నాయి.

"బాబూ ?'కాళ్ళు కడుక్కోండి ?!" అన్నాడు ముసలాయన.

కండక్టరు ట్రే బాక్స్ మంచంపై పెట్టి మెల్లగా కాళ్లు కడుక్కున్నాడు.

"లోపలకు రా బాబూ"—అంటూ యింటిలోకి దారితీసాడు ముసలాయన.

యింటి ఆవల ద్వారం దగ్గర ఒక అమ్మాయి నిలబడివుంది సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మిలా–యింటిలో ఒక ప్రక్క ఆకలి దీర్చేందుకు కావలసిన పదార్థా లన్నీ ఏర్పరచివున్నాయి — కండక్టరు చూపు మాత్రం ఆమెనుండి తప్పు కోలేదు—

"కూర్చోండి బా బూ – " అ న్న ముసలాయన మాటలకు త్రుల్లిపడ్డాడు కండక్టరు. తన స్థితికి తానే సిగ్గు పడ్డాడు, ఆమె అందాన్ని మనస్సులో మనన చేసుకుంటూ—

"బాబూ"–కూర్చొని తిను అమ్మాయి యిక్కడే వుంటుంది. కావలసినవి అడిగి పెట్టించుకోండి–ఆమె అతిధులను అడిగి పెట్టలేని దురదృష్టవంతురాలు–"

"అంటే ?—"

"ఆ అమ్మాయి నా కూతురు బిడ్డ.

పేరు లక్ష్మి పుట్టుకలోనే తల్లిదండ్రులతో పాటు మాటకూడా లేకుండా జేసాడా భగవంతుడు."

"ఆఁ!—అయితే ఆ అమ్మాయి మూగదా ?!—"

"అవును. మూగదే" అన్నాడు.

ఇంతటి రూపవతిని మూగదానిగా జేసాడా దేవుడు—నిజంగా దేవుడు రాయే?-లేకపోతే ఏమిటీ విచిత్రం ?!—

చిత్రమైన రూపలావణ్యాలు యిచ్చి, గొంతుక తానే తీసుకున్నాడేమిటీ?—అన్న పిచ్చి పిచ్చి ఆలోచనలనుండి తేరుకొని ఎప్పటికో అన్నాడు "తాతా ఈ సుందరమైన అమ్మాయి మూగదా ?"

"అవును"

"పాపం ఈమె పుట్టుకకు పరమార్థమేమిటో?"

"ఏమోలే బాబూ ! ముందు నువ్వు భోజనం కానీయ్" అన్నాడు ముసలాయన.

"ఏమిటీ చిత్రం ?!"— భగవంతుని దృష్టిలో ఈలాంటి వింతలు ఎందుకు జరుగుతాయో ?!—దేవతలను తలదన్నే అపూర్వమైన ఆమె రూపం. పాపం తన దీనావస్థను చెప్పుకోలేని మూగమనస్సు.

"సృష్టిొనసగినది దేవుడైన మరి నాశం నేల సృజించే-కనుల నొసగినది దేవుడైనా మరి అంధులనేల సృజించే-"అన్న బాట సారి లోని పాట గుర్తుకొచ్చింది

యాంత్రికంగా భోజనం ముగించి బయటకొచ్చి కూర్చున్నాడు—

కాని మనస్సులోని ఆలోచనా తరంగాలు మాత్రం లక్ష్మిని గురించే చోటుచేసుకున్నాయి.

అనుకోకుండా ఆమె వాకిట్లో కొచ్చి ఎదురుగా నిలువబడింది.

శిలాప్రతిమలా నిలబడియున్న లక్ష్మిని ఆమూలాగ్రాంతం పరికించి మెల్లగా బయలుదేరాడు కండక్టరు.

"ఎక్కడకు బాబూ?!"—అన్నాడు ముసలాయన.

"బస్సు దగ్గరకు తాతా." అన్నాడు కండక్టరు.

"బస్సు దగ్గరకా?! ఎందుకు ?"— ముసలాయన ప్రశ్న.

బస్సు దగ్గర మనిషిలేకుండా వుండ కూడదు తాతా". కండక్టరు తిరుగు సమాధానం.

ఇంత రాత్రిలో నువ్వు అక్కడ పడుకుంటావా?!ఇక్కడే పడుకో బాబూ. అవసరమనుకుంటే బస్సుదగ్గర నేను పడుకుంటాను. అన్నాడు ముసలాయన.

"వద్దులే తాతా—" అంటూ నాలుగు అడుగులు వేసాడు కండక్టరు.

"బాబూ?!—నా మాట విను. పెద్ద వాణ్ని, ఒంటరిగా అక్కడ పడుకోవడం అంత మంచిదికాదు. అన్నాడు ముసలాయన."

ముసలాయన అన్న మాటలకు కండక్టరు దృష్టి ముందు క్యాషుబ్యాగ్ మీద పడింది. కొన్ని క్షణాలు ఆ సంచిని పరికించి "సరే తాతా?!—నువ్వు వెళ్ళి

బస్సుదగ్గరే పడుకో-—ఆఁ! ఎంత రాత్రికైనా మా మనుష్యులు అక్కడకు వస్తారు. వాళ్ళు అక్కడకు వచ్చేక నాకు మాత్రం కబురుపెట్టు-"అన్నాడు.

"అలాగే బాబూ—" అంటూ ముసలాయన నాలుగడుగులు వేసి— "అమ్మా లక్ష్మీ—మంచంవాల్చి పడక వేయి" అంటూ వెళ్ళిపోయాడు.

అంతవరకు చలనరహితమై నిలబడ్డ ఆమెలో చలనం ఏర్పడింది. లోపలకుపోయి మంచం,దిండు, దుప్పటి తెచ్చి ఆరుబయట పడకవేసింది కండక్టరుకు.

సంకోచం లేకుండా చేతిలోని క్యాష బ్యాగ్ ట్రే బాక్స్ ఆమె కందించాడు, "లోపలపెట్టు" అంటూ. ఆమె తనచేతి కిచ్చిన రెండు వస్తువులు తీసుకొనిపోయి లోపల దాచింది

కండక్టరు మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళి మంచంపై మేను వాల్చాడు-కాని, చల్లనిగాలి, మనస్సును పదేపదే పరవశింపజేసే పండువెన్నెల అతని మనస్సును ఆలోచనా నిమగ్నుని చేసాయి. దాంతో చూపు మెల్లగా పరిసరాలవైపు మరలింది.

అంతా కలిపి అక్కడ సుమారు ఇరవై యిల్లుకూడా లేవు. కాని ఆ పల్లె చుట్టూ ఎంతో అందంగావున్న కొండల సముదాయం, కొండచరియలలోనుండి ఆ పల్లెకు అతిదగ్గరలో ప్రవహించే నదీజల తరంగాలతోపాటు, ఆకాశంలో మెరిసే నక్షత్రమండలమూ, కండక్టరు మనస్సును ఏదో మరో మండలానికి తీసుకొనిపోయాయి కొన్నిక్షణాలు—

"అబ్బ!!— ఎంత సుందరమైన వాతావరణం?'—మనస్సు ఆనంద డోలికలలో ఓలలాడించే అనుభూతిని కలిగిస్తూంది. ఆహాఁ! దీన్ని ఆస్వాదించే అదృష్టం పల్లెవాసులదేకదా !?"—

అతని మనస్సు తల్లడిల్లిపోయింది. అంతలోనే ఘల్లుఘల్లుమనే కాలిఅందియల చప్పుడు మనస్సును వికలంచేసి వాటి వైపు దృష్టిమల్లేట్లు చేసాయి.

అంతే?!—ఇక్కడ అంటే మరికొంత దూరంలో నిలువబడ్డ లక్ష్మి రూపం అతనిలో చోటుచేసుకుంది.— అరెరే !! లక్ష్మి యింకా నిద్రపోలేదా?!—తనలో అనుకున్నాడు. అయినా ఎలా పోగలదు పాపం— ఆమె భవిష్యత్తుని అన్యులు ఆలోచిస్తేనే బాధగావుంది. మరి ఆమె ఆలోచించుకొంటే ఎలా వుంటుందో ?!— అర్థం తెలుసుకుంటే ఆమె భరించ గలదా?!—భరించలేదు.

ఎవరైనా ధైర్యం చేసుకొని ఆమెను భార్యగా పొందేందుకు ముందుకు రాగలరా ?! —ఎవ్వరు మాత్రం రాగలరు ?! — సాహసించి ముందుకు అన్న అనంతమైన ఊహలవాహినిలో మెరపులా మెరిసింది ఒక చక్కని యోచన—"తాను మాత్రం ఆమెను

భార్యగా ఎందుకు పొందకూడదు" అన్నట్లుగా.

దేవకాంతలను తలదన్నే అందం, అంతకుమించిన అణకువ, అన్నిటినీ మించిన ఆమె మూగవోయిన మనస్సు!— అంతే అతని మనస్సులో అదే ఆలోచన స్థిరమై పరిసరాలను వెలికి నెట్టివేసింది.

—కొన్ని క్షణాల అనంతరం—

"లక్ష్మి!?—" అని పిలిచాడు కండక్టరు. ఎంతో ఆతృతగావచ్చి నిలువబడిపోయింది, అతని ఎదురుగా-కన్నార్పకుండా ఆమె అందాన్ని అతని మనస్సులో రూపకల్పన జేసుకుంటూవుండే ఆమె ముఖం చెప్పరాని సిగ్గుతో వాడిపోయింది.

" నిన్ను నేను పెండ్లిచేసుకుంటాను. నీకు ఇష్టమేనా?!—" అన్నాడు కండక్టరు.

ఆ మాటలకు ఆమె గుండెలలో ఎన్నో వత్సరాలుగా గూడుకట్టుకున్న నిరాశ, నిస్పృహలు ఒక్కసారిగా మా కింక నెలవులేదు అన్నట్లుగా అనుకున్నాయి ముక్తకంఠంతో.

ఏదో తెలియని భయం ఆమెను ఆవహించింది. శరీరమంతా ఆమెకు తెలియకుండానే వణుకు ప్రారంభమైంది.

తన చేతులతో ముఖాన్ని కప్పుకొని తుర్రున లోపలకు పోయింది లేడిపిల్లలా.

వెంటనే ఆమెను అనుసరించాడు కండక్టరు లోపలకు—

తన చేతులతో ఆమెను తనవైపునకు త్రిప్పుకొని "ఏం లక్ష్మి ?!—సమాధానం చెప్పవేం?!—నేనంటే ఇష్టమేనా ?!—" అన్నాడు.

ఆమె నోటినుండి ఎలాంటి మాటా రాలేదు.కాని ఎన్నోభావాలతో ఆమెకళ్ళు, హృదయంలోని ఆరాటం, ఆవేదన, ఆందోళన, సంతోషాలను కొన్నిక్షణాలు వ్యక్తం చేసాయి.

ఆమె మనోభావాన్ని ఆకళింపుచేసుకున్న కండక్టరు తన ఆలింగనంలో ఆమెను బంధితురాలుగా జేసుకున్నాడు.

కాని తనఅంతటి దురదృష్టవంతురాలికి, అంతటి అదృష్టాన్నిఆపాదిస్తున్న ఆ స్వామిని తన కళ్ళతో తనివితీరా చూచి అమాంతం అతని పాదాలమీద వాలిపోయింది—

"లక్ష్మి !!— ఈ రోజునుండి నా మాటే నీ మాట. నీకున్న మూగబాధను నేను తొలగిస్తాను—నిన్ను నా భార్యగా జేసుకొని నువ్వు ఊహించని ప్రపంచంలో నిన్ను సంచరించేట్లు చేస్తాను—" అన్నాడు.

అంతే అతని కౌగిలిలో చందులా వాలిపోయింది—కొన్ని క్షణాలలో వారిరువురి మధ్యలో మౌనం చోటు చేసుకుంది—కాని వారిరువురు ఏకమైన చూపులతో ఎక్కడెక్కడో దూరతీరాలలో చేరిపోయారు.

అలాంటి సమయంలో కొన్నిక్షణాల




అనంతరం— ఆ రాత్రిని ఏకధాటిగా ఏలే వెన్నెల, కలసిన చల్లగాలితో వారిని ఎన్నో జన్మల అనంతరం కలుసుకున్నామో అన్నట్లుగా చేస్తే వారియొక్క చిలిపిచేష్టలు వారి వారి శరీరాలలో ఏదో తెలియని చైతన్యాన్ని కలిగించాయి.

"లక్ష్మీ !!—నిన్ను చూస్తున్నకొద్దీ నీ అందాన్ని అనుభవించాలని—మనస్సు ఎందుకో ముచ్చటపడుతూంది". అన్నాడు.

"నన్నా?!" అన్నట్లు తన వైపు చూసుకుంది లక్ష్మి కంగారుగా.

"అవును. అయినా ఒక్కసారి నా మనస్సులోని ముచ్చట తీర్చలేవా?!—" అన్నాడు.

కాని అందుకామె ఇష్టపడలేదు. కరెంట్ షాక్ తిన్నట్లుగా వెనుకడుగేసింది— పెండ్లి అయిన తర్వాతే నీ కోరిక తీరుతుంది!! అన్నట్లు సైగతో చెప్పింది లక్ష్మి.

"అమ్మబాబోయ్ !! — ఘటికు రాలవే... ?! అయినా వున్నపాటున పెండ్లి ఎలా ?—కాని దైవసాన్నిధ్యంలో పెండ్లిజేసుకుంటాను, ఇప్పుడు—ఆ తర్వాత మా పెద్దవారితో వచ్చి వారి సమక్షంలో నిన్ను నా దాన్నిగా జేసుకుంటాను. అందుకు సమ్మత మేనా ?!—" అన్నాడు కండక్టరు.

"సరే !!—" అన్నట్లు లక్ష్మి తల వూపింది.

మరికొన్ని క్షణాలలో ఆ గ్రామానికి కొంతదూరంలో కొండ మీదున్న శివాలయం దగ్గరకు చేరుకున్నారా జంట.

దైవంచుట్టూ ప్రదక్షిణం జేసాక ఆ జంట దైవం ఎదుట నిలువబడ్డారు— ఆతర్వాత "నింగి నేలా,కనులమిరిమిట్లు, గాలిపే ఆ పర్వతశ్రేణి సాక్షిగా శివుని సమక్షంలో ఇరువురు దండలు మార్చుకొని ఒక్కటైనారు.

"లక్ష్మి ?! — కనిపించే దైవం సాక్షిగా నిన్ను నా అర్ధాంగిగా స్వీకరించాను. నేను జీవితాంతం నీ భారాన్ని మోస్తానని ప్రమాణం చేస్తున్నాను." అంటూ వరుడు వధువు చేతిలో చేయివేసి ప్రమాణం జేసాడు.

అంతే !!—లక్ష్మి మనస్సులో వేయి వెన్నెల రాత్రులు ఒక్కసారిగా ఉదయించాయి.

ఆ ఒక్క రాత్రిలో వారిరువురు ఒక్కటై కోటిపున్నమినాటి రాత్రుల అనుభూతిని పొందారు.

వారి ఆనందానికి, అనుభూతులకు అంతుతెలియని కాలంలో వారిని కల్లోల పరచింది మ్రోగుతూన్న కారుహారన్ మోత.

మగత నిద్రలోవున్న భర్తను తట్టి లేపింది చేత్తో.

నిద్రనుండి లేస్తూనే కారుహారన్ మోత విని కంగారుగా పడకపైనుండి లేచాడు.

ప్రక్కను ట్రే బాక్స్, క్యాషుబ్యాగు తీసుకుంటూ "లక్ష్మి వెళ్తాను. మా వాళ్లు వచ్చినట్లుంది" అన్నాడు కండక్టరు.

లక్ష్మి అమాంతం భర్త కాళ్ళమీద పడిపోయింది. మెల్లగా ఆమెను లేవదీస్తూ "లక్ష్మి!భగవంతుని సాక్షిగా నీ కెలాంటి అన్యాయం చెయ్యను—రెండు మూడు రోజులలోనే మా పెద్దవారితో వచ్చి నిన్ను నా యింటికి తీసుకొనిపోతాను. ధైర్యంగావుండు" అంటూ బయలుదేరిన కండక్టరుకు కన్నీటితో వీడ్కోలు చెప్పింది లక్ష్మి—

కండక్టరు బస్సుదగ్గర కెళ్ళేసరికి, "ఎక్కడ కెళ్ళావు ?!—" అన్నాడు డ్రైవరు.

ఇక్కడ ఎంతకూ నిద్రపట్టలేదు— ఇంతలో పాపం ఈ ముసలాయన తన మంచం యిచ్చాడు నిద్రపొమ్మని—

కమ్మగా నిద్ర పట్టింది రాత్రి—"
అన్నాడు.

అంతకుముందే బస్సును బాగుచేయుట కుపక్రమించిన మెకానిక్స్ మరి కొన్ని నిమిషాలలోనే పనిపూర్తిజేసి "ఒకె" అన్నారు.

"సరే, వస్తాం తాతా"—అంటూ మిగతావారితోపాటు బస్సులో ఎక్కాడు కండక్టరు కాని అతని మనస్సుమాత్రం నిండుగా తనలో లక్ష్మి రూపాన్ని నింపుకుంది.

మెల్లగా బయలుదేరి బస్సును వేగం ఎక్కువజేసాడు ఘాట్ రోడ్ చేరేసరికి.

అప్పుడే గగనమండలంలో ఎక్కడో వున్న చేరెడు మబ్బు జాలుగా వర్షంగా ప్రారంభమైంది—అది అంతై ఇంతై, దిక్కుకూడిశా తెలియని జడివానకు దారి తీసింది.

దారీతెన్నూ కనుపించని కారుచీకటిగా మారిన అలాంటి వర్షంలో ఎలాంటి ఆటంకాన్ని గూడా లెక్కచేయకుండా డ్రైవరు మాత్రం మార్గాన్వేషణలో నిమగ్నుడు కావటంలో బస్సుకు రోడ్డు స్లిప్ అయింది.

దాన్ని కంట్రోలు చేయబోయే స్థితిలో బస్సు రోడ్డు చివరికి వచ్చింది. రోడ్డుచివరనున్న బస్సును స్టడీచెయ్యబోయేసరికి కంట్రోలుతప్పి రోడ్డుక్రింది భాగంలోవున్న అఘాతమైన లోయలో పడిపోయింది బస్సు—

అంతే !!

భగవంతుడు తీరని అన్యాయమే చేసాడు లక్ష్మికి.

కన్యగా—వస్తాడు అన్న ఆతృతతో ఎన్నో ఆశలు పెంచుకొని చూసింది—రాలేదు. కొన్ని మాసాలకు ఆమె తల్లి కూడా అయింది.

అయినా రాలేదు!! రాలేదు! రాలేదు!! అన్న ఆశ ఆపేక్షలే కాని ఎందుకు రాలేదో అన్న ఆలోచనే ఆమెకు లేదు—రాదు కూడా !!

వచ్చేపోయే బస్సులను ఆపుతూ తన మనిషి రాలేదన్న నిరాశతో అలమటిస్తూ బ్రతకడం ఆమెకు పరిపాటై పోయింది నిత్యజీవితంలో—

అయినా ఆమె అంతులేని అన్వేషణకు అంతమెప్పుడో అర్థంకాదు—అర్థం లేదు" —



# ప్రజలదే భారం!

వరా యజమానులు నన్ను నట గండభేరుండను ఇంటర్వ్యూ చేసి, ఆ చేత్తోనే కలర్ ఎడ్వర్టయిజ్‌మెంట్ ఒడుచుకు రమ్మన్నారు.

గండభేరుండంగారికి సాష్టాంగ దండ ప్రణామా లాచరించి, "గండంగారూ, మీరు నటించిన చిత్రం "చవట చిన్నోడు" నూరు వారాలు పోయేట్టున్నందుకు ప్రపంచ ప్రజానీకమంతా గర్వించదగిన మాట నిజమే గాని, అది బొత్తిగా చవుకబారు అభిరుచులతో కూడిఉన్నదని ఒకరూ, ఇద్దరూ కాదు, అనేకమంది అనటం గురించి తవరేమంటారు ?" అని అడిగాను.

దానికి భేరుండంగారు, "నాకు ఒకరితో పనిలేదు. ప్రజాభిప్రాయానికి తలొంచుతాను," అని నాకేసి తలొంచాడు, ప్రజాభిప్రాయ మన్నట్టు.

ఇది తొమ్మిదినెల్ల కిందటి మాట. ఈ లోపుగా గండభేరుండంగారు నటించిన చిత్రాలు మూడు టపాకాయలు పేలినట్టే పేలాయి. ఈ సారికి నేనే శ్రీవారిని కలుసుకుని, "తవరి పిచ్చెర్లీమధ్య రెండు మూడు రోజులైనా ఆడక పోవటానికి కారణం ఏమి టంటారు ?" అనడిగాను.

శ్రీవారు పెదవి విరిచి. తల ఒక పక్కకు వంచి ఆలోచించి, "చూడండీ ! మన పిచ్చెర్లలో మంచి అభిరుచి ప్రతిబింబించేటట్టు చూసే బాధ్యత ప్రజలది. దిగజారిపోతున్న చలన విచిత్ర పరిశ్రమను ప్రజలే ఉద్ధరించాలి" అని సెలవిచ్చారు.

*కొడవటిగంటి కుటుంబరావు*

# అరేబియన్ నైట్స్




# దరిద్రుడిం బానిస – 4

బర్సూమ్‌ను చూడగానే జుముర్రుద్ కళ్ళు ఆగ్రహంతో ఎర్రబడ్డాయి. అయినా ఆమె తన క్రోధాన్ని మాటల్లో తెలియనియ్యక, "ఒరే, నీ పేరేమిటి ? నీది ఏం వృత్తి ? మా దేశానికి ఎందుకు వచ్చావు ?" అని అడిగింది.

ముసల్మానులు మాత్రమే ధరించ దగిన తెల్ల తలపాగా ధరించి ఉన్న ఆ క్రైస్తవుడు, "మహారాజా, నా పేరు అలీ. లేసు అల్లటం నా వృత్తి. ఆ వృత్తితో పొట్టపోసుకుందామని ఈ దేశం వచ్చాను," అన్నాడు.

జుముర్రుద్ తన బానిసచేత ఇసుకా, రాగి కలమూ తెప్పించి, ఇసుకను బల్ల మీద పరిచి, రాగి కలంతో దానిమీద ఒక కోతి బొమ్మా, ఏవో అర్థంగాని అక్షరాలూ రాసి, వాటికేసి కొంతసేపు పరీక్షగా చూసి, భయంకరమైన కంఠ స్వరంతో, "కుక్కా ! నాకే అబద్ధం చెబుతున్నావా ? నువు క్రైస్తవుడివి కాదూ ? నీ పేరు బర్సూమ్ కాదూ ? నువు కాజేసిన ఒక బానిస పిల్లకోసం వెతుకుతూ కాదూ నువు ఈ దేశం వచ్చిందీ ? నా మంత్రపు ఇసుక స్పష్టంచేసిన ఈ నిజాన్ని ఒప్పుకో !" అన్నది.

క్రైస్తవుడు బెదిరిపోయి, చేతులు జోడించి, రాజు దగ్గిరికి పాకుతూ వెళ్ళి, "దయతలచండి, మహాప్రభో ! నేను తమరిని మోసం చెయ్యను. అల్లా తమర్ని కటాక్షించాలి ! నిజంగా నేను క్రైస్తవుణ్ణే. నేను ఒక ముసల్మాను పిల్లను దొంగిలిస్తే, ఆమె నా ఇంటి నుంచి పారిపోయింది. ఆమెను చెరపట్టుకు పోవటానికే ఈ దేశం వచ్చాను," అన్నాడు.

జుముర్రుద్ పౌరులు ఆమెమీద ప్రశంసావర్షం కురిపిస్తూ, "అల్లా, అల్లా ! మన ప్రభువుగారిలాగా ఇసుక జోస్యం చెప్పగలవారు ప్రపంచంలో ఇంకెవరుంటారు ?" అన్నారు. ఆమె తన తలారినీ, అతడి అనుచరులనూ పిలిచి, "ఈ పిచ్చికుక్కను నగరం వెలపలికి తీసుకుపోయి, వీడి చర్మం ఒలిచి, అందులో గడ్డి కుక్కి, కోట గోడకు వేళ్ళాడగట్టి, వాడి శరీరాన్ని పిడకలతో కాల్చి, బూడిదను మురుగు కాలవలో వెయ్యండి," అన్నది.

తలార్ల బృందం క్రైస్తవుణ్ణి తీసుకుపోయి, ఆమె చెప్పిన ప్రకారమే చేశారు. జుముర్రుద్‌ను పరివేష్టించి ఉన్నవాళ్ళు ఆమె తీర్పు న్యాయంగానే ఉన్నదన్నారు. బర్సూమ్ సమీపంలో భోజనం చేసిన వాళ్ళు, అతనికి పట్టిన గతిచూసి, అతను మెక్కిన పదార్థాన్ని జన్మలో ముట్టమని ఒట్లు వేసుకున్నారు.

మరుసటి నెల ప్రజలు రాజుతోపాటు విందు చేసినప్పుడు ఆ పదార్థంగల పాత్రకేసి ఎవరూ చూడనైనా చూడ లేదు, తమకు దూరంగా ఉన్న దాని కోసం ఎవరూ చేతులు చాచలేదు; తమ ముందుంచిన ఆహార పదార్థాలను అందరూ తృప్తిగానే తిన్నారు.

విందు జరుగుతూండగా ఒక భయంకరాకారుడు అందరినీ ఎడాపెడా తోసుకుంటూ వచ్చి, అందరూ దూరంగా ఉంచిన పాత్రకు సమీపంలో ఉన్న ఆసనం మాత్రమే ఖాళీగా ఉండటం చూసి, అందులో కూర్చున్నాడు. అతను ఆ పాత్రనుంచి ఆహారం తీసుకోవటం చూసి, అందరికీ గుండె ఆగినంత పనిఅయింది.

వాణ్ణి చూస్తూనే జుమ్ముర్రుద్ గుర్తిం చింది. వాడు జవాన్, అహ్మద్ అల్ దనఫ్ అనేవాడి నాయకత్వంకింద ఉన్న నలభై మంది దొంగలలో ఒకడు. వాడు కూడా జుమ్ముర్రుద్‌ను వెతుకుతూనే ఇక్కడికి వచ్చాడు. ఎందుకంటే, వాడు ఆమెతో భోగించటానికి తన అనుచరుల నందరినీ తీసుకుని వచ్చేసరికి ఆమె తప్పించుకుని పారిపోయి ఉండటం చూసి వాడికి చాలా కోపం వచ్చింది. ఆమె సప్తసముద్రాల అవతల గాజు చిప్పలో దాక్కున్నా తెస్తానని వాడు శపథం చేసి ఉన్నాడు. అందుకోసం తిరుగుతూ వాడు జుమ్ముర్రుద్ పరిపాలించే నగరానికే వచ్చాడు.

వాడు పాత్రకు ఎదురుగా కూర్చుని, అందులో చెయ్యిపెట్టగానే, పక్కన ఉన్న వాళ్ళు, "ఏం చేస్తున్నావు ?, "జాగ్రత్త !, "నీ చర్మం వొలు స్తారు !" అని హెచ్చరించారు. అయినా వాడు అందరికేసీ భయంకరంగా చూసి, "నోరు ముయ్యండి ! ఇది నా కిష్టమైన వంటకం !" అన్నాడు.

"నిన్ను చంపి, నీ చర్మం వొలు స్తారు !" అని పక్కనున్నవాళ్ళు వాణ్ణి హెచ్చరించారు. వారలా అనగానే వాడు పాత్రను దగ్గిరికి లాక్కుని, అందులో చెయ్యి ముంచి జుర్రుకోసాగాడు. సమీపంలో ఉన్న గంజాయిభాయిగాడు, ఆ నేరంతో తనకు ఎలాటి ప్రమేయమూ లేనట్టు దూరంగా పారిపోయాడు.

జవాన్ ఆ పాత్రలోని పదార్థాన్ని లొట్టలు వేసుకుంటూ ఆరగిస్తూ ఉండగా, జుమ్ముర్రుద్ పంపిన మనుషులు వచ్చి వాడిమీదపడి, చేతులు కట్టి, రాజు దగ్గిరికి ఈడ్చుకుపోయారు.

"వాడిదే తప్పు ! దాన్ని తాకవద్దని మనం హెచ్చరించాం," అని అతిథులు అన్నారు.

"నీ పేరేమిటి ? నీది ఏం వృత్తి ? ఈ దేశానికి ఎందుకు వచ్చావు ?" అని జుమ్ముర్రుద్ జవాన్‌ను అడిగింది.

"నా పేరు ఉశ్మన్. నేను తోటపని చేస్తాను. పని దొరుకుతుందేమోనని ఈ నగరం వచ్చాను," అన్నాడు దొంగ.

ఆమె మళ్ళీ ఇసుకా, రాగికలమూ తెప్పించి, ఇసుకలో ఏవేవో బొమ్మలు గీసి, వాటికేసి కొంతసేపు చూసి, "దగుల్బాజీ, నీ గీత బాగులేదు. నా జోస్యం చెబుతున్నది- నీ పేరు జవాన్, నువు కుర్ద్ జాతివాడివి. నీ వృత్తి దొంగతనమూ, హత్యలూ. నిజం ఒప్పుకో," అన్నది.

ఈ రాజే తాను వెతుకుతున్న పిల్ల అని వాడికి తెలీదు. వాడు పాలి పచ్చ బడిపోయి, దవడలు భయంతో టక టక లాడుతూ, కుక్కలాగా కోరలు బయట పెట్టి, నిజంచెబితే ప్రాణం బచాయిస్తుం దనుకుని, "మీరన్నది నిజమే మహా

రాజా. ఇకనుంచీ సరిగా ప్రవర్తిస్తాను," అన్నాడు.

"నీవంటి పశువు ముసల్మానులాగా జీవించటానికి ధర్మం ఒప్పదు. వీణ్ణి తీసుకుపోయి, చర్మం వొలిచి, అందులో గడ్డి కుక్కి, కోటగుమ్మానికి వేళ్ళాడ గట్టి, శవాన్ని తగలేసి, బూడిద మురుగుకాలవలో చల్లండి," అన్నది జుముర్రుద్.

మళ్ళీ నెల తిరిగి, విందు దినం వచ్చింది. రాజూ, పౌరులూ విందులో పాల్గొంటూ ఉల్లాసంగా ఉన్న సమయంలో ఒక నూతన వ్యక్తి వచ్చి, నిషిద్ధ పదార్థంగల పాత్ర చెంత ఖాళీ చూసి, అక్కడ కూర్చున్నాడు. జుముర్రుద్ ఆ వ్యక్తికేసి చూసి, అతన్ని గుర్తించింది. అతను రషీద్ అల్‌దీన్, తనను పట్టుకోవటానికి తోడ్పడిన క్రైస్తవుడి సోదరుడు.

జరిగిన దేమంటే, రషీద్ తన సోదరుడికోసం ఒక నెలపాటు ఎదురు చూసి, ఆ పిల్లను వెతకబోయినవాడు ఎంతకూ రాకపోయేసరికి, ఆ పనిమీద తానే బయలుదేరాడు. కాలక్రమాన విధి అతన్ని ఇక్కడికి తెచ్చింది.

జుముర్రుద్ తన సేవకులను పిలిచి, ఆ బియ్యపు వంటకం పాత్రదగ్గిర కూర్చున్న వాణ్ణి లాక్కురండి," అన్నది- వాళ్ళు రషీద్‌ను గడ్డంపట్టుకుని ఈడ్చుకొచ్చారు

"నీ పేరేమిటి ? నీవృత్తి ఏమిటి ? ఇక్కడి కెందుకు వచ్చావు?" అని ఆమె వాణ్ణి అడిగింది.

"మహారాజా, నా పేరు రుస్తుం. దారిద్ర్యం తప్ప నాకు వేరే వృత్తి లేదు. నేను సన్యాసిని," అన్నాడు వాడు.

ఆమె ఇసుకా, కలమూ తెప్పించి, ఏవో గీతలు గీసి, వాటిని పరీక్షించి, తరవాత తల ఎత్తి, "చండాలుడా, రాజుకు అబద్ధం చెప్పావా ? నీ పేరు రషీద్ అల్‌దీన్. ముస్లిము ఆడపిల్లలను చెరపట్టటమూ, చెరచటమూ నీ వృత్తి. పైకి ఇస్లాము మతస్థుణ్ణని చెప్పుకుంటున్నా నువు క్రైస్తవ పాపివి. నిజం ఒప్పుకో. లేకపోతే ఈ క్షణమే నీ తల తెగి నీ కాళ్ళముందు పడుతుంది," అన్నది.

తన తల కాచుకునే ఉద్దేశంతో రషీద్ తన నేరాలన్నీ ఒప్పుకున్నాడు. జుముర్రుద్ వాణ్ణి బోర్లా పడుకోబెట్టించి, రెండు పాదాలమీదా వెయ్యేసి దెబ్బలు కొట్టించి, "వీణ్ణి తీసుకుపోయి, తోలు వొలిచి, గడ్డి కుక్కి, కోటద్వారానికి వేళ్ళాడగట్టి, శవాన్ని తగలేసి, బూడిద మురుగుకాలవలో కలపండి," అని తన సేవకులకు ఉత్తరు విచ్చింది.

విందు ముగిసినాక జుముర్రుద్ రాజ సౌధానికి తిరిగి వెళ్ళింది. అయితే ఆమె మనసుకు సుఖంలేదు. ఆమె పగ తీర్చు

కౌగలిగిందేగాని, అలీషార్‌ను పొంద లేకపోయింది.

ఈ విచారంతోనే ఆమె ఒక నెల గడిపింది. తిరిగి విందురోజు వచ్చింది. అందరూ విందులో పాల్గొంటున్నారు. ఆ సమయంలో ఒక యువకుడు వచ్చి, కూర్చునేటందుకు ఎక్కడా చోటు కనబడక, అందరూ పరిహరించే వంటకంగల పాత్రముందు కూర్చున్నాడు. అందరూ అతనికేసి బెదురు చూపులు చూశారు.

అతన్ని చూస్తూనే జుముర్రుద్ గుర్తించి తన నోటివెంట ఆశ్చర్యంతో కూడిన కేక వెలువడకుండా అతి కష్టం మీద ఆపుకున్నది. ఆమె తన ఉద్రేకాన్ని అదుపులోకి తెచ్చుకున్నమీదట అలీషార్‌కోసం మనుషులను పంపటానికి సాహసించింది...

అలీషార్, తెల్లవారి వర్తకులు దుకాణాలు తెరిచే సమయానికి ఒళ్ళు తెలిసి, తన తలపాగా, పైన ధరించే ఉడుపూపోయినట్టూ, తాను వీధిలో పడి ఉన్నట్టూ తెలుసుకుని, అతనికి నిజం తెలిసిరాసాగింది. అతను ముసలిదాని దగ్గిరికి పరిగెత్తిపోయి, తన ఇంటికి పోయి, పరిస్థితి తెలుసుకురమ్మన్నాడు. ఆమె కొంతసేపటికి తిరిగివచ్చి, "నాయనా, ఇక నీకు ప్రియురాలు దొరికే ఆశలేదు. ఇలా జరగటానికి కారణం నీ ప్రవర్తనే," అన్నది.

అలీషార్ దుఃఖంతో మూర్ఛపోయి, ముసలిది చేసిన సపర్యలతో స్పృహ వచ్చాక మంచం ఎక్కాడు. ముసలిది అతన్ని ఎంతో శ్రద్ధగా చూడకపోతే అతను బతికేవాడు కాడు. ఏదో వింత వ్యాధి అతన్ని పట్టుకున్నది. చివరకు ఆమే, "బాబూ, నువు ఇలా మంచాన పడి ఉంటే నీ ప్రియురాలిని కలుసుకో లేవు. లే, బలం తెచ్చుకో. తీర్థయాత్రల మీద బయలుదేరు. ఏ దారి ఎక్కడికి తీసుకుపోతుందో ఎవరు చెప్పగలరు ?" అని చైతన్యం కలిగించింది. స్నానశాలకు తీసుకుపోయి, స్వయంగా స్నానాలు చేయించి, షర్బత్తులు తాగించి, కోడికూరలు తినిపించింది. ఇలా ఒక నెల గడిచినాక అతనికి ప్రయాణం చేసేశక్తి వచ్చింది. అతను ముసలిదానివద్ద సెలవు పుచ్చుకుని తిరుగుతూ జుముర్రుద్ రాజ్యానికి వచ్చి, బియ్యపు పరమాన్నం పాత్రముందు కూర్చున్నాడు.

ఆకలిగా ఉన్నందున అతను చొక్కా చేతులు పైకి మడిచి, పాత్రలోకి చెయ్యి పెట్టి, తినసాగాడు సమీపంలో ఉన్న వాళ్ళు అతను అపాయంలో ఉన్నాడనుకుని, ఆ పదార్థం తాకవద్దని హెచ్చరించారు. అతను వినకపోయే సరికి గంజాయిభాయి, "నువు చస్తావు! నిన్ను ఉరితీస్తారు !" అన్నాడు.

"చస్తే పీడే విరగడ అవుతుంది! నాకిది తినాలని ఉంది, "అన్నాడు అలీషార్.

అతన్నే గమనిస్తున్న జుముర్రుద్, "అతని కడుపు నిండినాక పిలిపిస్తాను,"

అనుకుని, అతను తినటం పూర్తిచేసి అల్లాకు ధన్యవాదాలు చెబుతూండటం గమనించి, తన మనుషులను పిలిచి, "ఆ మనిషిని నా దగ్గిరికి వచ్చి, నాతో మాట్లాడమని వేడుకుని, మర్యాదగా తీసుకురండి," అన్నది. వాళ్ళు వెళ్ళి, "తమరు వచ్చి మా రాజుగారితో మాట్లాడతారా ?" అని అలీషార్‌ను అడిగారు

అలీషార్ లేచి వాళ్ళవెంట బయలు దేరాడు. అతనికి ఏదో మూడిందని కొందరు అనుకున్నా, అతన్ని రాజ భటులు ఈడ్చుకుపోకపోవటం కొందరు గమనించారు.

అలీషార్ తనకు వందనంచేసి నిలబడగానే జుముర్రుద్ వణుకుతున్న గొంతుతో, "యువకుడా, నీ పేరేమిటి? నీ వృత్తి ఏమిటి ? మా నగరానికి ఏం పనిమీద వచ్చావు ?" అని అడిగింది.

"నా పేరు అలీషార్ అంటారు. మా తండ్రి ఖురాసాన్ దేశంలో వర్తకం చేసేవాడు. నాదీ అదే వృత్తి. అయితే దుర్దశ కారణంగా నేను నా దేశం విడిచి, నా ప్రియురాలిని వెతుక్కుంటూ ఇక్కడికి వచ్చాను. ప్రాణసమానురాలైన ఆమెను పోగొట్టుకుని, కలలో నడిచేవాడిలాగా సంచారం చేస్తున్నాను," అంటూ అలీషార్ దుఃఖం ఆపుకోలేక మూర్ఛపోయాడు.

జుముర్రుద్ అతనికి తన బానిసల చేత శైత్యోపచారాలు చేయించి స్పృహ తెప్పించింది. తరవాత ఆమె ఇసుకా, కలమూ తెప్పించి జోస్యం చెబుతున్నట్టు నటిస్తూ, "నువు చెప్పినదంతా నిజమేనని ఇసుకలో తెలుస్తున్నది, నువు నీ ప్రియురాలిని త్వరలో కలుసుకుంటావని జోస్యం చెబుతున్నది. అందుచేత విచారం మాను," అన్నది.

విందు ముగిసింది. అతనిచేత స్నానశాలలో స్నానం చేయించి, మేలి వస్త్రాలు కట్టించి, చీకటిపడగానే అతన్ని తన మందిరానికి తీసుకురమ్మని ఆమె తన బానిసలకు చెప్పింది. అంతా చూసి, విన్న పౌరులకు తమ రాజు ఈ యువకుడిపట్ల భిన్నంగా ప్రవర్తించటానికి కారణం ఊహించలేకపోయారు.

ఆ రాత్రి అలీషార్ రాజును కలవబోయి, అది జుముర్రుద్ అని తెలుసుకున్నాడు. ఆ రాత్రి ఇద్దరూ తమ విరహబాధను ఉపశమింపజేసుకున్నారు.

"మర్నాడు జుముర్రుద్ మగవేషం ధరించి తన ఉద్యోగులనందరినీ పిలిచి, నేను ఈ యువకుడితో కూడా ఈ నగరం విడిచి వెళ్ళిపోతున్నాను. గనక మీరు మరొక రాజును ఎన్నుకోండి," అని చెప్పింది. అధికారులు తమ రాజు కోసం అనేక కంచర గాడిదలూ, ఒంటెలూ సిద్ధంచేసి, వాటిమీద ఆహారమూ, మణి మాణిక్యాలూ, బంగారమూ, ధనరాసులూ పెట్టి, జుముర్రుద్‌కు ఆమె బానిస లిద్దరినీ ఇచ్చి, ఖురాసాన్ దేశానికి సాగనంపారు.

(అయిపోయింది)

# ఉద్ధరింపు

(గల్పిక)

"చిన్నపల్లిలో పదహారుమంది హరిజనులను భూస్వాముల గూండాలు—"

"పాపం !"

"పెద్దపల్లిలో ఎనిమిది మంది హరిజన స్త్రీలను ముగ్గురు భూస్వాములు—

"పాపం ! పాపం !"

"మధ్యకుంటలో నాలుగు వందల హరిజన గుడిసెలకు నిప్పు పెట్టగా అయిదుగురు హరిజన వృద్ధులూ, ఇరవై ఇద్దరు హరిజన బాల బాలికలూ—"

"దారుణం ! దారుణం !"

"బిక్కచచ్చినోళ్లో పదిహేనుమంది హరిజనులు—"

"ఘోరం !"

"—భూస్వాములమీద కొడవళ్ళతో తిరగబడి, ఇద్దరు భూస్వాములను చంపి, మరి ముగ్గురిని గాయపరచి—"

"వాళ్ళందరికీ ఉరిశిక్ష పడేటట్టు చూస్తాం ! దేన్నయినా సహిస్తాం గాని, అరాచకాన్ని—"

---

*కొడవటిగంటి కుటుంబరావు*

---




చంద్రం రామేశ్వర్‌ను కలిసి విషయం వివరించి, లెటర్ చూపించాడు. ఆ లెటర్ చూడగానే వుగ్రనరసింహావతార మెత్తారు కృష్ణయ్యచౌదరిగారు. ఆ లెటర్ వాళ్ళ బంధువుల్లో ఎవరూ వ్రాసి వుండరనే విషయం స్పష్టమైంది. లోంపూర్ మున్సబుకూ, కృష్ణయ్యగార్కీ మొదటి నుంచీ స్పర్ధలున్నాయి. మామూలు గ్రామ రాజకీయాల్లో వొక భాగంగా పెద్ద వాళ్ళ శత్రుత్వాలు పిల్లలకూ వారసత్వంగా అబ్బాయి. మున్సబుగారి అబ్బాయి కుమార్‌కూ, రాజేశ్వర్‌కూ ప్రతి విషయంలోనూ పందాలూ, పట్టుదలలూ వున్నాయి. ఇద్దరూ ఒకేసారి కాలేజీలో చేరారు. అక్కడా తమ ఆధిక్యతను నిలుపుకోడానికి ఆ రెండు సంవత్సరాల్లోనే కావల్సినంత హంగామా చేశారు. ఆఖరికి చదువుకు స్వస్తివాచకం పలకడంకూడా ఒకేసారి జరిగింది. ఇంక వూళ్ళోచేరిన దగ్గరనుంచీ వ్యాపారం మొదలెట్టాలని రాజేశ్వర్ ప్రయత్నిస్తుంటే తనూ వ్యాపారమే చేయాలని పట్టుదలగా వున్నాడు కుమార్. లెటర్ చూడగానే అది కుమార్ పనే అయ్యుంటుందని తేల్చేశాడు రాజేశ్వర్. సందేహాలు తీరిపోయాయి. గ్రామాల్లో వుండే మామూలు రాజకీయాల్లో ఒక భాగంగా రాజేశ్వర్ పెళ్ళి ప్రయత్నం జరిగింది. విషయం విశదంకావడంతో అంతా కుదుటపడ్డ హృదయాలతో ఆనందంగా పెళ్ళి

సందర్భంలో పాల్గొన్నారు. రాంపూర్ గ్రామస్థులు కొందరు పెళ్ళికి వచ్చినవారు మున్సబ్ మీద ప్రచారానికి మరోఆయుధం దొరికిందని తలచి సంతోషపడ్డారు.

కాంత పెళ్లిలో వుత్సాహంగా పరుగులు తీస్తూ అన్ని పనులూ అవలీలగా సమర్ధించుకుపోతున్న మధు చాలామందిని ఆకర్షించింది. అలాగే శ్రీధర్‌గారిని కూడా పరిచయమైన క్షణంనుంచీ ఆత్మీయంగా పలకరిస్తూ ఆయనకు కావలసినవన్నీ టైమ్‌కు అందజేస్తూ ఆయన అభిమానానికి పాత్రురాలైంది.

"బాబుగారూ! మీకు కాఫీ తెమ్మంటారా? టీ తెమ్మంటారా?" అని అడుగుతున్న మధును చూసి ముచ్చటపడి "చూడమ్మా! నన్ను బాబుగారూ అని పిలవకు. నీ యిష్టమొచ్చిన వరసతో పిలువు, పలుకుతాను" అంటూ చిన్నగా నవ్వుతున్న శ్రీధర్‌గారి మాటల్లోని ఆప్యాయతకు మధు మనసు కరిగిపోయింది. అలాగే చూస్తున్న మధుని చూసి, "బాబుగారూ! అని పిలిస్తే నేను మీకు చాలా పరాయివాడిననే ఫీలింగ్ వస్తోందమ్మా! అందుకని" అంటున్న ఆయన మాటలను మధ్యలోనే ఆపుతూ, "అలాగే మావయ్యగారూ!" అంటూ ముందుకు కదిలిన మధుని పిలిచి "మళ్ళీ మావయ్యగారు! ఎందుకమ్మా? మావయ్యా అను చాలు" అంటున్న శ్రీధర్ మాటలకు ఒక్కసారి చనిపోయిన గోపాలం మావయ్య గుర్తొచ్చి కళ్ళు నీటితో నిండిపోయాయి మధుకి...

...మొట్టమొదటిసారిగా గోపాలంగారు కలకత్తా వెళ్ళినప్పుడు కొత్తగా చూసిన ఆయన్ని చనువుగా పిలవడానికి భయపడి "మావయ్యగారూ" అంటూ ఏదో చెప్పబోయిన మాధవిని దగ్గరకు తీసుకొని "మధూ! మావయ్యా అని పిలువమ్మా చాలు" అంటూ తల నిమిరిన గోపాలం మావయ్య ఆత్మీయతలోని మాధుర్యం గుర్తొచ్చింది. మళ్ళీ ...అలా పిలిపించుకుంటున్న శ్రీధర్ గారికి మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకుంటూ కళ్ళలో నిండిన నీరు క్రిందికి జారకుండా అతి ప్రయత్నం మీద నవ్వడానికి ప్రయత్నిస్తూ "కాఫీ తెస్తాను మావయ్యా!" అంటూ లోపలికి పరుగెత్తింది మాధవి.

అలా పరుగెత్తుతున్న మాధవిని చూస్తుంటే ఎవరో స్మృతిపథంలో మెదిలారు శ్రీధర్‌గారికి. మాధవిని చూస్తుంటే ఏదో తెలీని ఆత్మీయత కలుగుతోంది. ఆ చిన్న ముఖంలో తొంగిచూసే అమాయకత్వం, దానితో పోటీపడే గంభీరత, కార్యదీక్ష, అంతలో చిలిపితనం చిందులువేసే ఆ ముఖం, ఎప్పుడో ఎక్కడో తనకు బాగా పరిచయమైంది

శ్రీధర్‌గారి ఆలోచనలు ఇరవై అయిదు సంవత్సరాలు వెనక్కు పరుగులు

వచ్చిన రాంతో సరిగ్గా మాట్లాడను తీశాయి. అప్పుడు తాను ఎమ్.ఎ. చదువుతుండగా తనకు జూనియర్‌గా పరిచయమయ్యాడు శ్రీరాం. అతనూ హాస్టల్‌లో తనతోపాటు వుండటమేకాక తన రూమ్‌మేట్ కూడా కావడంవల్ల, చాలా కొద్దిరోజుల్లోనే తమ యిద్దరి మధ్యా పరిచయం స్నేహంగా మారింది. ప్రాణ స్నేహితులంటే వాళ్ళే అని నిర్వచనం చెప్పగలంత గొప్పగాసాగింది తమ స్నేహం. వాళ్ళిద్దరూ జంటగా వెళుతుంటే చూసిన మిగతా ఫ్రెండ్స్ "కృష్ణార్జునులు వెళుతున్నార్రోయ్" అని కేకలు వేసేవారు. తాము వాళ్ళమాటలు వింటూ సరదాగా నవ్వుకునేవాళ్ళు. శ్రీధర్ "ఒరేయ్ రాం! నేను నీకంటే సీనియర్‌ను, పెద్దవాడిని కనుక నేను కృష్ణుణ్ణి, నువ్వు అర్జునుడివి సమ్మత మేనా ?" అంటే "అరేయ్ శ్రీ. అనవస రంగా చిక్కులో పడిపోతున్నావు. సుభద్రను వెదికే పూచీ నీదే అవుతుంది జాగ్రత్త !" అని బెదిరించేవాడు శ్రీరాం. "నాకు చెల్లెళ్ళుంటే సంతో షంగా యిచ్చేవాడినిరా ! కానీ నా దురదృష్టం. నాకు చెల్లెలు లేదు నీకా అదృష్టంలేదు " అని నవ్వేసేవాడు శ్రీధర్. ఎటు వెళ్ళినా సరదాగా యిద్దరూ కలిసి వెళుతుండేవారు. వాళ్ళ స్నేహాన్ని గురించి కాలేజిలో కథలుగా చెప్పుకునేవారు. ఒకళ్ళకోసం మరొకరు ప్రాణమివ్వడానికైనా సిద్ధమే అని. అను కోకుండా జరిగిన ఓ సంఘటన వాళ్ళి ద్దరినీ ఒకళ్ళ విషయాలు ఒకళ్ళు తెలుసుకోలేనంత దూరంగా విసిరేసింది.

కాలేజి బ్యూటీగా పేరుతెచ్చుకున్న బిందు వాళ్ళిద్దరి మధ్యా అడ్డుగోడగా నిలిచింది. శ్రీధర్‌తో కావాలని పరిచయం పెంచుకొని ఏ కొంచెం టైమ్ దొరికినా అతన్ని తమ యింటికి ఆహ్వా నించడం, అతనితో కబుర్లు, సినిమాలు, షికార్లు వీటితో శ్రీధర్‌ని పూర్తిగా పిచ్చి వాడిని చేసింది. అతనికి బిందు తప్ప మరోలోకం తెలీనంతగా మారిపోయాడు. ఆ విషయంలో హెచ్చరించబోయిన రాంను కసురుకున్నాడు. బిందు సలహా మీద హాస్టల్ వదిలి వేరే రూమ్ తీసు కున్నాడు. విచ్చలవిడిగా తిరిగేవారు. కాలేజి ఎగ్గొట్టి సినిమాలూ, షికార్లు చేసిన రోజులెన్నో. అన్నదమ్ముల్లా మెలిగిన శ్రీరాం, శ్రీధర్‌లు ఒకరిని చూసి ఒకళ్ళు తప్పుకు తిరగటం మొద లెట్టారు. ఏదో తప్పుచేస్తున్నట్లు మన సులో బాధగా వున్నా ఏనాడూ మనసు విప్పి మాట్లాడుకోడానికి ప్రయత్నించ లేదు శ్రీధర్. ఆ రోజుల్లోనే బి యే. పూర్తి కాకుండానే కాలేజి వదిలేశాడు శ్రీరాం. ఎందుకు వెళ్ళిందీ ఎక్కడికి వెళ్ళిందీ శ్రీధర్ కిప్పటివరకూ తెలీదు.

చివరిసారిగా తనను చూడటానికి

కూడా మాట్లాడకుండా బిందు రాగానే "సారీ! బ్రదర్, మళ్ళీ కలుద్దాం!" అంటూ బిందు ప్రక్కనే కార్లో కూర్చుని వెళ్ళిపోయాడు తాను. కానీ యింతవరకు మళ్ళీ రాంను చూడలేకపోయాడు. అదే ఆఖరి కలయిక అవుతుందని తను అనుకోలేదు. ఆ రోజు కళ్ళ నిండుగా మెరుస్తుంటే సరిగ్గా యిలాగే...... మధులాగే నవ్వడానికి ప్రయత్నిస్తూ "ఫర్వాలేదు శ్రీ-గుడ్‌బై అండ్ గుడ్ లక్ టు యు" అంటూ వెళ్ళిపోయాడు తడబడే అడుగులతో. అలా వెళ్ళిపో తున్న రాంను చూసి వెంటనే కారు దిగి వాడితోపాటు నడిచివెళ్ళాలనే బలమైన కోరిక బిందు చల్లటి చేయి చేతికి తగల గానే మంచులా కరిగిపోయింది. దుమ్ము రేపుకుంటూ పరుగెడుతున్న కారు తన దృష్టినుంచి దూరంచేసింది రాంను. ఆ తర్వాత మళ్ళీ యింతవరకూ రాంను కలవలేదు. ఏమయ్యాడో? ఎలావున్నాడో కూడా తెలీదు.

కానీ యీ రోజు మళ్ళీ యిన్ని సంవత్సరాలకు మధు ముఖంలో తన ప్రాణమిత్రుడు రాం కనిపిస్తుంటే మనస్సు వశం తప్పింది. ఆలోచనల్లో వెనకటి స్మృతుల్లో మునిగి జ్ఞాపకాల పుటలు తిరగేస్తూ కళ్ళు మూసుకున్న శ్రీధర్ కళ్ళనుంచి అప్రయత్నంగా అప్పటి తమ స్నేహ మాధుర్యాన్ని తలుచుకొని, తమ స్నేహ మెంతటిదో తాను విడదీసి చూపిస్తానని కంకణం కట్టుకొని, తనతో ప్రేమ నాటకమాడిన బిందు తనను రాంను విడదీసి, తనూ దూరమైపోవడం జ్ఞాపకంవచ్చి. రాం మాటలు పెడచెవిని పెట్టి స్నేహమాధు ర్యాన్ని కాదని ప్రేమతరంగాల్లో తేలి పోవాలని కలలు కని, రెంటికీ చెడ్డ తన అవివేకం తలచుకొని రెండు కన్నీటి బిందువులు చెంపల మీదగా జారాయి.

* * *

అంతలో హడావుడిగా లోపలినుంచీ కాఫీ పట్టుకొచ్చిన మధు, "మావయ్యా! కాఫీ రెడీ!" అంటూ స్టూల్ ముందుకు జరిపి గ్లాస్ స్టూల్‌మీద వుంచి శ్రీధర్ వైపు నవ్వుతూ చూడబోయి హడావిడిగా కర్చిఫ్‌తో కళ్ళద్దుకుంటున్న శ్రీధర్‌ను విచిత్రంగా చూసింది. కారణం అడిగే చనువూ ధైర్యం లేకపోవడంవల్ల నెమ్మ దిగా మౌనంగా లోపలికి దారితీసింది

"మధూ!" పిలుపు...ఆ పిలుపు లోని ఆప్యాయత మాధవి అంతరం గాన్ని సృజించి మరుగున పడిన జ్ఞాపకాల్ని వెలికితీసినట్లయింది. తండ్రి బ్రతికుండగా తనని అలాగే పిలిచే వాడు. వెనుదిరిగి శ్రీధర్ వైపుచూసిన మధు కళ్ళు నిండుగా నీళ్ళున్నాయి. ఖంగారుపడిన శ్రీధర్ "ఏవిటమ్మా? ఎందు కలావున్నావు. నేనేమైనా అన్నానా పొరబాటుగా?" అన్నాడు. తొందరగా

శ్రీధర్ కుర్చీదగ్గరకు వచ్చి మోకాళ్ళ మీద కూర్చొని కుర్చీకి తలానించి "మావయ్యా! మరోసారి పిలవండలాగ! మరోసారి పిలవండి" అంటున్న మధు గొంతు వొణుకుతుండగా వెక్కి వెక్కి ఏడుస్తూ శ్రీధర్‌వైపు చూసింది. ఆర్ద్రమౌతున్న హృదయాన్ని చిక్కబట్టుకుంటూ "ఏవిటి మధూ! ఎందుకలా ఐపోతున్నావు? చెప్పమ్మా?" అంటూ బుజ్జగింపుగా అడుగుతున్న శ్రీధర్ చేతుల్లో వొరిగిపోయింది.

"మావయ్యా! మా నాన్నగారు నన్నలా పిల్చేవారు. మళ్ళీ మీరలా పిలుస్తుంటే మా నాన్నే తిరిగివచ్చి పిలిచినట్లయింది" అంది మాధవి ఏడుస్తూ. ఆమెను ప్రక్కన కుర్చీలో కూర్చోబెట్టుకుంటూ "మీ నాన్నగారి పేరేమిటమ్మా! చంద్రం ఏదో మాటల సందర్భంలో ట్రాం యాక్సిడెంట్‌లో పోయారనీ కలకత్తాలోనే వుండేవారనీ చేప్పాడు. నేను కలకత్తా వచ్చిపదేళ్ళపైనే అయింది. మీరు ఎక్కడ వుండేవాళ్ళు?" అన్నాడు శ్రీధర్.

"మేము బాలీగంజ్‌లో వుండేవాళ్ళం. మా నాన్నగారి పేరు శ్రీరాం. ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసులో పనిచేసేవారు" అంది మాధవి.

శ్రీరాం...శ్రీరాం...ఆ పేరు పదే పదే చెవుల్లో మారుమ్రోగుతున్నట్లైంది. శ్రీధర్ మనసులోవున్న సందేహం తీరిపోయింది. మాధవి అచ్చు రాం పోలికలతో వుండటంవల్ల ఆ ముఖం తనకు ఎంతో కాలంగా పరిచయమైనదిగానూ, ఆత్మీయంగానూ అన్పించడం చూసి శ్రీధర్‌కు ఆశ్చర్యమేసింది. తన ప్రియమిత్రుడు చనిపోయాడా? పిల్లలను దిక్కులేని వాళ్ళను చేసి, ఆ వూహే భరించరానిదిగా వుంది శ్రీధర్‌కు. కానీ అక్షరాల నిజమై మాధవి రూపంలో ఎదురుగా కన్పిస్తుంటే ఎలా కాదనడం? అలాగని మాధవి ముందు బయటపడటానికి తన మన స్సంగీకరించడంలేదు.

"నేనలా రఘుపతిగారింటి కెళ్ళొస్తానమ్మా! జరిగిపోయిన విషయాలు పదే పదే జ్ఞాపకంచేసుకొంటూ బాధపడకు. మీ నాన్నగార్ని నీకు తిరిగి యివ్వలేకపోయినా యీ మావయ్య ఒకడున్నాడని గుర్తుచేసుకోమ్మా!" అంటూ ఆర్ద్రమౌతున్న గొంతుతో మాధవి తల నిమిరి, నెమ్మదిగా లేచి బయటకు అడుగులు వేశారు శ్రీధర్. భారంగా అడుగులు వేస్తూ వెళ్ళిపోతున్న శ్రీధర్‌లో తన జీవితంనుంచీ తప్పుకున్న యిద్దరు అతి ముఖ్యులైన ఆత్మీయుల్ని చూసి కన్నీళ్ళు తుడుచుకుంటూ లోపలికెళ్ళింది మాధవి.

*　　*　　*

శాంత పెళ్ళి వైభవంగా జరిగిపోయింది. వచ్చిన బంధువులందరూ

ఒక్కొక్కరే సామాన్లు సర్దుకొని ప్రయాణమౌతున్నారు. ఆ రాత్రిబండికి వెళ్ళిపోవాలని శ్రీధర్‌గారు, సుషమ, శిరీష్ ప్రయాణమౌతున్నారు. చంద్రం మరో రెండురోజు లాగమని బలవంతం చేస్తున్నాడు.

"మళ్ళీ నీ పెళ్ళికి వస్తాంలేవోయ్ ! శలవుల్లేవు నాకు" అంటున్న శ్రీధర్ వైపుచూసిన మాధవి యిదే సమయ మనుకొని "సుషమ పెళ్ళెప్పుడు మావయ్యా ?" అంది. "నీ పెళ్లైన తర్వాతమ్మా !" అన్నాడు శ్రీధర్ చిన్నగా నవ్వుతూ. "పోండి మావయ్యా! నాతో పెట్టుకుంటే యిక సుషమ పెళ్ళి అయినట్లే... నేనొక సంబంధం చూశా సుషమకు, చెప్పనా ?" అంటుంటే చంద్రం సుషమ, శిరీష్ ఆశ్చర్యంగా చూశారు మాధవి వైపు. విచిత్రంగా కళ్ళుతిప్పుతూ, "ఆహా ! యిప్పుడుకాదు. వివరంగా మీకు వుత్తరం వ్రాస్తాను. ప్రస్తుతానికి సస్పెన్స్" అంది మళ్ళీ.

"సరే అలాగే తప్పకుండా లెటర్ వ్రాయి. అందులోనే నీ సంబంధం విషయంకూడా వ్రాస్తే రెండూ ఒక్కసారే చేసేయొచ్చు. ఏవోయ్ చంద్రం ?" అన్నాడు నవ్వుతూ శ్రీధర్. ఏం సమాధానం చెప్పాలో తెలీక అయోమ యంగా నవ్వాడు చంద్రం. ఆ నవ్వు ఆ తత్తరపాటు చూసి శిరీష్‌కూ, సుషమకు, మాధవికీ, శ్రీధర్‌గారికీ నవ్వాగలేదు. అంతా పెద్దగా నవ్వేశారు.

అప్పుడే లోపలికొస్తున్న శేఖర్ "ఏవిటి అంకుల్ ! నవ్వుల పువ్వులు కురుస్తున్నా యేవిటి కథ?" అని అడుగు తుంటే యింకా బెదురు బెదురుగా చూస్తూ తనూ నవ్వడానికి ప్రయత్నిస్తున్న ట్లున్న చంద్రాన్ని చూపించింది సుషమ. శేఖర్‌కూడా నవ్వి, "ఒరేయ్ చందూ, ఏవిటిరా అలా తెల్లముఖం వేశావ్ ?" అంకుల్ చేతిలో చిక్కావంటే చిత్తయి పోయావన్నమాటే..." అంటుండగానే "అన్నట్లు నీ పెళ్ళెప్పుడోయ్ ?" అని అడిగారు శ్రీధర్‌గారు శేఖర్ వైపు తిరిగి. బాంబు తన మీద పేలేసరికి ఏం చెప్పాలో తెలీక తికమకపడుతున్న శేఖర్‌ను చూసి యీసారి నవ్వడం చంద్రం వంతైంది. అందరూ సరదాగా నవ్వుతూ ఏవో కబుర్లు చెప్పుకుంటుండ గానే రావయ్య "బాబుగారూ ! టైమైనా దండీ," అంటూ లోపలికొచ్చాడు, అందరి దగ్గరా శలవు తీసుకొని శ్రీధర్, శిరీష్, సుషమా కలకత్తా వెళ్ళిపోయారు. సుషమ మనసు గంగాపూర్‌లో వదిలేసి తనువు మట్టుకు తప్పనిసరిగా కలకత్తా కదిలించింది.

మళ్ళీ మాధవి స్కూల్ కార్య క్రమాలు మామూలుగా నిరాటంకంగా సాగిపోతున్నాయి. శ్యాంకూడా శ్రద్ధగా చదువుతున్నాడు. శాంత అత్తవారింటికి

వెళ్ళిపోయింది. శిరీష్ ఉద్యోగంతో చేరినట్లు, శేఖర్‌కు చంద్రానికి లెటర్ వ్రాశాడు. సుషమ బి. యస్. సి. ఫైన లియర్‌కు వచ్చింది. చంద్రం, శేఖర్‌లు మళ్ళీ పొలం పనుల్లో పడ్డారు. తాత్కాలి కంగా శేఖర్‌కు పెళ్ళి సంబంధాలు చూడటం ఆపేశారు రఘుపతిరావుగారు శ్యామలాదేవి మాటలవల్ల. అప్పుడప్పుడు మనస్సును మధిస్తున్న మాధవిని గురించిన మధురాలోచనలను ఆపలేక మధనపడుతున్నాడు శేఖర్.

ఆ రోజు పొలంనుంచి యింటికివచ్చి స్నానంచేసి, కాఫీ తాగి అలవాటు ప్రకారం గంగా తీరానికి బయలుదేరాడు శేఖర్. ఈ మూడు సంవత్సరాల్లో ఎంతో అభివృద్ధిని సాధించి చూపించాడు వ్యవసాయంలో. ఆ విషయంలో గంగాపూర్ ప్రజలందరూ శేఖర్‌ను దేవుడిలా తలుచుకుంటున్నారు. అత నొచ్చిన తర్వాతే ఏ గుర్తింపూలేకుండా వున్న తమ ఊరు, రాష్ట్రస్థాయిలో ఒక ప్రత్యేకమైన స్థానాన్ని సంపాదించ గలిగింది. అందుకు అహర్నిశలూ శ్రమ అనుకోకుండా జమిందారు బిడ్డైనా అందరితో కలసి పనిచేసిన శేఖర్ శ్రద్ధాశక్తులే కారణం. రఘుపతిరావు గారంటే భయంతోకూడి భక్తి గౌరవా లుంటే... శేఖరంటే చనువుతో కూడిన ప్రేమాభిమానాలు పెంచుకున్నారు గంగాపూర్ ప్రజలు.

అందరి అభిమానానికి పాత్రుడైనా శేఖర్‌కు బ్రతుకులో ఏదో వెలితి, లోపం అన్పిస్తోంది. ఇంట్లో అమ్మ సాధింపూ అలాగే వుంది. పాపం వాళ్ళ కోరికలు అసహజమైనవి కావు అందరిలాగే వాళ్లూ యింటికో లక్ష్మి కోడలుగా రావాలనీ, మనవడినీ, మనవరాల్ని ఎత్తు కోవాలనీ, వంశంపేరు నిలబెట్టే సంతానం కావాలనీ వుబలాటపడుతున్నారు. వాళ్ళ కోరికలు తీర్చడానికి వున్న ఒకే ఒక సాధనం శేఖర్. అందుకే అతని పెళ్ళి గురించి అంతగా ఆరాటపడుతున్నారు.

తనకూ పెళ్ళి చేసుకోవాలనే వుంది. కానీ తను మనసారా కోరుకునే మధు, బాధ్యతల బరువు లెత్తుకొని బాంధవ్యపు బంధాలకు బందీ అయింది. మనసు మహారణ్యంలా వుంది. ఆ అరణ్యరోదన ఎవరికీ వినిపించలేదు. తన బాధని అర్థంచేసుకొని ఓదార్చే ఆత్మీయుల్లేరు. ఆ ఊళ్ళో తను మనసు విప్పి ఏ విషయ మైనా చెప్పుకోగల ఆత్మీయుడు, ఆప్తుడు చంద్రం. అయితే చంద్రంతో మధు విషయం ఎలా మాట్లాడగలడు? ఒకవేళ చందూ మధుని పెళ్ళి చేసుకోవాలనే అభిప్రాయంలో వుంటే... స్నేహితు దయ్యుండి తను అడ్డుపడ్డట్లవుతుందేమో.

చల్లటి సాయంత్రం. ప్రశాంతంగా పారే పవిత్ర గంగానదీ తరంగాలపై నుంచి వీచే చల్లటిగాలి ప్రశాంతంగా ప్రకృతి అందాల్ని ఆస్వాదించే ప్రశాం

తత మనసున లేనపుడు ఎంతటి ఏకాంత మైనా ఎంత సుందర, సుమధుర పరిసరాలైనా మనసును ఆకర్షించలేవు. శేఖర్‌కు అత్యంత ప్రియమైన ఆ గంగా నదీ, ఆ చల్లని పిల్లవాయువులు, పొలాల లోని పూలనుంచీ వచ్చే సుమధుర పరిమళాలు, ఎటు చూచినా పచ్చగా కనుల కింపుగా పెరిగిన తోటలు, పొలాలు, ఏవీ శేఖర్ మనసుకు శాంతి నివ్వలేకపోయాయి. శేఖర్ అలా ఆలోచనల్లో వుండగానే తెల్లటి బట్టల్లో పూలరంగడిలా మెరిసిపోతూ, చెరగని చిరునవ్వుతో హాయిగా నవ్వుతూ చంద్రం వచ్చాడు

"ఏరా శేఖర్ ? ఏవి టివాళ నన్ను పిలవకుండానే వచ్చేశావ్ ? ఏకాంతమూ సాయంత్రమూ అని పాడుకోవాలన్పిం చిందా ?" అంటూ శేఖర్ వీపున ఓ దెబ్బవేసి ప్రక్కనే యిసుకలో కూర్చున్నాడు.

"ఏం లేదురా ! నిన్ను పిలుద్దామనే అనుకున్నాను. ప్రొద్దున రాంపూర్ వెళతానన్నావుగా, వెళ్ళివుంటావనుకొని, ఏదో పరధ్యానంగా ఆలోచిస్తూ వచ్చేశాను. రాంపూర్ వెళ్ళలేదా నువ్వు ?" అన్నాడు శేఖర్

శేఖర్ ముఖంలో అంతులేని అలసట కన్పిస్తోంది. చంద్రం ఆప్యాయంగా శేఖర్ చెయ్యందుకొని "అప్పుడే అంత పరధ్యాన మేవిటిరా ? రాంపూర్ ఎంత సేపు వెళ్ళిరావాలి ? ప్రొద్దున వెళ్ళి మధ్యాహ్నానికి తిరిగి వచ్చేశాను. శాంత వుండమని బలవంతం చేసింది. "మళ్ళీ వస్తాను, యింటిదగ్గర చాలా పనులున్నా యమ్మా !" అని బయటపడ్డాను. ఆ రాంపూర్‌లో ప్రొద్దుపోవడం మహా కష్టంరా. అన్నట్టు నిన్నడిగానని చెప్ప మంది శాంత. ఇంకో విశేషం చెప్పనా? శ్రీధర్‌గారు లెటర్ వ్రాశారు." అంటూ పరీక్షగా శేఖర్ వైపు చూశాడు. ఏదో దీర్ఘాలోచనలో మునిగి వున్నట్లున్న శేఖర్ చంద్రంవైపు తిరిగి "ఏం వ్రాశారు ?" అన్నాడు.

"నువ్వే చూడు" అంటూ జేబులో నుంచి కవర్ తీసి శేఖర్ కందించాడు చంద్రం. ఆ లెటర్ అందిస్తున్నప్పుడు చంద్రం అంతులేని ఆనందంతో వుక్కిరి బిక్కి రవుతున్నట్లు, అందమైన ఆ ముఖంలో ఏదో చెప్పలేని తృప్తి, ఓ రకమైన బిడియంతో రక్తమంతా ముఖంలోకి పాకినట్లు, వింత కాంతితో మెరిసిపోతున్న చంద్రంవైపు ఆశ్చర్యంగా చూసి లెటర్ విప్పాడు శేఖర్.

డియర్ చంద్రం !

ఆశీస్సులు !

నిన్ననే చి॥ మాధవి వ్రాసిన లెటర్ అందింది. అందులోని విషయాలు చదివి ఆశ్చర్యపోయాను. ఇన్నాళ్ళూ నువ్వు మాధవిని పెళ్ళిచేసుకుంటావనే అభిప్రా యంలో వున్నాను. కానీ మాధవి

తనంతట తానే 'సుషమను చంద్రం బావకిచ్చి వివాహం చేయాలని నా కోరిక. సాహసంతో నేను వ్రాస్తున్న ఈ విషయాన్ని అపార్థంచేసుకోక నన్ను మన్నించి యీ పెళ్ళి అయ్యేలా చూస్తా రని ఆశిస్తున్నాను.' అంటూ వ్రాసింది. పిచ్చిపిల్ల దానికి సుషమమీద నీ మీద వున్న అభిమానమంతా తన వుత్తరంలో పొందుపరచింది. నువ్వూ సుషమా యీ పెళ్ళికి సుముఖంగా వున్నారని మాధవి లెటర్ ద్వారా తెలుసుకొని నాకు చాలా ఆనందంగా వుంది. ఇన్నాళ్లూ తెలుగు మాట్లాడటానికే ముఖం వాచినట్లున్న మాకు మళ్ళీ గంగాపూర్ వచ్చినపుడు పునర్జన్మ ఎత్తినట్లైంది. ఆంధ్రదేశంలో అడుగు పెట్టిన అనుభూతి కలిగింది. ఆ వూరే అత్తవారిల్లు కావాలని సుషమ కోరుకుంటే అంతకంటే నాకు కావలసిన దేముంది ? పదిరోజుల్లో నేనే స్వయంగా వచ్చి మీ అమ్మగారితో మాట్లాడుతాను. మన ఆనవాయితీ ప్రకారం ఆడపిల్ల తండ్రిని కదా !

చంద్రం ! మరో "ముఖ్య విషయం. నాకు మాధవిని చూసినప్పటినుంచీ నా ప్రాణంతో ప్రాణమైన శ్రీరాం గుర్తొచ్చి ఎంతో బాధపడ్డాను. మధు నాకత్యంత ప్రియతమ మిత్రుడైన శ్రీరాం కూతురే అని తెలిసాక ఆ అమ్మాయిమీద వున్న అభిమానం ఆపేక్షగా మారింది. నాదో చిన్న కోరిక. మాధవి అంగీకరించే పక్షంలో మాధవిని నా కోడలిగా చేసుకుందా మనుకుంటున్నాను. ఈ రకంగానైన చనిపోయిన నా మిత్రుడికి ఆత్మకు శాంతి కల్గించిన వాడినౌతాను. ఈ విషయంలో నీ అభిప్రాయం వ్రాయ గలవు. శిరీష్‌కూడా అడ్డు చెప్పడనే నా అభిప్రాయం. మాధవికి, సావిత్రి పిన్నిగారికి నా మాటగా చెప్పగలవు. నేను వచ్చిన తర్వాత వివరంగా మాట్లాడుకుందాము.

నీ శ్రేయాభిలాషి
శ్రీధర్
ప్రేమాశీస్సులతో.

ఉత్తరం చదివిన శేఖర్ చంద్రం వైపు వెర్రిగా చూశాడు. తరువాత తనని తాను స్వాధీనంలోకి తెచ్చుకుంటూ "కంగ్రాచ్యులేషన్స్‌రా చందూ ! నాకు చాలా సంతోషంగా వుంది. నువ్వదృష్ట వంతుడివి. అయితే మధుచేత నువ్వే లెటర్ వ్రాయించావా ?" అన్నాడు సందేహం తీరక.

"లేదురా ! మధు యిలా వ్రాసినట్లు కూడా నాకు తెలీదు. కనీసం శ్రీధర్ గారికి లెటర్ వ్రాసినట్లే నాతో చెప్పలేదు. కొంటె పిల్ల మొత్తానికి తననుకున్నది సాధించి కానీ వదలేదు." అన్నాడు ఆప్యాయంగా మధును తలుచుకుంటూ. చంద్రానికి శేఖర్ ప్రవర్తన విచిత్రంగా వుంది. ఉత్సాహంతో వురకలు వేసే శేఖర్ ఆ శుభవార్త విని కూడా ఎందు

కుదాసీనంగా వున్నాడో, ఆ వార్త అతనిలో ఏ మాత్రం మార్పు ఎందుకు కలిగించలేకపోయిందో అర్థంకాక చంద్రం మనసు చిన్నబోయింది. తన వివాహ ప్రసక్తి ప్రాణమిత్రుడికి సంతోషకరమైనదిగా అన్పించకపోవ డానికి కారణం కనిపించలేదు చంద్రానికి.

ఇంతలో శేఖర్ లేచి బట్టలు దులుపుకుంటూ, "అయితే చందూ! మరి మధుకు శిరీష్‌ను చేసుకోడం యిష్టమేనా ?" ఆ మాట అడుగుతున్నప్పుడు ఎంత ఆపుకున్నా శేఖర్ కంఠం కొద్దిగా చలించింది. తనూ లేచి నుంచొని శేఖర్ భుజంపై చేయివేస్తూ "లేదురా ! మధూ అసలు పెళ్ళే చేసుకోనని మొండికేస్తోంది. పిన్నికూడా ఎంతగానో నచ్చచెప్పింది. నేనూ చెప్పి చూశాను, కానీ మధును వొప్పించలేకపోయాం. 'ఈ విషయంలో నన్నెవరూ బలవంతం చేయకం డత్తయ్యా !' అని అక్కడినుంచి లేచిపోయింది. దాని విషయం తల్చుకుంటే బాధగా వుంది. ఇంత చిన్న వయసులో ఎన్ని అనుభవాలు? కష్టాలు, కన్నీళ్ళు తప్ప మధు జీవితంలో ఏం అనుభవించింది ? పిచ్చిది కాకపోతే యింత చక్కటి అవకాశాన్ని ఎవరైనా కాదంటారా ? శిరీష్‌కు ఏం తక్కువ ?


ఐటెక్స్
సౌందర్య సాధనములు



నాణ్యతలో గొప్పది
అందమైన రంగులు







ARAVIND
LABORATORIES




MADRAS-600 033

చదువూ, సంస్కారం, వుద్యోగం అన్నీ వున్నాయి. మన అంతస్థుకు అంత మంచి సంబంధం రావడం మన అదృష్టం మధూ ! నా మాట కాదనకు." అని ఎన్నో విధాల నచ్చజెప్పాను

'అత్తయ్యనీ శ్యాంనీ అనాథల్లా వదిలి నా దారి నేను చూసుకోలేను బావా! నన్ను క్షమించు. నా కిప్పట్లో పెళ్ళి ఆలోచన లేదు,' అని ఖచ్చితంగా చెప్పేసింది. చిలిపిగా మాట్లాడే మధుతో ఎంత సేపైనా మాట్లాడగలను గానీ... అలా గంభీరంగా మారిపోయి అన్ని అనుభవాలూ గడించినట్లున్న ఆ మధు ముందు నిలబడి తర్కించడానికి నాకు ధైర్యం చాల్లేదు శేఖర్," అంటున్న చంద్రం, బాధను అణచుకునే ప్రయత్నంలో క్రింది పెదవిని పై పంటితో గట్టిగా నొక్కిపట్టి చెమ్మగిల్లిన కళ్ళను తుడుచుకున్నాడు, పై పంచతో.

ఇద్దరూ అలా మౌనంగా నడుచుకుంటూ చాలాదూరం వెళ్ళారు. మరోప్పుడైతే ఎన్ని కబుర్లు చెప్పుకునేవారో ! ఆ రోజులు క్షణాలుగా గడిచిపోయాయి ఈ రోజు క్షణ మొక యుగంగా గడుస్తోంది. చాలాదూరం అలా ఎవరి ఆలోచనల్లో వాళ్ళు నడచి, సూర్యాస్తమయాన్ని చూసి, నెమ్మదిగా గ్రామంవైపు నడక సాగించారు.

ఇల్లు చేరిన శేఖర్‌కు ఆ రాత్రంతా నిద్ర లేదు. ఒక ప్రక్క చంద్రం సుషమల పెళ్ళవుతోందని తెలిసి సంతోషంగా వున్నా, శ్రీధర్‌గారు మాధవిని కోడలుగా చేసుకునే అభిప్రాయాన్ని వెలిబుచ్చారని తెలియగానే ఓ క్షణం మాధవి అంగీకరిస్తుందేమో అన్న ఆలోచనతో హృదయస్పందన ఆగిపోయినట్లైంది. అదీ తేలిపోయింది చంద్రం మాటలతో.అయినా అసంతృప్తి, అసహనం మాధవి నిర్ణయం ఓ రకంగా బావున్నా, అసలు పెళ్ళే చేసుకోనని చెప్పడం శేఖర్ హృదయాన్ని గాయపరిచింది. అంటే మధూ యింక జీవితమంతా అలా పిల్లలకు పాఠాలు చెబుతూ శ్యాంనీ, సావిత్రమ్మగారినీ చూసుకుంటూ గడిపేస్తుందా ? మాధవిని గురించి తను అల్లుకున్న ఆశల పందిరి ఏం కావాలి ? మనసు తెలిసిన మాధవి మమతలో మునిగి, మనుగడ మధురతరం చేసుకోవాలనుకున్న తన కోరికలు ఏంకావాలి ? మధుకు తప్ప తన మనసులో మరో మగువకు స్థానం లేదు. అది తనకు బాగా అర్థమైపోయిన నిజం. తన మాటల్లో, కలల్లో, సుప్రసన్నంగా, సుమధురమైన చిరునవ్వుతో, సువిశాలమైన నయనాల్లో ఆత్మీయతా, అనురాగం నింపుకొని, కన్పించే మధు ముగ్ధమోహన రూపం హృదయాన్ని కదలించి, మొదటి చూపులోనే తన్నాకర్షించి మధుర మంజుల గాన మాధుర్యంతో అనురాగపు వారధి

క్రొత్తది!

అమృతాంజన్
లిమిటెడ్‌వారి
విశిష్టమైన

# ఆముదము

శుద్ధిచేసినది.
వాసనలేనిది.




మూడు
సైజులలో
లభిస్తుంది:
50 మిలి
100 మిలి
200 మిలి

అమృతాంజన్ ఆముదము

OBM 3270/3 TG

కట్టిన ఆ అమాయకపు చూపులను మరవడం ఎలా సాధ్యం ? ఎవరికి సాధ్యం ?

ఆ రోజు అప్రయత్నంగా దగ్గరకు తీసుకొన్నప్పుడు బెదురుగా, బిడియంగా కదలాడిన ఆ కళ్ళలోని తళుకు అనుక్షణం జ్ఞప్తికొస్తోందే... నిన్ను ఎలా మరువను మధూ? నువ్వు లేకుండా ఎలా బ్రతుకను ? నే నెన్నివిధాల అభివృద్ధిని సాధించినా, ఎంత పేరు గడించినా, నిన్ను పొందలేని నా జీవితానికి అర్థమే లేదనిపిస్తోంది. పరుల తృప్తికోసం మరొకరిని పెళ్లాడి మనసులేని మనువుతో జీవితాంతం బ్రతగ్గలేను. బాధ్యతల బరువుతో బ్రతుకంతా భారంగా గడిపేయడానికే నిర్ణయించుకున్నావా ? నీతో బంధాన్ని కలుపుకోలేని నేనూ బ్రతుకు భారంగా యీడ్చవలసిందేనా ? కన్నీళ్ళతో తలగడంతా తడిసిపోయింది. జీవితంలో మొట్టమొదటిసారిగా తను కోరుకున్న ది పొందలేని నిస్సహాయతకు కన్నీళ్ళు కార్చాడు శేఖర్.

రోజులు యధాప్రకారం గడిచిపోతున్నాయి. శేఖర్‌కు మళ్ళీ సంబంధాలు చూసే హడావిడిలో పడ్డారు రఘుపతిరావుగారు. శేఖర్ తోటివాడు చంద్రానికి కూడా పెళ్ళి నిశ్చయమైందని తెల్సిన తర్వాత వారికి మరీ ఆరాటంగా వుంది. అన్నీ వుండి తామింకా ఒక్కగానొక్క కొడుకు వివాహం చేయలేకపోయామే అని బాధగా వుంది రఘుపతిరావుగారికి. మునపటిలా ఏదడిగినా మృధువుగా సమాధానం చెప్పడంలేదు శేఖర్. తల్లి ఏ ద డి గి నా చిరాగ్గా, విసుగ్గా సమాధానం చెప్పేసి వెళ్లిపోతున్నాడు. సంబంధాలు వస్తున్నాయి, పోతున్నాయి. శేఖర్ ఒక్కటీ ఒప్పుకోడం లేదు.

ఆ రోజు మళ్ళీ ఏదో సంబంధం గురించి మాట్లాడుతున్న తల్లితో "అమ్మా ! నేనిక్కడ వుండాలంటే నాకు సంబంధాలు వెదకడం మానెయ్యాలి. లేదంటే నే నీరోజే కలకత్తా వెళ్ళిపోతాను. ఏదో వుద్యోగం చేసుకొని బ్రతుకుతాను" అంటూ విసురుగా చెప్పులు వేసుకొని పొలాలవైపు సాగిపోయాడు. ఆ పిల్లాడి మనస్తత్వమేమిటో తెలియని తల్లి హృదయం తల్లడిల్లిపోయింది. తనతో శేఖర్ అన్న మాటలే భర్తకు చెప్పారు శ్యామలాదేవి. మొదట కేకలువేసినా నిజంగానే కొడుకు అంత పని చేస్తే ఎలాగా ? అన్న భయం ఆయన్నీ బా ధ పె ట్టిం ది. వున్న ఒక్కడూ కళ్ళెదురుగుండా లేకుండా పోతే తాము భరించగలరా ? అందుకే కొన్నాళ్ళపాటు వాడి మనసేవిటో తె లి సే వ ర కూ ఆ పెళ్ళిగొడవలు ఎత్తకూడ దనుకున్నారు. రోజురోజుకూ క్షీణిస్తున్న తన ఆరోగ్యం, కొడుకు పెళ్లైనా కళ్ళారా చూడగలనో లేదో




## మా డాక్టర్ అన్నారు:
## "పాపాయి సున్నితమైన జీర్ణశక్తికి మొట్టమొదట ఫారెక్స్ అలవాటు చేశాకనే ఏ ఇతర ఘన ఆహారాన్నయినా ఇవ్వవచ్చు".

**మొదట ఫారెక్స్ అని డాక్టర్లు అంటారు! ఎందువల్ల?**
3 నెలలు నిండాక పాపాయికి పాలు మాత్రమే తగినంత పోషణనివ్వలేవు. పాపాయి సున్నితమైన జీర్ణశక్తికి తగినట్టు ప్రత్యేకంగా తయారుచేయబడిన ఘన ఆహారం ఫారెక్స్ అతడికి అవసరం.

**ఇంకా ఏ విధంగా ఫారెక్స్ పాపాయి అవసరాలకు సరిపోతుంది?**
మీ పాపాయి మెదడు, శరీరం పెరుగుదల కోసం ఫారెక్స్ సులభంగా జీర్ణమయ్యే ప్రొటీన్లను సరియైన ప్రమాణంలో అందిస్తుంది. శక్తి కోసం కార్బోహైడ్రేట్లు కూడా సమకూరుస్తుంది.
ఫారెక్స్‌లో మీ పాపాయి అవసరాలకు పూర్తిగా సరిపోయి, అతడి రక్తాన్ని ఆరోగ్యంగా ఉంచేందుకు తగినంత ఐరన్ ఉంది. దృఢమైన ఎముకలు, గట్టి పళ్లకోసం కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్ $డి_2$ కూడా తగినంతగా అందిస్తుంది ఫారెక్స్.

**3 నెలలు వచ్చాకనే ఎందుకు?**
ఆహారాన్ని సరిగా జీర్ణం చేసుకొనేందుకు పాపాయికి నమలడం అలవాటు కావాలి. లేకపోతే, నమలకుండా మింగి వేయడం వల్ల అతడి పెరుగుదల దెబ్బతినవచ్చు లేదా కడుపు నొప్పి రావచ్చు.

**"పెద్దలు తినే" ఆహారాన్ని ఎప్పటి నుంచి ఇవ్వవచ్చు?**
మొదటిసారిగా తప్పటడుగులు వేశాక పాపాయికి పళ్లు, కూరగాయలు, పప్పు, గుడ్లు ఇవ్వవచ్చు. కాని, అతడికి మూడేళ్లు వచ్చేవరకు ఫారెక్స్ అవసరం. అంచేత పాపాయి తినేవాటన్నిటిలో దాన్ని కలిపి పెట్టండి.




**పుష్టికరమైన, సంపూర్ణమైన పెరుగుదలకోసం పాపాయి మొట్ట మొదటి ఘన ఆహారం.**

గ్లాక్సో

లింటాస్-GF-58-1710 TL

అన్న బాధ హృదయాన సుళ్ళు తిరుగుతున్నా, శేఖర్‌కు ఇష్టంలేకుండా ఏ పనైనా చేయడం తనకు నచ్చదు కనుకనే ఆఖరికి చదువు విషయంలో కూడా శేఖర్ యిష్టానికే వదలేసారు. ఇంక ఇప్పుడూ శేఖర్ యిష్టానికే వదిలేయక తప్పదనుకున్నారు. ఆ తర్వాత శేఖర్‌ని పెళ్లివిషయమై ఎవరూ బాధించలేదు.

పొలంనుంచి అలసటగా తిరిగివస్తున్న శేఖర్ కాళ్ళు అప్రయత్నంగా గోపాలం గారి ఇంటి ముందుకు రాగానే ఆగిపోయాయి. లోపలినుంచి శ్రావ్యమైన గొంతుతో మాధవి పాడుతున్న పాట మనసుకు హాయికలిగిస్తుంటే, సన్నటి గొంతుల్తో వాళ్ళిష్టమొచ్చిన రాగంతో మిశ్రమ రాగా న్నాలపిస్తూ మాధవి పాడిన చరణాన్ని అష్టవంకరలు తిప్పి పాడుతున్నారు పిల్లలు. వాళ్ళను ఆపి తను మళ్ళీ పాడుతోంది మాధవి. అలాగే కొంచంసేపు నిలబడి ఆ గొంతులోని మాధుర్యాన్ని మనసున నింపుకొని వెళ్ళిపోవాలని కలలు కంటున్న శేఖర్ "అత్తయ్యా !" అనే ఆర్తనాదంలాంటి కేకతో ఈ లోకంలోకివచ్చి గబగబా లోపలికి పరుగెత్తాడు. అప్పటికే క్రింద పడికదల్లేకుండాపడివున్న సావిత్రమ్మను రెండు చేతుల్తో పైకి లేపడానికి ప్రయత్నిస్తోంది మధు. సావిత్రమ్మ చాలా నీరసంగా వుంది. భర్త చనిపోయిన తర్వాత జీవితాశ పూర్తిగా నశించిపోయింది. మాధవి భవిష్యత్‌కు తనుబంధమౌతున్నా నన్న బాధ మరీ వేధిస్తోందామెను. చంద్రం వచ్చినప్పుడు మధు చెప్పిన సమాధానం సావిత్రమ్మ మనసును మరీ చిత్రవధ చేసింది. తనే చేసుకుంటాడనుకున్న చంద్రం వేరే సంబంధం గురించి చెప్పడం "నేనసలు పెళ్ళే చేసుకోనని మాధవి తెగేసి చెప్పడం. ... సావిత్రమ్మ ఆరోగ్యం మీద పెద్ద దెబ్బతీశాయి. ఆనాటినుంచే ఆరోగ్యం అసలు బావుండటంలేదు. లోపల పడుకొని ఉన్నది, మాధవి పాట విని నెమ్మదిగా లేచివచ్చి అరుగు మీదకు చేరుకుంది. అంతే...కళ్ళు తిరిగి అరుగు మీదనుంచి క్రింద పడిపోయింది. పిల్లలందరూ చుట్టూ చేరారు భయం భయంగా చూస్తూ, కొందరు ఏడుస్తూ.

మధుకు సావిత్రమ్మను లేపడం సాధ్యంకావడం లేదు. తొందరగా లోపలికెళ్ళిన శేఖర్ పిల్లలందరినీ తప్పుకోమని చెప్పి, ఓసారి మధువైపు చూసి "పక్క సరిచేయి మధూ లోపలికెళ్ళి. నేను తీసుకొస్తాను" అంటుంటే మరో మాట మాట్లాడే ధైర్యంలేక లోపలికెళ్ళి పక్క సరిచేసింది. ఈలోపల శేఖర్ రెండుచేతులతోనూ సావిత్రమ్మను ఎత్తుకొచ్చి మంచంమీద పడుకోబెట్టాడు. సావిత్రమ్మకు స్పృహలేదు. సావిత్రమ్మ దగ్గరగా కూర్చొని "అత్తయ్యా! అత్తయ్యా !" అంటూ నీళ్ళు నిండిన









# అమృతాంజన్

## శక్తివంతమయిన బాధానివారిణి




# అనోలియమ్

## జలుబుకి సున్నితమయిన మందు




AM-1578 TEL

అమృతాంజన్
శక్తివంతమయినది. తల నొప్పులు, వెన్ను నొప్పులు, కండరాల నొప్పులు, బెణుకులు మరియు జలుబుల నుంచి శీఘ్రంగా ఉపశమనం కలిగించడానికి దానిలో పది శ్రేష్ఠమైన ఔషధాలు వున్నాయి.

అనోలియమ్ జలుబులని, దగ్గులని పారద్రోలుతుంది. మృదువయిన చర్మాలకోసము అది ప్రత్యేకంగా తయారుచేయబడింది.
మీ ఇంట్లో వాటిని ఎప్పుడూ అందుబాటులో వుంచుకోండి.

అమృతాంజన్ మరియు అనోలియమ్ — ఇంటింటా అవసరమయిన నమ్మకమయిన దివ్య ఔషధములు.
**అమృతాంజన్ లిమిటెడ్.**
**80 సంవత్సరాలకు పైగా నమ్మకమయిన గృహ ఔషధములను తయారుచేస్తున్నవారు.**

కళ్ళతో చూస్తున్న మధును చూడగానే అంతులేని ఆవేశం కలిగింది. ఆదరంగా అక్కున చేర్చుకొని ఓదార్చాలనీ ధైర్యం చెప్పాలనీ. అవేమీ చేయలేక నిగ్రహించుకుంటూ అన్నాడు.

"మధూ ! భయపడకు యిప్పుడే వస్తాను," అంటూ బయటకు పరుగెత్తాడు శేఖర్. సరాసరి ఆ వూళ్ళోవున్న ఒకే ఒక ప్రైవేట్ డాక్టర్ దగ్గరకు పరుగునవెళ్ళాడు. డాక్టర్ అప్పుడే క్లినిక్ నుంచి వెళ్ళి రెస్ట్‌తీసుకుంటున్నాడు. శేఖర్ వచ్చాడని చెప్పగానే, బయటకు వచ్చి "రండి లోపలికి" అంటూ ఆహ్వానించాడు. క్లుప్తంగా విషయం వివరించి డాక్టర్‌ను వెంటబెట్టుకొని గోపాలం గారిల్లు చేరాడు శేఖర్. డాక్టర్‌ను, శేఖర్‌నూ చూడగానే ఏడుస్తూకూర్చున్న శ్యాంను ప్రక్కకుతీసి మంచం దగ్గరగా కుర్చీవేసి అత్తయ్య వైపే చూస్తూ నిలబడింది మధు. కూర్చున్న నిముషానికే పరీక్షచేసి లేచి మెడికల్ కిట్ తీసుకొని బయలుదేరిన డాక్టర్ వైపు ప్రశ్నార్థకంగా చూశాడు శేఖర్.

"అయామ్‌సారీశేఖర్! షియీజ్ డెడ్, హార్ట్ ఫెయిలైంది. క్షమించండమ్మా !" అంటూ ముందుకు అడుగులు వేశాడు డాక్టర్. ఆత్రంగా మధువైపు చూసిన శేఖర్‌కు భయమేసింది. నెమ్మదిగా మంచం ప్రక్కకు జారి అత్తయ్యచెయ్యి చేతుల్లోకి తీసుకొని నిమురుతోంది. మధు కళ్ళలో నీళ్ళు లేవు. నిర్వికారంగా వుంది. తనకున్న ఆ ఒక్క పెద్దదిక్కూ పోయిందని తెలిసినా మధు ఏడవడం లేదు. కాదు మధు షాక్ తిన్నట్లుంది. ఎలా ? ఏం చేయాలి ? మధు భుజాలు పట్టుకొని కుదిపాడు "మధూ ! మీ అత్తయ్య చనిపోయారు మధూ!" అంటున్నాడు ఆవేదనగా. మరో ధ్యాసలేకుండా అత్తయ్యనే చూస్తూ కూర్చుంది మధు. శేఖర్ పిలుపు వినిపించినట్లే లేదు

ఇంతలో చుట్టూ మూగిన జనంలో ఎవరో వెళ్ళి చంద్రాన్ని పిల్చుకొచ్చారు. పిన్ని మృతదేహాన్ని చూసి గుండెలవిసేలా ఏడుస్తున్నాడు చంద్రం. ఆ గుండెల మీద పెరిగిన రోజుల్ని గుర్తుచేసుకొని కుమిలి కుమిలి ఏడుస్తున్నాడు. అంతా ఏడవడం చూసి శ్యాంకూడా అర్థమైపోయింది. వాడు అత్తయ్యా ! అత్తయ్యా ! అంటూ పలకని అత్తయ్యని పిలుస్తూ ఏడుస్తున్నాడు. వాడిని ఎవరో ప్రక్కకు తీసుకెళ్ళారు. కానీ మధు కంటి వెంట వొచుక్క నీరుకూడా కారడం లేదు. అంతా ఆశ్చర్యంగా మధునే చూస్తున్నారు. యిరుగుపొరుగులు కూడా సావిత్రమ్మ మంచితనాన్ని తలుచుకొని కళ్ళు తుడుచుకుంటున్నారు. కొందరు మధుని చూసి, "ఆ పిల్ల గుండె రాయమ్మా ! మరొకళ్ళైతే అంత నిబ్బరంగా వుండగలరా ? ఎంత ధైర్యంగా కూర్చుందో చూడండి అయినా యీ

చేసిన పరీక్షల వలన తెలింది...



రుచికీ,
విటమిన్లకూ, పుష్టికీ
బిస్కట్ అంటేనే ఇది

బ్రిటానియా
గ్లూకోజ్-డి



పోల్చి చూసేందుకు చేసిన పరీక్షల వల్ల తెలిందేమిటంటే, విటమిన్లూ, పుష్టినిచ్చే పదార్థాలూ గ్లూకోజ్-డిలో ఉన్నాయని, రుచికి తియ్యదనానికీ, కరకర లాడే రుచికీ దీని కావాలంటారని.

అందుకే మరి ఏ ఇతర గ్లూకోజ్ బిస్కట్ కన్న బ్రిటానియా గ్లూకోజ్-డి అంటేనే ఎక్కువ మంది ఆకర్షితులవుతున్నారు.




బ్రిటానియా

రోజుల్లో కడుపున పుట్టినవాళ్ళకే ప్రేమ ఉండటం లేదు. అయిదేళ్ళగా కడుపులో పెట్టుకొన్నంత మాత్రాన దానికి ప్రేమ ఎక్కడినుంచి వస్తుందిలే!" "పాపం చిన్నప్పుడు ఎత్తుకొని గోరు ముద్దలు తినిపించిన ఆ పిన్ని మీద ఎంత అపేక్షో చూడండి చంద్రానికి అని ఒకరంటే—

"మధూ ! మధూ ! అంటూ ఎంత ఆప్యాయంగా చూశారు. ఆ పిల్లకు విశ్వాసముంది, కనుకే కుటుంబభారాన్ని ఏదో రకంగా మోస్తోంది. సావిత్రమ్మ గారు పోవడం పాపం మాధవికి పెద్ద దెబ్బ" అంటూ తలా ఒక రకంగా వ్యాఖ్యానిస్తున్నారు.

ఎందరో ఎన్నో రకాలుగా సావిత్రమ్మ మంచితనం గురించి, గోపాలం గారి వ్యక్తిత్వం గురించి, గొప్పతనం గురించి పొగుడుతున్నారు. ఆవిడ అంతిమయాత్రకు సానుభూతి చూపుతున్నారు. కొందరు చంద్రాన్ని వోదారుస్తున్నారు. చంద్రం లేచి మధువైపు చూశాడు. ఏకదీక్షగా సావిత్రమ్మ ముఖంలోకే చూస్తోంది మధు. మధు ముఖంలో ఏ భావమూ వ్యక్తంకావడం లేదు. ఆ నిశ్శబ్దమూర్తిని చూసి ఆగలేక పోయిన శేఖర్ ధైర్యంచేసి చంద్రం భుజంమీద చెయి వేసి "చందూ ! మధును తీసుకెళ్ళమని చెప్పరా అమ్మతో" అన్నాడు బాధగా. అలా చూడలేను అన్న భావం ధ్వనించింది శేఖర్ గొంతులో. చంద్రం తల్లి నెమ్మదిగా లేచి కళ్ళు తుడుచుకుంటూ, మధుని లేపి లోపలికి తీసుకెళ్ళింది. యాంత్రికంగా మర మనిషిలా నడుస్తున్న మధును చూస్తే శేఖర్ హృదయం ద్రవీభూతమైంది. కానీ తను అశక్తుడు. మధు తనకు అర్హత,అధికారం యిచ్చి వుంటే ఎందరున్నా లెఖ్ఖచేయక ఎదపై చేర్చుకొని, మధు తనివితీరా ఏడ్చి హృదయాన్ని తేలికపరచుకొనే వరకూ అలాగే ఆమె తలనిమురుతూ, తన విశాలమైన బాహువుల్లో బంధించి ధైర్యం కల్గించేవాడేమో ! తనకా అదృష్టం ఏదీ ? ఈ నాలుగేళ్ళూ మధు ఎదురుపడ్డప్పుడల్లా మనస్సును నిగ్రహించుకొనడానికి చేసిన ప్రయత్నం ఓ తపస్సులా నిర్వహించాడు.

మనసు అదుపు తప్పుతున్నదనుకున్నపుడల్లా పొలంవైపు పరుగెత్తి అక్కడినుంచీ గంగాతీరం వైపు మళ్ళి ఏకాంతంగా గంటలు గంటలు గడిపేసేవాడు. ఒక్కోసారి తన కత్యంత ప్రియమైన గంగాపూర్‌నూ, పసిడి పంటల పొలాల్ని ఇంతదివాడైనా అప్పుడప్పుడూ అమ్మచేత ముద్దలు తినే ఆనందాన్ని, ప్రాణప్రదమైన చందూ స్నేహాన్నీ, కోడలిని తెచ్చుకోవాలనీ మనవడి నెత్తుకోవాలనీ ఆత్రపడే పితృ హృదయాన్నీ, అన్నింటినీ, అందర్నీ

వదిలేసి, ఎక్కడికో తెలీని దూరదేశా లకు పారిపోవా లనిపిస్తుండేది. మళ్లీ అంతలోనే ఆ యింటికి వారసుడుగా తన కర్తవ్యం గుర్తొచ్చి, తన పిచ్చి ఆలోచనలకు స్వస్తిచెప్పి పవిత్ర గంగా నదిలో కొంత సేపు స్నానంచేసి ఆ చల్ల దనాన్ని మనసున నింపుకునే ప్రయత్నం చేస్తూ, చాలా సేపు అలాగే వుండి పోయి గంగానదిలోకి వొరిగిపోతున్న సూర్యుణ్ణి చూస్తూ కాలాన్నిగడిపేవాడు. మరీ పిచ్చెత్తిన ట్లనిపించినప్పుడల్లా కలకత్తా వెళ్ళాలనిపించేది. శిరీష్, సుషమల స్నేహంలో కొంత మనశ్శాంతి దొరుకుతుందని. ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తుండే శిరీష్ తన ప్రక్కన వున్న వాళ్ళందరిని మంచి మూడ్స్‌లో పెట్టగల నేర్పరి. గోపాలంగారు పోయిన తర్వాత అనుకున్నప్పుడల్లా కలకత్తా వెళ్ళే స్వేచ్ఛ కూడా కరువైంది. యింటి మనిషి లేకుండా పొలం పనులు అయ్యేవి కావు. ఎంతమంది పనివాళ్ళున్నా, దగ్గరుండి చూసుకోకపోతే పనులు సక్రమంగా అయ్యేవికావు. కానీ......యీ రోజు మధును చూస్తుంటే ఎవర్నీ లెఖ్ఖచేయా లనిపించడంలేదు. లోపలికెళ్లైనా సరే మధుని మామూలు మనిషిగా మార్చాలని పిస్తోంది. మనసు వశం తప్పుతోందని గ్రహించిన శేఖర్, చంద్రం భుజం మీద మెల్లగా తట్టి, "యిప్పుడే వస్తాను చందూ !" అతి ప్రయత్నంమీద ఆ మాట చెప్పి అరచేత గుండెల్ని రాసు కుంటూ, వీధిలోకొచ్చిన శేఖర్ కళ్ళు

## సవరణ

అక్టోబరు 'క్విజ్' సమాధానాలలో అచ్చు పొరబాట్లు దొర్లి నందునకు విచారిస్తున్నాం. 7 వ ప్రశ్నకు సమాధానంగా 1927 కు బదులు 1972 అని పడింది. ఆ ప్రశ్నకు సమాధానం 1972 గా చదువుకో ప్రార్థన.

సంపాదకుడు
యువ

నీటితో నిండిపోయాయి. తెలీని బాధ. గుండెలో సన్నగా నొప్పి ప్రారంభ మైంది. ఈ మధ్య తరచు వస్తోం దీ నొప్పి, ఎక్కువగా ఆలోచించి నప్పుడల్లా నొప్పి ఎక్కువౌతోంది. ఆక్రందించవలసిన సమయంలో, అయో మయంగా చూస్తూ, నిశ్చలంగా వున్న మధు రూపం కళ్ళముందు కనిపించి కలవర పెడుతోంది. అంతరంగాన వువ్వెత్తునలేచే అనురాగపు తరంగాలను అతిప్రయత్నం మీద అణచుకోడానికి ప్రయత్నిస్తూ నెమ్మదిగా యిల్లు చేరుకున్నాడు శేఖర్.

అప్పటికే వార్త తెలిసిన శ్యామలా దేవి శేఖర్‌ని చూడగానే, "బాబూ! మధుని పలకరించి వచ్చావురా! పాపం ఆ పిల్ల ఎంత దురదృష్టవంతురాలు. ఉన్న ఆ ఒక్క పెద్దదిక్కూ పోయింది. నేనోసారి వాళ్ళింటికి వెళ్ళి వస్తానండీ!" అని తండ్రి నడుగు తున్న తల్లివైపు ఆశ్చర్యంగా చూశాడు శేఖర్. అంతలోనే తృప్తిగా మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకొన్నాడు తల్లికి.

జమిందారీ వంశం వారిది. జమీలు పోయినా వారిని జమిందారులుగానే ఎంచేవాళ్ళు. శ్యామలాదేవి ఎన్నడూ ఎవరిళ్ళకు వెళ్ళేదికాదు. శుభకార్యాల ప్పుడు వాళ్ళెవరైనా వచ్చి బలవంతం చేస్తే, తప్పనిసరైన వాళ్ళనుకుంటే వెళ్ళేవారు. అంతకు తప్పించి తల్లి బయట అడుగుపెట్టడం చూడలేదు. అందులోనూ తనంతట తానే తండ్రి నడగటం యిదే మొట్టమొదటిసారి శేఖర్ అనుభవంలో. శాంత పెళ్ళికి చంద్రం వచ్చి తీసుకెళ్ళితే వెళ్ళింది, తప్పనిసరై. "మీరు లేకుండా శాంత పెళ్ళెలాగౌతుందమ్మా!" అని చంద్రం అంటుంటే "మీ నాన్నగారు, శేఖర్ వస్తున్నారుగా చందూ!" అని తప్పించుకోజూసిన శ్యామలాదేవిని బ్రతిమిలాడి ప్రక్క బజారున వున్న యింటికి, బండికట్టి తీసుకొచ్చి, తీసు కెళ్ళాడు చంద్రం. అలాగే గోపాలంగారు పోయినప్పుడు రఘుపతిరావుగారు వెళ్ళ మని చెబితే వెళ్ళింది. అలాంటి అమ్మ యీ రోజు తనంతట తాను మధుని పలకరించి రావడానికి వెళతా నంటున్నదంటే......అది మధు మంచి తనంలోని మహిమ అనుకోవాలో... అవధులు దాటిన తల్లి అభిమానమను కోవాలో అర్థంకాలేదు శేఖర్‌కు. "పద నేనూ వస్తాను" అంటూ పైపంచవేసుకొని బయలుదేరుతున్న రఘుపతిరావుగారిని మరింత విస్మయంగా చూశాడు శేఖర్. తనవైపు చూసిన తల్లితో, "నేను వెళ్ళే వస్తున్నానమ్మా" అని చెప్పి పైకి వెళ్ళి పోయాడు నెమ్మదిగా శేఖర్.

గోపాలంగారు చనిపోయిన తర్వాత మధు ఎన్నోసార్లు తమ యింటికిరావడం

జ్ఞాపకం వచ్చింది. తల్లితో చనువుగా మాట్లాడటం, ఆవిడకు స్వెట్టర్ అల్లడం నేర్పాలని ప్రయత్నించి సాధ్యంకాక తనే ఓ స్వెట్టర్ అల్లి యివ్వడం, అది చూసి మధు పనితనాన్ని తల్లి మెచ్చుకోడం అన్నీ వరసనే జ్ఞాపకం వస్తున్నాయి. నిలబడలేక అలాగే కుర్చీలో జారగిలబడ్డాడు శేఖర్. గుండెనొప్పి ఆ రోజు తీవ్రంగా వుంది. అంతవరకూ ఎవరికీ చెప్పలేదు. చెప్పాలని కూడా అన్పించడం లేదు.

*      *      *

శ్యామలాదేవి, వెనకే వెండిపొన్ను కర్ర చేతబట్టుకొని రఘుపతిగారు రావడం చూసి, అంతా పక్కకు తప్పుకొని దారిచ్చారు. చంద్రం వాళ్ళిద్దరినీ చూసి లేచి రెండు కుర్చీలు ముందుకు జరిపాడు. కళ్ళవెంట జలజలా కన్నీరు రాలిపోతోంది చంద్రానికి. ఓ క్షణం నిర్జీవంగా పడివున్న శుష్కించిన సావిత్రమ్మ మృతదేహాన్ని చూసి, దీర్ఘంగా నిట్టూర్చి, "చందూ ! బంధువులందరికీ కబురు చేశావా ?" అన్నారు రఘుపతిగారు. కళ్ళు తుడుచుకుంటూ "ఎవరు

# నవంబరు నెల క్విజ్

## సమాధానాలు

1 — ఎ      2 — సి      3 — డి

4 — బి      5 — బి

6. మొహంజొదారో
7. చక్రపాణి
8. చైనీస్
9 1-30 P M.
10. నారు

నవంబరు నెల క్విజ్‌కు ఆల్ కరెక్టుగా సమాధానాలు పంపినవారు ఎవ్వరూ లేరు. అందువల్ల రూ. 116 బహుమతి సొమ్మును జనవరి నెల 'క్విజ్‌కు' చేర్చడమైంది.

న్నారు నాన్నగారూ ! శాంతకు కబురు చేశాము ఓ గంటలో అది వస్తుంది. ఇంక శ్రీధర్ గారికి ఓ టెలిగ్రాం యిమ్మని మనిషిని పంపాను. అయినా వారొచ్చేంతవరకూ ఎలాగూ వుంచ లేము. పూరికే తెలియచేయాలని" అన్నాడు చంద్రం. "ఎలా పోయారు?" అంటూ వివరాలుఅడిగింది శ్యామలాదేవి.

"నాకేం తెలీదమ్మా ! నే వచ్చేసరికే అంతా అయిపోయింది. మధుకు తెల్సి వుంటుంది. కానీ మధు ఎవరేమడిగినా సమాధానం చెప్పడంలేదమ్మా" అన్నాడు చంద్రం. మధు దగ్గరికెళ్ళింది శ్యామలాదేవి.

కిటికీలోనుంచి ఆకాశంవైపు చూస్తూ ఏదో దీర్ఘాలోచనలో మునిగివున్నట్లుంది మధు. శ్యామలాదేవి వెళ్ళి భుజంమీద చెయివేసినా చలనంలేదు. గడ్డం పట్టుకొని మధుముఖం తనవైపు తిప్పుకున్న శ్యామలాదేవి ఆశ్చర్యపోయింది. మధు ముఖం మామూలుగా వుంది. ఆమె ఏడవడంలేదు. ఆ చూపుల్లో జీవం లేదు. అలావున్న మనిషిని ఎలా వోదార్చాలి. ! గుండెలవిసేలా ఏడుస్తుందేమో గుండెల్లో దాచుకొని వోదార్చాలని వచ్చిన శ్యామలాదేవికి నిరాశే ఎదురైంది. ఎంతో అభిమానంగా, ఆత్మీయంగా మాట్లాడే మధు మాట్లాడదేం ?అలా చూస్తుండిపోయిందేం? అయస్కాంతంలా ఆకర్షించే ఆ కళ్ళలోని కాంతి ఎటు పోయింది ? పది నిముషాలు అలాగే నుల్చున్నా శ్యామలాదేవి మనసులోని ప్రశ్నలకు సమాధానం దొరకలేదు.

అప్పుడే లోపలి కొచ్చిన చంద్రం తల్లి కుర్చీ తీసుకొచ్చి మంచంపక్కనే వేస్తూ "కూర్చోండి !" అంటూ శ్యామలాదేవి వైపు చూసింది. అప్పటికీ మధు నోరు విప్పి మాట్లాడలేదు. మరోసారి జాలిగా మధువైపు చూసి, చంద్రం తల్లితో "వస్తాను" అని మాత్రం చెప్పి, బయటకు వచ్చిన శ్యామలాదేవి అప్పటికే కండువా సర్దుకుంటూ, వెళ్ళడానికి సిద్ధంగా వున్న రఘుపతిరావుగారితో కలిసి యిల్లు చేరారు.

యధావిధిగా దహన సంస్కారాలన్నీ తన చేతులమీదుగానే పూర్తిచేసిన చంద్రం స్నానంచేసి లోపలికి రాగానే శాంత వచ్చి, "అన్నయ్యా ! మధు వదినేమిటన్నయ్యా అలా వుంది ? పిలిస్తే పలకడంలేదు. వెర్రిగా చూస్తోంది. నాకు భయమేస్తోందన్నయ్యా ! మధుని మాట్లాడమను" అంటూ చంద్రాన్ని చుట్టేసి బావురుమంది.

(సశేషం)

Printed and Published by A. Chandra Sekar Rao at 5-8-88, Public Garden Road Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor : A. SUDHAKARA RAO

ఇంటి అద్దె...స్కూలు ఫీజులు...
కిరాణాకొట్టు బిల్లులు...ఎలక్ట్రికల్ బిల్స్

లైఫ్ ఇన్సూరెన్సు ప్రీమియములు.



# జీతాల రోజే ప్రీమియం చెల్లించే రోజు

మీరు ఒక ఆఫీసులో పనిచేస్తూ నెలనెలా జీతం తీసుకుంటుండవచ్చు లేదా మీరు ఏదైనా వ్యాపారం చేస్తుండవచ్చు. మీకు డబ్బు నిశ్చితమైన రూపంలోగాని లేదా అప్పుడప్పుడు గాని వస్తుండవచ్చు. మీకు రాబడి ఏవిధంగా, ఎప్పుడు వస్తుందీ అన్నది కాదు. మీ ఎల్ ఐసి ప్రీమియం గూర్చి ఆలోచించండి. ఇది ఆహారం, ఇంటి అద్దె మరియు ఇతర అత్యవసరమైన వాటితో సరిసమానమైనది. ఏమైనా భద్రత చాలా అత్యవసరమైనది. అవునా !




## లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

RADEUS/LIC/AS-20